# ANANDA
# EIGHTH READER.

## (SEVENTH READER REPRINT)

TELUGU

# ఆనందపాఠకపుస్తకము

ఎనిమిదవ తరగతి.

---


BY

KUCHI NARASIMHAM, B.A.,

AND

PANUGANTY LAKSHMI NARASIMHA RAO.


---

Approved by the Director of Public Instruction, Madras.

---


1930.

R. VENKATESHWAR & Co.,

LOANE SQUARE, MADRAS.

ఆర్. వేంకటేశ్వర్ అండ్ కో

లోన్ స్క్వేర్ మద్రాస్.




Price 8 Annas.] [వెల 8 అణాలు.

# AN ANDA READRES.

We publish these Readers with a view to meet the latest requirements of the Secondary and Elementary schools, from Class or Standard I to Standard VIII, and provide the pupils with material for study suited to their age and development.

The Subjects of each Reader are such as would not fail to awaken interest in the pupils of the class for which they are intended. Care has also been taken to see that their presentation is not dry.

In quantity, variety and quality of matter, in the gradation of the Readers and in the choice of language, the capacity of the average student and the demands of the department are kept in view. We have done our best to lead the student gradually from the familiar to the unfamiliar, the simple to the complex, and the concrete to the abstract.

Among the topics chosen are some taken from plants and animals and other interesting branches of study without their dry scientific details, and treated with the same clearness and simplicity of expression with which general subjects are treated.

The language adopted throughout is simple and idiomatic, free, on the one hand, from archaic forms and learned words, on the other, from the ungrammatical colloquialisms varying from place to place.

The non-observance of certain rules of coalescence (*Sandhi*) in Readers for the lower classes is, in our opinion, a welcome and reasonable departure already made by the acknowledged great Telugu prose writers of the day; and we have not hesitated to follow them judiciously, only to avoid obscurity of meaning and the like.

Poetry has been included in each Reader, either at the end or in the body of the book. Lines for lower standards are entirely original, written mostly in the simplest *manjari* metre and can be sung by pupils in more than one way.

Verses for higher Standards and Forms are partly original and partly consist of selections made with great discrimination from the best old poets. Only such verses as have in them real poetic beauty have been selected and printed with brief introductory notes.

At the end of each Reader are given, for the guidance of the teacher, a few elementary principles of grammar which, we believe, can profitably be taught to the class.

In Readers for lower classes, hard technicalities of grammar are carefully avoided as far as possible; in higher Readers, they are introduced, where absolutely necessary, with clear explanations in simple words. The teacher, in explaining the principles, is expected to draw examples from the studied portions of the Reader and make the lesson interesting. A clever teacher can also make the boys frame the rules themselves by observation of individual cases and generalisation from them.

**We shall accept, with grateful thanks, all *bona fide* suggestions from experienced teachers and others, for the improvement of these Readers in their next edition.**

**THE PUBLISHERS.**

# ఉపోద్ఘాతము.

రెండవతరగతి మొదలుకొని ఎనిమిదవతరగతివఱకు, అనఁగా మూఁడవ ఫారము చివరవఱకుఁ జదువుకొనుబాలురకుపయుక్తమగునట్లువాచకపుస్తకములను వ్రాయ నెంచితిమి. బాలురవయస్సును సమర్థతను మనసునందుంచుకొని, యేవిషయములఁగూర్చి చెప్పినయెడల వారు బాగుగ గ్రహించుకొనఁగలరో యట్టివిషయములఁ గూర్చియే వ్రాసెదము. ఆవిషయములైనను బాలురు నేర్చుకొనుట కుత్సాహపడునట్టివియే యేర్చి వ్రాసెదము. విసుగు పుట్టకుండునట్లు వేఱువేఱు విషయముల బోధించెదము.

అదిగాక, బాలుర వయస్సు, బుద్ధి, యెట్లుక్రమక్రమముగ వృద్ధినొందునో పాఠములలోనికష్టము, విషయములలోనికష్టము, నట్లు వృద్ధినొందునట్లు సాధ్యమైనంతవఱకుఁ జూచి వ్రాసెదము. మే ముపయోగించుభాష సులభముగనే యుండును; కాని యదిగూడఁ బైతరగతులకుఁ బోయినకొలఁది బాలుర వయస్సమర్థతల కనుకూలించునట్లు రవంత ప్రౌఢము కాకమానదు. అంతే కాని యతిదీర్ఘములగుసమాసములనుగాని వాడుకలోలేని గ్రాంథికశబ్దములనుగాని యుపయోగించి భాషను దుర్గ్రహముగఁ జేయము. మఱియు వాడుకలో నున్నపదములుకదాయనియెంచివ్యాకరణదుష్టరూపములను బ్రయోగింపము.

మొక్కలను గూర్చికాని జంతువులఁ గూర్చికాని వ్రాయునప్పుడైనను, వృక్షజంతుశాస్త్రములలోనిదుర్గ్రహాంశము లందుఁ జేరనీయక, తెలుపఁదగిన ముఖ్యాంశములను వదలక, సామాన్యపాఠములవలెనే యవిగూడ సుబోధము లగునట్లు వ్రాసెదము. శాస్త్రవిషయక పాఠములను జదువుకొనునప్పుడైనను వానిలోని విషయములను గ్రహించుకొను నొత్తుడుబాలురచిత్తములకుఁ దగులకుండునట్లుగాఁ బాఠరచనాపద్ధతి చిత్తరంజకముగా నుండునట్లు చేయఁ బ్రయత్నింతుము.

అడుగుతరగతుల వాచకపుస్తకములలో, విసంధులను గొన్నికొన్నిపట్లఁ బేరుగన్న యాధునికవచనగ్రంథకర్తలు వాడియున్నారు. అట్లొనర్చుట మంచిదనియే మాయభిప్రాయము. అయినను వానిని మే మొక్కనియమము ననుసరించి జాగరూకతతో వాడెదము. శబ్దముల కర్థము స్పష్టము గాదని తోఁచినచోట్లఁగాని, విపరీతార్థము లగునని తోఁచినచోట్లఁగాని, విసంధుల నుపయోగించెదము. శ్రవణకటుత్వము కలుగునని తోఁచిన కొన్నిచోట్లఁ గూడ వాని నుపయోగించెదము.

వాచకపుస్తకము లనడుమఁగాని తుదనుగాని కొన్ని పద్యములఁ జేర్చెదము. అడుగుతరగతుల పుస్తకములలోని పెక్కుపద్యములు స్వకల్పితములు. అవియెల్ల సుమంజరీలక్షణ సమన్వితములై యుండును. దసరాపాటలవలె నింపుగ బాలురు పాడుకొనుట కర్హములై యుండును గావున, మంజరీలక్షణమును బద్యరచన యందుపయోగపఱచెదము. పైతరగతుల వాచకపుస్తకములలోని పద్యములు కొన్ని స్వకల్పితములును, కొన్ని పూర్వకవిరచితములును నైయుండును. పూర్వకవిగ్రంథములలోనియే పద్యములు రసవంతములై నీతిబోధకములై యుండునో యాపద్యముల నేయేర్చి వాచకపుస్తకములందుఁ గూర్చెదము. వానిలోఁ గథాసందర్భములఁ దెల్పు కొన్ని వాక్యములను సంక్షేపముగ వ్రాసెదము.

వ్యాకరణములోని సులభాంశములఁ గొన్నిటిని వాచకపుస్తకములతుదను జేర్చెదము. వీని నాయాతరగతులయుపాధ్యాయులు చూచి బాలురకు బోధించుట మంచిదని మాయభిప్రాయము. అడుగుతరగతులవాచకపుస్తకములలో వ్యాకరణ పరిభాషాపదములకు సాధ్యమైనంతవఱకుఁ జోటీయము; కాని, పైతరగతి పుస్తకములలోమాత్రము వాని ప్రయోగము లావశ్యకము లైనప్పుడవి యుపయోగించెదము. అయినను సులభములగు మాటలతో నాయాపదముల కర్థము లాతావులందే వ్రాసెదము. వ్యాకరణసూత్రములను కేవలసూత్రరూపముగ బోధించుటకంటె నీదిగువను జెప్పినవిధముగ బోధించుట యుక్తమని మాయభిప్రాయము. ఏసూత్రము నుపాధ్యాయుఁడు బాలురకు బోధింపఁగాంచునో యాసూత్రము క్రిందఁ దగిన యుదాహరణములను సాధ్యమైనంతవఱకు వాచకపుస్తకములలోనివే యేఱిబాలురయెదుటఁ బెట్టవలయును. అన్ని యుదాహరణరూపములందుఁగూడ సమానముగఁ గలిగిన మార్పేదో సమానలక్షణమేదో బాలురు తమంతఁదాము పరిశీలించి గ్రహించుకొనునట్లుపాధ్యాయుఁడు చేయవలయును. ఆసామాన్యపుమార్పేదో యదియెప్పుడుకలుగునో బాలురనోటనే సాధ్యమైనంతవఱకుఁ జెప్పింపవలయును. అదియే, కాలోచితమగు చిన్ని వ్యాకరణసూత్రమగును. వ్యాకరణాంశములనీరీతిగ బోధించుట యుత్తమము. బోధనవిపుణులగు నుపాధ్యాయుల కట్లు చేయుట కష్టముకాదు.

విశేషానుభవము గలిగినయుపాధ్యాయులుగాని తదితరులుగాని మావాచకపుస్తకములలో నేవైనలోపములున్నయెడల దయాపూర్వకముగఁ గనఁబఱచినచో, వానిని కృతజ్ఞతాభివందనములతో గ్రహించి తరువాతి కూర్పులో సవరించుకొనెదము.

---

# బోధనపద్ధతులు.

1. బొమ్మలున్నచోటఁ గేవలము బొమ్మలనుండియే పిల్లవాఁ డెంత గ్రహింప గలఁడో ప్రశ్నలువేసి కనుఁగొనవలెను.

2. ఆపాఠమున కనుకూలించు నితరపటము లేవైన లభించినయెడల, నవి చూపవలెను.

3. పిల్లవాఁడు పాఠము చదువునప్పు డుచ్చారణలోపము లున్నచో, నవి వెంటనే సవరింపవలెను.

4. పూర్వపుమార్గముగాఁ బ్రతిపదార్థములు చెప్పుటమాని, ప్రశ్నలువేసివాక్యముయొక్క యర్థమును సాధ్యమైనంతవఱకు బాలురచేతనే చెప్పింపఁ బ్రయత్నింపవలయును.

5. కఠినమైనమాటలకుఁ దక్క, సామాన్యముగా వాడుకౌనుమాటలకుఁబర్యాయపదములు చెప్పనక్కఱలేదు. 'అంపము' నకు 'క్రకచ' మనికాని 'కరపత్ర' మనికాని యర్థము చెప్పఁగూడదు. దానికి బదులుగా చిన్నమాటలతో వర్ణించియో, అంపమునుగాని అంపపుబొమ్మను గాని తెచ్చిచూపియో బాలురకుఁ దెలుపవచ్చును. వారి కది యిదివఱకే తెలిసినయెడల నర్థము చెప్పుటే యనావశ్యకము. కఠినపదములకు సులభపర్యాయపదములు చెప్పవచ్చును.

6. పాఠములో విషయము ముఖ్యము గనుక, నది బాలురకు స్పష్టమైనదో లేదో ప్రశ్నలమూలమున జాగ్రత్తతోఁ గనుఁగొనవలెను. పాఠములక్రింది ప్రశ్నలు కొంతవఱకు సహాయములగును.

7. అర్థసంబంధమైనవి గాని, భాషాసంబంధమైనవి గాని, చమత్కారము లేవైన నున్నయెడల వానిని స్పష్టీకరింపవలెను.

8. పాఠము ముగించినతరువాత దానిని సంక్షేపముగాఁ గ్రిందితరగతులలో బాలురచేతనోటఁ జెప్పింపవలయును. పైతరగతులలో నట్లు చెప్పించుటయే కాక వ్రాయింపవలెను. ఆవ్రాసినవానిలో నభాషాదోషములను దదితరదోషములనుబిల్లవానిచేఁ గనుఁబఱచి సవరింపించుటగాని సవరించుటగాని చేయవలెను.

9 సంభాషణరూపములుగా నున్న పాఠము లనుకూలములైనయెడల బాలురచే నాటకభాగములవలె నప్పుడప్పు డాడింపవచ్చును.

10. కోలపాటలు, దసరాపాటలు మొదలగువానివలె బాలురచే ద్విపదలను మనోహరముగాఁ బాడింపవచ్చును.

11. క్రిందితరగతులలోఁ బ్రతిపాఠములో వచ్చు జంతువులనుగాని, వానియవయవములను గాని, యితరవస్తువులను గాని, బాలురసమర్థతలనుబట్టి, వీలైనంతవఱకు, బొమ్మలు గీయింపవలెను, రేగడిమట్టితో వానిని జేయింపవలయును, అట్టలతోను, కాగితములతోను, వానియాకారములను గత్తిరింపఁజేయవలెను, దారములలోఁ గుట్టింపవలెను, తీఁగలతో నల్లింపవలెను.

# విషయసూచిక.

# Table of Contents.

## మొదటిభాగము.



### PART I.

# 1. పకీరులు.

కొందఱు పకీరు లొక చిన్న సంఘముగాఁ గూడి దేశాటనము చేయుచుండిరి. నేను వారిని దర్శించి "నన్నుఁగూడ మీసంఘమునఁ జేర్చుకొనుఁ"డని ప్రార్థించితిని. వారు నాకోరికను నిరాకరించిరి. "దైవభక్తులారా! మీ కిది న్యాయమా! కరుణాభరణాంతఃకరణు లగు మీరిట్లానతీయవచ్చునా? ఒక్క బీదవానిని దరిఁజేర్చి యాదరించి కూడఁగట్టుకొని పోలేరా? నేను నీరోగుఁడను. దృఢశరీరుఁడను. నేను మీకు సేవయొనర్పఁ బ్రయత్నించువాఁడను గాని, మీచే రవంత యుపచారమైనఁ జేయించుకొనువాఁడను గాను. మీకు శక్తివంచన లేకుండ సాహాయ్య మాచరించువాఁడను గాని మీ సంఘమునకు లేశమైన భారముగా నుండువాఁడను గాను" అని నేను వారితో నంటిని.

అప్పుడు వారిలో నొకఁ డిట్లు నాకుఁ బ్రత్యుత్తర మిచ్చెను. మీ యభీష్టము నెఱవేర్ప లేదని మీ రాగ్రహపడవలదు. కొలఁది దినముల క్రిందట నొక తస్కరుఁడు విరాగ వేషధారియై మమ్ముఁ జేరి మాతో సఖ్యమొనర్చి మా సంఘమునఁ గలిసెను.

> గీ. మనుజుపై వేషమును బట్టి ♦ మనుజుహృదయ
> మెఱుఁగఁగలవాఁ డెవఁడు పరా ♦ త్పరుఁడు దక్క,
> నొక్క లేఖకుఁడే తక్క ♦ నుత్తరమున
> నేమి వ్రాయంగఁబడినదో ♦ యెవ్వఁ డెఱుఁగు!

అని కవి పలికెను గాదా? అదిగాక

గీ. మహిని వైరాగి, కాషాయ ♦ మాత్రముననె
తప్పకుండఁ బూజ్యుఁ డని పె ♦ ద్దలు వచింప,
నతఁడు మిథ్యావిరాగుఁ డౌ ♦ నని భ్రమించి
వాని సేవింప నొల్లని ♦ వాఁ డెవండు?

గీ. జేగుఱుగుకాటి యాచార్య ♦ శేఖరుండు
ధారణ మొనర్చువస్త్రంబు; ♦ దానివలన
నతఁడు పూజ్యుఁ, డితరచింత ♦ లనవసరము;
మతమునకు బాహ్యలక్షణ ♦ మతని కుండు.

గీ. ఈవు సత్కార్యముల నాచ ♦ రించువాఁడ
వేని, యేది ధరించిన ♦ నేమి నీకుఁ?
దలను మకుటంబునైనను ♦ దాల్పఁదగును,
భుజమునపై డవాలినైనఁ ♦ బూనఁదగును.

గీ. శాంతిదాంతుల, వైరాగ్య ♦ సంపదలను
బరమవేదాంతివై నీవు ♦ ప్రబలియుండు;
వంతయే కాని జేగుఱు ♦ టంబరంబు
జ్ఞాని నినుఁ జేయు నని నమ్మఁ ♦ జనదు! చనదు!

గీ. ఆయసంపుఁదనుత్రాణ ♦ మాహవప్ర
శస్త్ర నిస్తుల శౌర్యప్ర ♦ సాధనాఢ్యుఁ
డైన వీరాగ్రణికి నర్హ ♦ మగును గాని
త్రాసయుతునకుఁ గొజ్జాకుఁ ♦ దగదు! తగదు!

అని కవి పలికెను గాదా?

ఒక దినమున మేము మా నూతన హితునితో రాత్రి యగు వఱకుఁ బ్రయాణ మొనర్చియా రాత్రియందొక భాగ్యవంతుని భవనమునకు సమీపమున నిద్రించితిమి. కొంత

రాత్రియైన పిమ్మట మామిత్రుఁడు తన సమీపమునఁ బండు కొన్న వానిచెంబు తీసికొని స్నానార్థ మని చెప్పిపోయెను.

గీ. పూజ్యమగునట్టి కాషాయ • మును ధరించు
పాపచిత్తుఁడు బహు దుష్ట • వర్తనుండు,
మహామదు సమాధిమీఁదియం • బరము నకట!
గార్దభముమీఁది బొంతను • గా నొనర్చు.

అని పెద్దలు చెప్పిరి కాదా? అట్లు పోయిన మా మిత్రుఁ డొక మహా ధనవంతుని మందిరముఁ దూఱి రత్నాభరణముల పెట్టె నొకదానిని దస్కరించి, తెల్లవాఱు నప్పటికి గ్రామ మును విడిచి కొంతదూరము పోయెను గాని, యదృష్టహీనుల మగు మే మక్కడనే నిద్రపోవుచుంటిమి. ఉదయమైన వెంటనే రక్షకభటులు వచ్చి మమ్ముఁ గోటలోనికిఁ దీసికొనిపోయి యచ్చట బంధించిరి. అప్పటినుండియు నితరుల నెవ్వరిని మేము మాలోఁ జేర్చుకొనుట మాని ప్రచ్ఛన్నముగాఁ గాల క్షేపముఁ జేయుచున్నాము.

ద్వి. సంఘమై ముఖ్యంబు • సౌఖ్యప్రదంబు
సంఘమే బహు దుఃఖ • సంపాదకంబు.

అని బుద్ధిమంతులు చెప్పలేదా?

గీ. ఒకని దుష్టాత్మతను బట్టి • యొకని జాతి
కంతకును వచ్చుఁ దఱచుగా • నప్రతిష్ఠ;
మంద నొక యావు పరిపాల • మంద మేయు
మందకంతయుఁ దఱచుగా • బందకాదె!

ఇట్లాతఁడు పలికి యూరకుండ నే నిట్లంటిని.

నేను మీ సంఘమున కర్షుఁడను గానని మీకుఁ దోఁచి నందులకు విచారించుచున్నప్పటికి, భగవత్కటాక్షమున నేను విరాగుల సద్గుణపరంపరలు గలిగియున్నందులకు సంతసించుచున్నాను. మీ స్నేహలాభమును నాకు మీరు కలుగనీయ నప్పటికిని మీ కథవలని లాభమును గలుగ నిచ్చినారు. దీనిని సర్వదా మనమున నుంచుకొందును.

గీ. మలినుఁ డొకఁడుండ స్వచ్ఛాత్మ • మధ్యమందు,
నంటఁబడును డాగుపడినట్టు • లుండు రకట!
వలపుఁబన్నిటితో స్త్రీలో • పలను గుక్క
పడిన, నెట్లుండునో చెప్ప • వలయు నయ్య!

---

# 2. భూతదయ,
# అల్పజంతువుల యుపయోగము.

స్వపర ప్రాణసంరక్షణార్థము వ్యాఘ్ర వ్యాళాదిక్రూర ప్రాణుల సంహరించుట తప్పుగాదు. కాని, నిరపరాధము లగు నీఁగలను, నత్తలను, గిల్పలను, నితరములైన యట్టి చిన్న జంతువులను జంపుటయు, బాధించుటయు నతిపాపము. కాని కొందఱు బాలు రట్లుచేయుచున్నారు. వానిని బీడించుటవలన మన కేమియు లాభములేదు. అవి విలవిలఁ గొట్టుకొనుచుండుటయే మాకు వినోద మనియనుట యుచితము కాదు. మన కంటె బలవంతులు మనల హింసించుచుండిన, మన కెట్లుండునో యూహించుకొనినచో, నట్టిదుష్టకృత్యములఁ జేయుట కెప్పుడును మనకు మన సొప్పదు.

కానిపనులు చిన్నచిన్నవిచేసి క్రౌర్యమున కలవాటుపడిన యెడలఁ, గ్రమక్రమముగా ఘోరహత్యలలోనికి దిగుదుము. కనుక నట్టివిషయములలో ప్రథమముననే జాగ్రత్తపడవలెను.

పురాణములు నిజము గానిండు, అబద్ధములుగానిండు. అందలి కథ లనేకములైన నీతుల నుపదేశించుచున్నవి. శిశువుల ప్రవర్తనములకుఁ బలిపిట్టలు పూచియునియుఁ, జిన్నప్పుడు తూనీఁగలకు ముల్లుగ్రుచ్చి వేధించు యతఁడు తరువాతఁ గొఱుతఁబడెననియుఁ జెప్పుచు నెన్నన్నోవిధముల జీవహింసను దొలఁగింపఁ బ్రయత్నించుచున్నవి. కాని దేశాభాగ్యము వలన బాలు పట్టి సద్గ్రంథములవెల్ల నిప్పు పెట్టుట సహించినారు.

వేదము నొప్పుకొనకున్నను ప్రతిపాదితమైన యహింసా ధర్మమును బుద్ధికొని యన్నిటిలో నదియే పరమధర్మ మని జనులకు బోధించి నాస్తికుఁడనియు ఁడయిన శ్రీబుద్ధాచార్యుఁడు తన మహాజ్ఞాన ప్రాకారము నడిపించినాఁడు.

చిలుకలను కుక్కలను బెంచుచేము, గజ్జపులను బశువులను గాని యిండ్లలో స్వప్రయోజనార్థులమై యుంచుకొనుచేసి, సర్వజంతు సామాన్యమైన స్వేచ్ఛావిహారమునకుఁ బ్రతిబంధకములు గల్పించుచున్నాము. అట్లుచేయుటయే కాక కొందఱు వాని నజాగ్రత్తతోఁ గూడఁ జూచుచున్నారు. వానికి యుక్తమైన వాసగ్రాస సౌఖ్యమిచ్చుచుండవలెను. శక్తికి మించిన పనిని వానిచేఁ జేయింపఁగూడదు. వార్ధకముచేఁ గాని యాయాసముచేఁ గాని, క్షుద్బాధచేఁ గాని యవ్వి మెల్లగాఁ బోవునప్పుడు, కక్కుఱితిపడి వానిఁగొట్టి పరుగెత్తింపఁ గూడదు.

కరుణాహృదయు లెవ్వ రట్లు చేయఁజాలరు. మాంసాహారులు సైతము, కృపాళువు లైనచోఁ, దిండికై జంతువుల వధింపక తప్పనప్పుడు, వానికి విశేషముగా బాధ కలుగకుండున ట్లతిశీఘ్రముగా వానిఁ జంపుదురు.

పై కసహ్యముగాఁ జూపట్టు పురుగులు కూడ యంత్ర సాహాయ్యమునఁ బరిశీలించినచో ననేక సృష్టి చిత్రముల నగపఱచి మన కాశ్చర్యమును దయను గలిగించును.

క్రూర బాలుఁ డొకఁ డీఁగలఁబట్టి ఱెక్కలు లాగివేసియుఁ గాళ్లూడఁ బెఱికియు, వాని మిక్కిలి బాధించుచుండెను. పాపమవి తప్పించుకొని పాఱిపోవుటకు వృథాప్రయత్నములు చేయుచుండఁగాఁ జూచి సంతోషపడుచుండెను. అకారణమతీకా మారకుఁ డగు నతనిని గురు వెన్ని చీవాట్లుపెట్టినను దన క్రూరకృత్యమును మానకుండెను.

చిత్రవధ చేయకుండ బాలుఁడు చంపినయొక యీఁగను గురువు రహస్యముగాఁ దీసి సూక్ష్మదర్శిని క్రిందఁ బెట్టి వానిని బిలిచి యీచిత్రమైన జంతువును జూడుమనెను. వాఁ డది గాంచి "ఏమి తెలుపు! ఏమి నలుపు! ఏమి చిత్రమైన ముండ్ల వెండ్రుకలు! ఏమి సుందరమైన కన్నులు! ఏమి ఱెక్కలు! మహారాజుల దుస్తులను గూడ మించునట్లున్నవే యీ శరీర చ్ఛాయలు! అయ్యా! యీవిచిత్రమైన జంతు వేదో సెలవిం" డని గురువు నడిగెను. వెఱ్ఱి బిడ్డా! యిది నీవు నిత్యము యమపురమున కసంఖ్యాకములుగాఁ బంపించు నీఁగలలో నొకటియే, యని సూక్ష్మదర్శినిని దీసివేసి జంతుశవమును జూపెను. "ఇట్టి జంతువునా నేను బ్రతిదినము చంపుచున్నా"? నను

కొని పశ్చాత్తప్తుఁడై బాలకుఁ డప్పటినుండియు నీఁగలఁ జంపుటవదలుకొనెను. అల్పజంతువులు గూడ మనుష్యునకుఁ గొన్ని పట్ల నతి ప్రేమాస్పదము లగుననుట కీ క్రిందికథ నిదర్శనము.

ఫ్రాన్సుదేశమునకు ముఖ్యపట్టనమైన పారిసునం దొక ఘోరకారాగృహముండెను. దాని పేరు బాస్టీలు. అందులోఁ బూర్వకాలమున ననేక దోషులు శృంఖలాబద్ధులై చిరకాల ముండెడువారు. అట్టివారిలో లాట్యూడ్డనువాఁ డొకఁడుండెను. వాఁ డిరువదినాల్గవ యేఁటఁ జెఱలోఁ జొరఁబడి యట్టే ముప్పది యైదు సంవత్సరములు గడపెను. కనుక విముక్తుఁడై యీవలికిఁ వచ్చినప్పుడు కడు వృద్ధుఁడై కాన్పించెను.

ఇతఁడుండిన గదిలోనికిఁ గారాగార రక్షకుఁ డొక్కఁడుదక్క నితరులు వచ్చుటకు శక్యము గాకుండెను. అతఁడైనను ఆహార మిచ్చుటకు మాత్రమే వచ్చి కనఁబడుచుండెను. కనులారఁ జూచుటకుఁ గాని నోరార మాటలాడుటకుఁ గాని మనుష్యుఁడు లేఁడు. లాట్యూడ్డొంటరిగా, దిగులుపడి యందులోఁ బడి యుండెను. అన్నిటికిఁ దోడుగా, నది చీఁకటిగది. గోడలోనున్న చిన్న బొఱియలలోనుండి వచ్చు కాంతి దప్ప వేఱు వెల్తురేమియు లేదు.

ఇట్లుండఁగా నుండఁగా, నా కన్నమునుండి యొకనాఁడొక యెలుక లోనికి వచ్చెను. సాధారణముగా నెలుకలను జూచిన మనము రోఁతపడి బెదరించి వానినావలికిఁ గొట్టుదుము కదా! లాట్యూడ్డునకు మాత్రము మనసట్లు లేదు. ఏ ప్రాణియో యొకటి కంటఁబడెనుగదా, యని ప్రాణము లేచివచ్చెను. దాని

బెదరఁ గొట్టకుండఁ దాను దిను రొట్టెలో నొక్కముక్క విఱిచి దానికి వేసెను. మూషిక మది దిని యింకను గావలె నని చెప్పుచున్నట్లతనివైపే చూచుచుండెను. ఇంకొకముక్క విఱిచి తనకుఁ గొంచెము దగ్గఱగాఁ బడవైచెను. అది సమీపముగా వచ్చి దానిని దినెను. దగ్గఱ దగ్గఱగా ముక్కలువేసి మెల్లమెల్లగా దానిని మచ్చికచేసెను. ప్రతిదిన మది వచ్చి యతనియొద్ద విందులు గుడుచుచుండెను.

కొన్నాళ్ల తరువాత, నొక ప్రాతఃకాలమున నది యొంటరిగారాక పత్నీ సహితముగా గదిఁ జొచ్చెను. మగయెలుక చేనవుగా ముందఱికి వచ్చెనుగాని యాఁడుది క్రొత్తయగుటచే బెదరుఁజూపులతో దూరదూరముగా నిలఁబడి యుండెను. లాట్యూడ్డు దాని కొకముక్కఁబడవేసిన వెంటనే యదిగొని వడివడిగా బిలములోనికిఁ బాఱిపోయెను. కాని క్రమక్రమముగా నభ్యాసపడి యొకసారి మగదానికి వేసిన ముక్కలను లాగికొనిపోయెను. అంతట మగయెలుక ఫిర్యాదుచేయు దానివలె లాట్యూడ్డు నొద్దకేగి దీనాననముతో నిలువఁబడెను. అతఁడు మఱియొక ముక్కనిచ్చి దాని నూరార్చెను. అది ముందఱికాళ్లతోఁ బుచ్చుకొని వెనుక కాళ్లపైఁ జతికిలఁబడి,కోఁతివలెఁ దినుచుఁ 'జేతనైన నిప్పుడు వచ్చితీసికొని పొ'మ్మని యాఁడెలుకపైని గాల్దువ్వునట్లు బింకపుఁజూపులు చూచుచుండెను. ఇది లాట్యూడ్డునకు మిక్కిలి వినోదకరముగా నుండెను.

కొన్నాళ్లవఱకు స్త్రీసహజమగు సిగ్గాఁడెలుకను వదలకుండెను. కాని యొకరోజున మగదానికివేసిన పెద్దరొట్టెముక్కను నోటినుండి యది లాగుకొనఁబోయెను.మగది పండ్లతో గట్టిగాఁ

బట్టుకొని యీడుదానికి దానిఁజిక్కనీయలేదు. అంతట రెం డును బెనఁగులాడుకొనుచుఁ గీఁచు కీఁచుమనుచు నొకదాని మీఁద నొకటిపడి కన్నమునొద్దకుఁబోయెను. ఆఁడెలుక యబల యైనను మగదానిని రొట్టెతోఁగూడఁ గన్నములోని కీడ్చుకొని పోయెను. ఈవింత చూచినప్పుడు లాటూర్యాడుపడిన సంతోష మింతంతని చెప్పలేము. అతని కాసమయమునఁ గారానివాస కష్టస్మృతియే లేకపోయెను.

మఱునటినాఁడు మఱి రెండెలుక లెచ్చ్చగా వచ్చెను. ఇం కొకవారములో మఱియైదు వచ్చెను. ఇట్టిపరంపరాభి వృద్ధిచేఁ గొన్నాళ్లకు లాటూర్యాడు బహుమూషిక కుటుంబి యయ్యెను. వాని కన్నిటికిఁ దలకొక పేరు పెట్టెను. ఏ పేరితోఁ బిలిచిన నాపేరి యెలుక దగ్గఱకు వచ్చుచుండెను. కొన్నాళ్లు పిల్ల లతోఁ గలిసి భుజించు తండ్రివలె వానితోఁ గలసి యొక పళ్లె ములోనే యతఁడు భుజించుచుండెను. కాని యెంత ప్రేమ యున్నను మనుష్యుల కెలుకలతో సహభోజనమేవ గలిగించును గనుకఁ, దరువాత వానికి వేఱుగా భోజనము పెట్టుచుండెను.

అవియు భోజనానంతరమునఁ గుప్పిగంతులతోఁ గీఁచు కీఁచు మను నుపాంగపు నుతిమేళపు నాట్యములతోఁ దమ పోషకజనకు నుల్లాసపెట్టుచుండెను.

"అయ్యో! చెఱను బడియుంటిని, అనేక బాధల నందు చుంటిని, విడుగడ యెప్పుడు లభించు?" నను చింత లాటూర్యా డున కెంతమాత్రమును లేకపోయెను. మూషికమహాజనులే బంధుమిత్రపరివారము లయ్యెను. గాఢాంధకారమగ్న మగు కారాగారమే సకల సౌఖ్యదాయి యగు స్వర్గ మయ్యెను.

రెండు సంవత్సరముల పిదప నధికారులు లాటూర్వాడును దూరముగానున్న మఱియొక చెఱగదిలోనికి మార్చిరి. అక్కడ కీ యెలుకలు రాఁజాలమిచే నతఁడు పడిన దుఃఖము చెప్ప శక్యముగాదు. సంతతధారలుగాఁ గన్నీళ్లు వచ్చెను. అన్నము సయిఁపక నోటికి వెళ్లదయ్యెను. నిద్ర పట్టదయ్యెను. సుతులఁ గోల్పోయిన పితవలె లాటూర్వాడు కొన్నాళ్లవఱకు మిక్కిలి పరితపించుచుండెను.

దిక్కులేక చెఱసాలలో నొంటినున్న యభాగ్యునకుఁ బనికి మాలిన యెలుక లెట్టి పరమబంధువు లయ్యెనో, వాని వియోగ మెంత సంతాపకరమయ్యెనో చూడుఁడు!

---

## 3. గాంధారి చరిత్రము.

హస్తినాపుర మందలి కురురాజ్యసింహాసనము నలంకరించు చుండిన ధృతరాష్ట్రుఁడు జాత్యంధుఁడే యైనను, నతఁడు సత్కుల ప్రసూతుఁ డనియును, నతనికిభీష్మాది మహాయోధులు చుట్టములును, సహాయు లనియును, నతని తమ్ముఁడగు పాండు మహారాజు సద్గుణ సంపన్నుఁడును వినిర్జిత సర్వ దేశాధీశుఁడు ననియును, నతనిబంధుత్వ మన్నివిధముల శ్రేయోదాయక మనియును, నెంచి, గాంధారదేశమును బాలించు చుండిన సుబలమహారాజు తన పుత్రికామణియగు గాంధారిని నాధృత రాష్ట్రున కిచ్చి వివాహముచేసెను.

బాలారత్న మగునాగాంధారియుఁ దన్నుఁగనిగారాబముతోఁ బెంచి పెద్దఁజేసి విద్యాబుద్ధులు గఱపి తన సుఖమునకే

పాటుపడు తన తలిదండ్రులు దైవసమాను లనియును, వారొన ర్చిన యీ పరిణయము దైవప్రసాద మనియును నెంచి మాఱుమాటాడక ధృతరాష్ట్రునితోఁ గాఁపురము చేయుటకు హస్తినాపురమునకుఁ బయనమై పోయెను.

అంధుని వివాహముచేసికొన్న యీగాంధారిని రాజకన్య కలలోఁ గొందఱు పరిహాసము చేయఁజొచ్చిరి. కొందఱు దన స్వేచ్ఛా విహారమునకు ననుకూలముగ నుండుటకై యిట్లు చేసిన దని నిందింపసాగిరి. కాని యీగాంధారి సుగుణసంపద నెఱిఁగిన కొందఱు నెచ్చెలులుమాత్ర మాగుణవతి తన తలి దండ్రులను సంతోష పెట్టుటకును, పాపము ! పుట్టుగ్రుడ్డియైన యీధృతరాష్ట్రునకుఁ దోడునీడ పైయుండి యతని సుఖపెట్టు టకునుమాత్రమే యిట్టికార్యముచేసినదని గట్టిగానమ్మి యుండిరి.

గాంధారి తనభర్తతోఁ దన యత్తవారిల్లు ప్రవేశించిన తోడనే, సృష్టి విచిత్రములను జూచి సంతోషించుటకుఁ దన భర్తకు నయనములు లేనపుడు తనకుమాత్రము నేత్రానంద మేల యుండవలయు?, నని తలపోసి తన ప్రాణనాయకుఁ డేవిధ మయిన సంశయమును లేక నెమ్మదిగా నుండుటకును, దన పతి భక్తి వెల్లడి యగుటకును, దన్నుఁ బరిహసించిన వారికి బుద్ధి వచ్చుటకును, దన్ను నిందించిన వారికి నీతిగఱపుటకును, దన బంధుమిత్రాదుల కందఱకు గౌరవము హెచ్చుటకును, దన రెండుకన్నులకును గట్టుకట్టుకొని పతికిఁ బ్రేమాస్పదమై మెలఁగు చుండెను. కన్నులు లేనివారే చూడవలయు నని యెంతో తొందరపడు చుందురుగదా ! కన్నులున్నవారు చూడకుండు టకు నెంత మనోబలము కావలయునో !

ఈమానినీతిలకము పరమేశ్వరానుగ్రహమున గర్భవతి యయి యచిరకాలమున దుర్యోధనుఁడను నొకపుత్రునిఁ బడసెను. తొమ్మిదిమాసములు మోసి, యెన్నియోనోముల కోర్చి కనిన తల్లికిఁ దనశిశువును జూడవలయు నను కోరిక యుండకమాను నా? అందులోఁ దొలిచూలును జూడక, యేమాత యోర్చి యుండఁగలదు? తొలిచూలు, పుత్రుఁడైనపు డాపిల్లవానిఁ గనుఁగొన కుండుట కేజననికి మనసొప్పును? కాని గాంధారి మాత్రము తనకన్నులను విప్పి తన జ్యేష్ఠపుత్రునిఁ జూచినది కాదు. ఈలలనాలలామ మనోదార్ఢ్యమును శతవిధములఁ బరీక్షించుటకో యనునట్లు సర్వేశ్వరుఁ డీసతీమణికి నూర్వురు పుత్రులఁ బ్రసాదించుటయే కాక, స్త్రీకిఁ బుత్రులకంటెఁ బుత్రికయే ప్రియతరురాలని కాఁబోలును, గట్టకడపట నొక కన్యకామణినిఁగూడ ననుగ్రహించెను. కాని గాంధారిమాత్రము తన ప్రతిజ్ఞనువదలి తనకంటి కట్టును విప్పి తనపుత్రులలో నొక్కనినైనను దనపుత్రికనైనను నవలోకించినదికాదు. దీక్షాపరత్వమునకు నింతకంటెను గొప్పనిదర్శనము మనమెచ్చటనైనను జూడఁగలమా?

ధర్మాత్ములును, వినయాది సద్గుణ సంపన్నులును, దనమఱఁది పిల్లలు, నగు పాండవులను నకారణముగ నిడుమల పాలుచేసి తుట్టతుదకు వారికిఁ జెందవలసిన యర్ధరాజ్యముగూడ వారికిఁ జెందనీయక వారితోఁ గలహమునకుఁ గాలుద్రవ్వి యుద్ధసన్నద్ధుఁడై తనకు మ్రొక్కుటకు వచ్చిన తనజ్యేష్ఠ పుత్రుఁడగు దుర్యోధను నాశీర్వదింపవలసి వచ్చినపుడు, తన మనస్సులోని పుత్రానురాగము నంతయు దూరముగాఁబెట్టి పక్షపాత

మును వదలి "కుమారా! దుర్యోధనా! ధర్మము జయించును గాక!" యని మనసార దీవించెను. ఇంతటి ధర్మప్రియురాలిని మన మెచ్చటనైనను గనివిని యున్నామా?

ఇదియును గాక తనపుత్రులందఱును రణరంగమున నిహతులైనపుడు తనయపారమైన శోకమునంతను హృదయములో నణఁచి పెట్టుకొని చింతాపరవశుఁడైన తనభర్త నోదార్చె,

చ. వెనుకకురాక చొచ్చి రణవీరుని కై పడి, రాజదండనం
బునకు భయంబులేక పడిఁబోయెడు ధీరునిభంగి, నప్పుడా
వనిత దురంతమైన హిమవంతముపొంత వసాంతభూమికిన్
జెనిమిటితోడ నిందుకయు భీతివహింపక యేఁగెఁ బ్రీతితోన్.

ఇట్లు తనివెంబడి వనమునకు నడచి తనప్రాణేశ్వరున కెన్నో విధముల సేవచేసి యెన్నోకష్టములకోర్చి తనజన్మమును సార్థకము చేసికొనియెను.

కాఁబట్టి యిట్టి దృఢవ్రతయుఁ, బరమపతివ్రతయు, ధర్మనిరతయు, నగు గాంధారియొక్క పవిత్రచరిత్ర మన దేశమందలి మానినీమణుల హృదయారవిందములయందు నెలకొని వారికి మార్గదర్శకమై నిరంతరము ప్రకాశించుచుండునుగాక!

సీ. ఏరాజకన్యయు నెలమిఁ బెండ్లాడని
పుట్టు గ్రుడ్డినిఁగోరి చెట్టపట్టె,
పతికిలేని సుఖంబు సతికిని దగదని
కనులు గన్పడకుండఁ గట్టుగట్టె,
పుత్త్రులు పెక్కండ్రు పుట్టిన నొకనిని
గనుఁగోక మనసును గట్టిపెట్టె,
యని కేఁగుసుతుఁడు ప్రమొక్కిన ధర్మమే గెల్పుఁ
గనును బొమ్మంచు దీవనలు పెట్టె,

గీ. భర్తవెంబడి నడవికిఁ • బయలుదేఱి,
కష్టముల కోర్చి గాంధారి • కడఁకమీఱి.
ఆమెకంటెను భక్తిలో • నధికు లేరి ?
సకలకల్యాణ గుణధన్య • సర్వమాన్య !

---

# 4. దివారాత్రి భేదములు, ఋతుభేదములు, శీతోష్ణమండలములు.

ప్రథమ భాగము.

అహోరాత్రము లెట్లు కలుగుచున్నవో యింతకుముందు మీరు నేర్చుకొనియున్నారు. భూమి యెప్పుడు నాత్మప్రదక్షిణము చేసికొనుచుండుననియు సూర్యునివైపున నున్న భూభాగములకుఁ బగలనియు సూర్యకాంతి తగులుటకు వీలులేని వెనుక ప్రదేశములకు రాత్రియనియు మీరు చేదివితిరి.

కాని సూర్యుఁడాఱుగంటల కుదయించుటయు నాఱుగంటల కస్తమించుటయు నెప్పుడో కాని నిత్యమును జెరుగుట లేదు. పంచాంగములోఁ జూచినఁ దఱచుగా నహఃప్రమాణము ముప్పదిగడియల కెక్కువో తక్కువో యుండునుగాని సరిగా ముప్పదిగడియ లుండుట యరుదు. వేసఁగికాలపు రాత్రులు వేగముగా గతించి పోవుచున్నవి. శీతకాలములో నెంతసేపు పండుకొన్నను దెల్లవాఱదు. పగలు దీర్ఘమైన, రాత్రి హ్రస్వము, రాత్రి పొడుగైనఁ, బగలు పొట్టి. ఈ దివారాత్రివైషమ్యమునకుఁ గారణ మేమో తెలిసికొందము.

కారణము స్పష్టముగా గ్రహించుకొనుటకుఁ గొన్ని భూగోళశాస్త్ర సంకేతములను ముందు తెలిసికొనవలెను.

గుండ్రని పంపరపనసపంటి ముచ్చికలోనుండి సూటిగా నడుగున కొక కదురు గ్రుత్తము. పండే భూగోళ మనుకొనుము. కదురే "అక్షరేఖ" యనుకొనుము. అక్షమనఁగా 'ఇరుసు.' ఇరుసుమీఁద బండిచక్రము తిరుగునట్లక్షరేఖమీఁద భూమి తిరుగునుగనుక దానికట్టి పేరు పెట్టినారు. కదురుకొనలు ధ్రువములు. తొడిమపైకొన యుత్తరధ్రువము. అడుగుది దక్షిణ ధ్రువము.




కదురు ఫలములోఁ దూర్చినట్లు భూమిలో నక్షరేఖ యెవరును గీయలేదు. అదియు ముందురాఁబోవు రేఖలును గూడ శాస్త్రవిషయ బోధనార్థము, బోధకులు కల్పించిన పరిభాషా పదములుగాని వేఱొండుగావు.

ఉత్తరదక్షిణ ధ్రువములకు సరిగా మధ్యమున, భూమి చుట్టునను, బైని, మొలనూలువలె, నొకగీఁత గీసినారను కొందము. దానిపేరు భూమధ్యరేఖ.

సూర్యుఁడు ప్రతిదినమును దూర్పునుండి పడమటికిఁ బోవుచున్నట్లగపడుచున్నాఁడు. కనుక నౌకాతీర న్యాయముఁబట్టి భూమి తనచుట్టును దాను బడమటినుండి తూర్పునకుఁ దిరుగుచున్న దన్నమాట.

ఇదిగాక మనకుఁ బ్రత్యక్షముగాఁ గనఁబడుచున్న మఱికొన్ని విషయములున్నవి. మార్చి 21 వ తేదీని సూర్యోదయము కేవలము తూర్పుననగును. అప్పటినుండి జూను 21 వ తారీఖు వఱకు సూర్యుఁడు ప్రాగ్దిశయందే క్రమక్రమముగా నుత్తరపువైపున నుదయించుచుండును. ఆ తేదీనుండి క్రమక్రమముగా దక్షిణమునకుఁ దిరిగి సెప్టెంబరు 23 వ తేదీని మరల సరియైన తూర్పునకువచ్చును. అంతట దక్షిణాభిముఖుఁడై డిసెంబరు 21 వ తారీఖువఱకు నొకరోజుకంటె నొకరోజు దక్షిణముగా నుదయించుచుండును. తరువాతఁ గ్రమక్రమముగా నుత్తరమునకు మరలి మార్చి 21 వనాఁడు సరిగాఁ దూర్పున నుదయించును. సంవత్సరము పొడుగునను గానిపించు నిట్టి సూర్యగతివలనను, మఱికొన్ని కారణములవలనను, భూమిప్రతిదిన మాత్మప్రదక్షిణమేకాక యేఁటికొకసారి సూర్యప్రదక్షిణము కూడఁ జేయుచున్నదని మనము తెలిసికొనఁగలము.

కదురుతోనున్న పంపరపనసపండొక పెద్దదీపము నెదుటఁ బెట్టి, ముచ్చికభాగము ముందునకు ప్రొగ్గనిమ్ము. దీపమువైకి లేచిన ట్లగపడును. అడుగుభాగము ముందటి కొఱగింపుము.

దీపమదుగునకుఁ బోయిన ట్లగపడును. దీపమువైపునకు మ్రొగ్గిన ఫలభాగముల మీఁదఁబడు కాంతి యెక్కువగనుండి చుట్టు నెక్కువప్రదేశము నాక్రమించుకొనును. ఫలమును బొంగరము వలెఁ ద్రిప్పుచుండినయెడల మ్రొగ్గినభాగమందలి ప్రతిప్రదేశ మును నెక్కువసేపు వెలుతురులోనే యుండును. అట్లు వ్రాల నీయక పండు నిట్టనిలువుగా నుంచి త్రిప్పినయెడల నన్నివర్తుల ప్రదేశములందును నర్ధభాగము కాంతిచేఁ బరివేష్టింపఁబడి యుండును. మిగిలినసగము చీఁకటిలోనుండును. అనఁగా ఫలము పైని ప్రతిప్రదేశము నెంతసేపు వెలుతురులోనుండునో యంత సేపే చీఁకటిలోను నుండును. ఈమాటలు మఱచిపోకున్నచో ముందువిషయము సులభముగాఁ దెలియును.

ఇఁక ఫలమునకు మాఱు భూమిని, గదురునకు మా అక్ష రేఖను బుచ్చుకొందము.

భూమి సూర్యునిఁజుట్టి తిరుగుమార్గమును భూకక్ష్యయం దురు. ఈకక్ష్యకు అక్షరేఖ నిట్టనిలువుగా నుండక బొమ్మలోఁ




గనఁబడుచున్నట్లు వంగియుండును. ఆవంపు, భూమి దాని కక్ష్యలో నెచ్చోటనుండినను, నొకవిధముగానే యుండునుగాని మార్పుచెందుచుండదు.

మొదటిబొమ్మలో జూను 21 వ నాఁటి భూప్రతిమను జూడుము. భూమధ్యరేఖ కుత్తరభాగము సూర్యునివైపు వ్రాలి

యున్నది. సూర్యకాంతి యుత్తరధ్రువమును దాఁటి ప్రసరించు చున్నది. భూమి యెంతతిరిగినను ఆధ్రువముచుట్టు వెలుతురే కాని చీఁకటిలేదు. ఆవెలుతురుచుట్టు నొకసున్నఁజుట్టి దాని కుత్తరవృత్తమని పేరుపెట్టుదము. ఆరోజున ఆవృత్తముపై వారి కందఱకుఁ బగలేకాని రాత్రిలేదు. క్రింద భూమధ్యరేఖ వఱకుండు ప్రతిస్థలమునందును జుట్టు గీఁతలు గీసినయెడల వానిలో నన్నియు సగముకంటె నెక్కువగా వెలుతురునం దుండును. సగముకంటెఁ దక్కువగాఁ జీఁకటిలోనుండును. అనగా నచేటి వారికెల్లరకు రాత్రులకంటెఁ బగ ళ్లెక్కువగా నుండును. కేవల ముత్తరధ్రువమున సంవత్సరములో నాలుమాసములవఱకుఁ బగలేకాని రాత్రిలేదు. ఈరోజున (జూన్ 21-వ తేదీని) మధ్యాహ్నమున సూర్యుఁడు సరిగా నెత్తిమీఁదికి వచ్చుస్థలముల నన్నిటిని గలుపుచు నొకవృత్తము గీయుదము. దీనికిఁ గర్కటక వృత్తమని పేరుపెట్టినారు. సూర్యుఁ డాదినమునఁ గర్కటక రాశిలోఁ బ్రవేశించునుగనుక దాని కట్టిపేరువచ్చినది. ఉత్తరార్ధగోళములో నుత్తరమునకు వెళ్లినకొలఁది నహఃప్రమాణము మెక్కువయు నిశాప్రమాణము తక్కువయు నగుచుండును.

భూమధ్య రేఖమీఁద నుండువారికి దివారాత్రులు సమానములు. ఆ రేఖ తెలుపులోను నలుపులోను జెఱిసగముగా నున్నట్లు బొమ్మవలన గోచరించుచున్నది.

దానిక్రింద నెల్లచోట్లను నలుపుభాగ మెక్కువ, తెలుపు భాగము తక్కువ. అనఁగా రాత్రి యెక్కువ, పగలు తక్కువ. సూర్యుఁడు కొంతమేర ప్రసరించుటయే లేదు. బొమ్మ చూడుము. అచ్చోట నలుపేకాని తెలుపేమియులేదు. ఆమేర

సూచించు వృత్తమును దక్షిణవృత్తమందురు. ఈరోజున దాని క్రిందివారికి రాత్రియే కానిపగలులేదు. కేవలదక్షిణ ధ్రువమందేఁటికాఱు నెలలవఱకు రాత్రియే. దక్షిణార్ధగోళములో నడుగునకు వెళ్లినకొలఁది నంతకంతకు రాత్రియెక్కువ, పగలు తక్కువ.

తరువాత డిసెంబరు 21-వ తేదీని భూగోళముయొక్క స్థితిని మొదటిబొమ్మలోఁ జూడుము. అక్షరేఖ యెప్పటిరీతినే యొఱగియున్నది. కానిదక్షిణార్ధగోళ మిప్పుడు సూర్యునిదెసకుఁ బాడుచుకొని వచ్చినది.

దక్షిణవృత్తము క్రింద నెడతెగని వెలుతురు. ఉత్తరవృత్తము పైని విరామములేని చీఁకటి. ఉత్తరార్ధగోళములో వెళ్లినకొలఁది దీర్ఘములైన రాత్రులు. దక్షిణార్ధగోళములో వెళ్లినకొలఁది నెక్కువ ప్రమాణముగల పగళ్లు. పై వృత్తములలో నలుపుభాగములు హెచ్చు. క్రిందఁదెలుపువి హెచ్చు. అహోరాత్రసంబంధములైన కార్యములన్నియు జూను 21-వ నాఁటికిఁ గేవలము వ్యతిరిక్తములు. భూమధ్యరేఖయొద్ద మాత్రము నలుపు తెలుపులు సమానములు. అనఁగా రేయును బగలును సమానములు.

ఈనాఁడు (డిసెంబరు 21) మధ్యాహ్నమున సూర్యుఁడు సూటిగా నెత్తిమీఁదికి వచ్చుస్థలములఁ జూపించు వర్తులరేఖను చూడుము. దానికి మకరవృత్తమని పేరు. ఈ రోజున సూర్యుఁడు మకరరాశినిఁ జొచ్చును గనుక నట్టిపేరు పెట్టినారు. ఇంగ్లీషువారీ వృత్తమును అజవృత్తమందురు. (చూ. మూఁడవ భాగము—అనుబంధము.)

ఇఁకను మార్చి 21-వ తేదీని, సెప్టెంబరు 23-వ తేదీని, భూమియుండు స్థితిని బరిశీలింపుము. అక్షరేఖ యెప్పటి యట్లే యొఱఁగియున్నది. కాని భూగోళములో నుత్తరార్ధము గాని దక్షిణార్ధముగాని సూర్యునివైపు వ్రొగ్గియుండలేదు. సూర్యుఁడు మధ్యాహ్నమున భూమధ్యరేఖకు సరిగా నెత్తి మీఁద నుండును. వృత్తరేఖలన్నియు, ననఁగా భూమిమీఁది ప్రదేశములన్నియు, సగము వెలుతురులోను సగము చీఁకటి లోను నుండును. ఈ రెండునాళ్లు యావత్ప్రపంచ మందును దివారాత్రులు సమముగా నుండునన్నమాట.

పై విషయములఁ బట్టి యీక్రిందిసంగతులు సులభముగా గ్రహింపఁగొనవచ్చును.

భూమధ్య రేఖయొద్దమాత్రము సంవత్సరము పొడుగునను దివారాత్రులు సమానములు. తక్కిన చోట్ల నొకప్పుడురాత్రి యెక్కువ, యొకప్పుడు పగలెక్కువ.

మకరవృత్తమునకు దక్షిణమునను కర్కటవృత్తమున కుత్తరమునను నివసించువారికి మధ్యాహ్నసూర్యుఁ డెప్పుడును సరిగా నెత్తిమీఁద నుండఁడు; ఉత్తరపువారి కెప్పుడును దక్షిణదిశకును, దక్షిణపువారి కెప్పుడు నుత్తరమునకును, వ్రాలియుండును. ఇచేటిజను లెండకావలసిన గృహారామ భాగములను వరుసగా దక్షిణోత్తర దిశలకుఁ దెఱపగాఁ జేసి కొందురు. దివారాత్రి భేదము లీభాగములందు మధ్యప్రదేశముకంటె నెక్కువ.

ఉత్తరవృత్త తదుత్తరప్రదేశము లందును, దక్షిణవృత్త తద్దక్షిణప్రదేశములందును, సంవత్సరములో నాఱుమాసములు

ముద లాకరోజావటకు నవిచ్ఛిన్నములైన పగళ్లో రాత్రులో సంభవించుచుండును. ఇచ్చటివారికి మధ్యాహ్న సూర్యుఁడు కినఁబడినచో, దక్షిణోత్తరములకుఁ గడునెక్కువగా వ్రాలి కనఁబడును. ఈ భాగములవారి కహోరాత్రభేదము మిక్కిలి యెక్కువ.

మకర కర్కటకవృత్తముల మీఁదివారికి మధ్యాహ్న సూర్యుఁ డేఁటేఁట నొకసారి నెత్తిమీఁదికి వచ్చును.

తన్మధ్యమం దుండువారి కతఁడు రెండుసారులు వచ్చును:- పోవునప్పు డొకసారి, వచ్చునప్పు డొకసారి. మధ్యందిన భాను బింబ మొకప్పు డీరేఖల నడిమివారి కుత్తరమునకు వ్రాలియు, నొకప్పుడు దక్షిణమునకు వ్రాలియు, నొకప్పుడు తలకు సూటి గను, జూపట్టును. ఇందలి జనులకుఁ, బగళ్లకు రాత్రులకుఁగల వార కడు స్వల్పము.

డిసెంబరు 21-వ తారీఖు మొదలు భూపరివర్తనమువలని యహోరాత్రభేదములు క్రమముగాఁ బోయి, మార్చి 21-వ తేదీని సర్వత్ర పగలును రాత్రియును సమము లగును.

అప్పటినుండి తిరుగ భేదమంకురించి క్రమముగాఁ బెరిఁగి జూన్ 21-వ నాఁటికి, డిసెంబరు 21-వ నాఁటి యంత దివా రాత్రి భేదమును బొడచూపును. పగలెక్కువ యగుటయో రాత్రి యెక్కువయగుటయో ప్రదేశమును బట్టియుండునని యిదివఱకే చెప్పఁబడెను.

అంతటినుండి క్రమముగా ఆభేదముతగ్గి, సెప్టెంబరు 23-వ తేదీని, యావద్భూమియందు, నహోరాత్రములు మరల సమములగును.

సూర్యుఁడు మకరవృత్తమునుండి కర్కటక వృత్తమునకుఁ బోవుకాలము ఉత్తరాయణము ; కర్కటక వృత్తమునుండి మరల నతఁడు మకరవృత్తమునకు వచ్చుటకుఁ బట్టుకాలము దక్షిణాయనము. కనుకనే యీ రెండు వృత్తములకును అయన వృత్తములను పేరువచ్చినది.



## 5. దివారాత్రి భేదములు, ఋతుభేదములు, శీతోష్ణమండలములు.

ద్వితీయ భాగము.

దివారాత్రిభేదములఁ గూర్చి వెనుకటి పాఠములోఁ జెప్పితిమి. ఇఁక మిగిలిన రెంటినిగూర్చి యీపాఠములోఁ జెప్పెదము.




ఇచ్చటి మొదటిపటము నొకసారిచూడుము. AB, BC, CD, DE అనునాల్గు సమపరిమాణము గల భూమ్యుపరిభాగములు

గీయఁబడి యున్నవి. సమాంతరములుగా గీసిన వెక్కుగీఁతలు, కడుదూరమునుండి వచ్చిపడు సూర్యకిరణములు. అందులో AE యొక్క మధ్యభాగములపై, నఁనగా BC, CD లమీఁదఁ, బడు కిరణము లెక్కువ నిట్టగానున్నవి. కొనల AB,DE, భాగ, ములఁబడునవి యెక్కువ యేటవాలుగా నున్నవి.

కిరణము లెన్నిపడిన వేఁడి యంతయెక్కువకదా! గీఁతలు లెక్కపెట్టుకొని చూచినయెడల, AB,BC,CD,DE, లు సమ పరిమాణములైనను, BC,CD లమీఁద నిట్టగాఁ బడుటవలనఁ గిరణములసంఖ్య యెక్కువగా నున్నదనియు, నేటవాలుగాఁ బడుటవలన AB, DE, ల మీఁద వానిసంఖ్య తక్కువగా నున్నదనియు, విస్పష్టమగును. కనుక నేటవాలుగాఁ గిరణ ములు ప్రసరించుచోట్ల వేఁడితక్కువ. నిలువుగాఁ బడుచోట్ల నెక్కువ.

a, c. ద్వారమునఁ బోవు, పైవర్తుల రేఖకును లోపలి భూగోళమును జూపుచిన్నసున్నకును నడుమను వాతావరణ మున్నది. ఎంతదూరము సూర్యకిరణము గాలిలోఁ జొచ్చి వచ్చిన, నంత తక్కువవేఁడిమితో నదిభూమిపైఁ బడును. ఏలన గొంత వేఁడిమిని గాలి హరించుచుండును. పటము పరీక్షించిన యెడలఁ గిరణము లేటవాలుగాఁబడుటవలన (గాలిలో నెక్కువ దూరము ప్రసరించుటవలన) AB,DE, ల కుష్ణము తక్కువ యనియుఁ, దక్కువదూరము వ్యాపించుటచే BC, CD, ల కౌష్ణ్యము హెచ్చేనియు స్పష్టము గాఁగలదు. కనుక సూర్య కిరణములు నిట్టనిలువుగాఁ బడుటయు వ్రాలి ప్రసరించుటయు భూభాగముల శీతోష్ణస్థితికి ముఖ్యకారణములు.

రెండవది, రాత్రిందివ భేదము. పగలెంత యెక్కువైన నంతవేడిమి యెక్కువయనియు, రాత్రియెంత యెక్కువయైన నంతవేడి తక్కువయనియుఁ, దెలిసికొనుట సుకరమేగదా !

భూమి సూర్యునిపై పొఱగినప్పు డీ రెండుస్థితులును బట్టునని యిదివఱకే చదివియుంటిరి. కనుక నుత్తరధ్రువము సూర్యునిపై పునకు మ్రొగ్గినప్పు డుత్తరార్ధగోళమువారి కుష్ణకాలము, దక్షిణార్ధగోళమువారికి శీతకాలము. దక్షిణధ్రువము సూర్యునిదెసకు ముందుత్రోసికొని వచ్చినప్పుడు, దక్షిణార్ధగోళమునకు వేసఁగి, యుత్తరార్ధగోళమునకు శీతకాలము.

అనఁగా జూనును దత్ప్రాంతకాలమును మన కుష్ణకాలము, దక్షిణార్ధగోళము వారికిఁ జలికాలము. డిసెంబరును దత్సమీపకాలమును దక్షిణార్ధగోళమువారికి (ఆస్ట్రేలియా దేశజులు మొదలగు వారికి) వేఁడికాలము, మనవంటి యుత్తరార్ధగోళము వారికి శీతకాలము.

శీతోష్ణ తారతమ్యమునుబట్టి భూమి నైదుమండలములుగా విభజించినారు.

కర్కటక మకరవృత్తమధ్య భూమియందు మధ్యాహ్న సూర్యుఁ డెక్కువ యుచ్చస్థితినుండును- అనఁగా నితరభాగములకంటె నెత్తిమీఁది కెక్కువసూటిగా వచ్చును. కనుక నిక్కడ నుష్ణమెక్కువ.

ఉత్తరదక్షిణ ధ్రువప్రాంతములందుఁ బట్టపగటి సూర్యబింబము కూడ నెక్కువగా వ్రాలియుండును. కనుక నీప్రదేశములు మిక్కిలి శీతలములు.

కడమ భూభాగములలో మధ్యందిన సూర్యుఁడు కొంచె ముగా వ్రాలియుండును—కర్కాటక మకరవృత్తమధ్యభూమి యందువలె నెత్తిమీఁదికిని రాఁడు, ధ్రువ ప్రాంతప్రదేశము లందువలె నంతగాఁ గ్రిందికొఱిగియు నుండఁడు. కనుక నవి సమశీతోష్ణముగా నుండును.




ఈపాఠముయొక్క రెండవపటముఁ జూడుము.

మధ్యాహ్న సూర్యుఁడు కర్కాటకవృత్తముదాఁటి యుత్తర మునకును, మకరవృత్తమునుదాఁటి దక్షిణమునకును నెప్పుడు పోఁడు. ఈవృత్తములు రెండును, మధ్యాహ్నమున సూర్యుడుఁ సరిగా నెత్తిమీఁదికి వచ్చుటకు శక్యమైన స్థానములయొక్క యుత్తరదక్షిణ పరమావధులు. వీని మధ్యమందుండు మండల మత్యుష్ణమండలము. ఇది భూమధ్యరేఖకుఁ బైని 23½ డిగ్రీల వఱకును గ్రింద 23½ డిగ్రీలవఱకును (అనఁగా 47°లు) వ్యాపించి

యున్నది. డిగ్రీ యనగా రమారమి 69 మైళ్లు, డిగ్రీకి గుఱుతు (°).

ఉత్తరవృత్త, ముత్తరధ్రువమునకు 23½° లు దక్షిణమున నున్నది. దక్షిణవృత్తము దక్షిణధ్రువమునకు 23½° లుత్తర మున నున్నది. ఈధ్రువవృత్తమధ్యభాగము లందుఁ జలి మిక్కిలి మెండు, ఇవి యతిశీతలమండలములు. ఉత్తరమున నుండునది యుత్తర శీతలమండలము. దక్షిణపుది దక్షిణశీతల మండలము. వీనిలో నొకప్పుడు నెలలకొలఁది నహఃపరిమాణ ముండినను, సూర్యుఁడు మిక్కిలి యెక్కువగా వ్రాలియుండు టచే, నచటి మహాశైత్యమును బోఁగొట్టఁజాలఁడు.

ఉత్తరవృత్తమునకుఁ గర్కటకవృత్తమునకు నడుమనున్న భూభాగ ముత్తరసమశీతోష్ణమండలము. వైశాల్యము 43°లు. దక్షిణవృత్తమునకును మకరవృత్తమునకును నడిమిభాగము దక్షిణసమశీతోష్ణమండలము. దీని విరివియు 43°లు. రెండు సమశీతోష్ణమండలములందును, నుష్ణమండలము లందువలె జనుల మల మల మాఁడించి నిస్సత్తువలఁ జేయునంత యుష్ణము కాని లేక శీతలమండలములందువలె జనుల వడవడ వడఁకించి వ్యాపారములకభ్యంతరము కలిగించునంత శైత్యముకాని యుం డదు. కనుక నీభాగములనివసించు ప్రజలలోఁ బెక్కండ్రు అధిక ముగాఁ బాటుపడి పనిచేయువారు, సాహసులు, నైశ్వర్యవం తులు నై యున్నారు.



# 6. బమ్మెర పోతనామాత్యుఁడు.

బమ్మెరపోతనామాత్యుఁ డను నాంధ్రకవి, 1378 వ సంవత్సరమున జన్మమొందినట్లు కొందఱు చెప్పుచున్నారు. ఆతని జన్మస్థలము కడపమండలములో నున్న యొంటిమెట్టయని చెప్పుదురు. కాని యిప్పుడు కొందఱు విమర్శకు లది యోరుగల్లని చెప్పుచున్నారు. ఒంటిమెట్ట యనికాని, యోరుగల్లని కాని చెప్పక, యేకశిలానగరము తన వాసస్థాన మని పోతనామాత్యుఁడు తనభాగవతమునందు వ్రాసియుండెను. 'ఏకశిలా'నగర శబ్దమునకు సరియైన తెలుఁగు 'ఓరుగల్లు' కాని "ఒంటిమెట్ట" కాదు. మఱికొన్ని కారణములచేతఁగూడ, నోరుగల్లే యతని వాసస్థాన మని కొంద అభిప్రాయపడుచున్నారు. పూర్వమున నాతని నివాస మొంటిమెట్టయేకానీ! ఓరుగల్లేకానీ ! ఏకశిలానగర మని పేరుగల గ్రామమేదైన నుండిన నది గానీ! ఇప్పటివఱ కామహాకవి సర్వాంధ్రజన హృదయములయందు వాసముచేయుచున్నాఁడు. మరణించు మనుజునివిషయములో జన్మస్థలనిర్దేశము కాని, మృతజీవునికి సర్వప్రపంచమును జన్మస్థానమే !

ఈతఁడు నియోగిబ్రాహ్మణుఁడు. కౌండిన్యసగోత్రుఁడు. ఈతని తండ్రి కేతన. తల్లి లక్కమాంబ. కొడుకు మల్లన్న. కాశీఖండ నైషధాది మహాగ్రంథముల నాంధ్రీకరించి, మహావిఖ్యాతి సంపాదించిన శ్రీనాథుఁ డితనిబావ యని చెప్పుదురు.

పోతనామాత్యకృతమగు భాగవతము వ్యాసకృతభాగవతమున కాంధ్రీకరణమేయైనను, మాతృకకంటె నది విపులముగా

నున్నది. కాని, దానిలో విశేషభాగము నశింపఁగా, వెలిగందల నారయ మొదలగువా, రాయాభాగములను బూరించినారు. గ్రంథము నశించుటకుఁ గారణ మేదియో తెలియదు. పలువురు పలువిధములుగాఁ జెప్పుదురు.

పోతనామాత్యుఁడు వ్యాసమహర్షి విరచిత భాగవతము నాంధ్రీకరించెననియు, నాంధ్రీకరణము సమీచీనముగ నున్న దనియు, "వేంకటగిరి" ప్రభువగు సర్వజ్ఞసింగమనాయఁడు విని, యాకవిని దనయాస్థానమునకుఁ బిలిపించి గ్రంథము తనకుఁ గృతి యిమ్మని యడిగెను. తన కృతిని నరాంకితము చేయనని యాకవి పలుకఁగా రాజు కోపోద్దీపితుఁడై యాయుద్గ్రంథమును గోతిలోఁ బాఁతిపెట్టించెను. తరువాత శ్రీరామమూర్తి యా సింగమనాయని భార్యకు స్వప్నములో గనపడి, యామెభర్త మహాకవి విషయమున నపరాధ మొనర్చినాఁడనియు లోకోప కారముకై యాంధ్రభాగవతము వ్యాపింపఁ జేయఁదగిన యుద్గ్రంథమనియు, నీయంశముల సింగమనాయనితోఁ జెప్పు మనియుఁ, జెప్పెనఁట. అంత నామె యట్లు భర్తతోఁ జెప్పి గ్రంథమును బైకిఁ దీయింపఁగా నందలి కొన్నిభాగములు పురుగులు తినెననియు, లుప్తభాగములను నారయాదులు పూర్తి చేసిరనియు నొక కథ యున్నది.

అదికాక, పోతనామాత్యుఁడు భాగవతమును రచించి, దాని నెవ్వరికిని జూపక, దేవతార్చనపుఁబెట్టెలో భద్రముగా దాఁచి పూజించియుండెననియు, నాతఁడు ప్రాణప్రయాణకాల మునఁ, దనపుత్రునితో, భగవదారాధనపుఁ బెట్టెలో నున్న గ్రంథధనమును భద్రముగాఁ గాపాడుచుండు మని చెప్పె నని

యు, మల్లన యాగ్రంథమును దీసిచూడఁగా, నది కొంత శిథిలమైయుండెననియు. దానిలోని లోపములను నారయాదు లచే నతఁడు పూర్తిచేయించె ననియు, మఱి యొక కథ యున్నది.

పోతనామాత్యుఁ డొకనాఁ డూరిబైటను గోవులను గాచి కొనుచుండఁగాఁ జిదానందుఁ డనునొకయోగి యాతనికి దర్శన మిచ్చి యాతనికి రామమంత్ర ముపదేశించినట్లును అప్పటి నుండియు నాతని కుభయభాషా పాండిత్యమును నిరర్గళ కవితాధారణియు లభించినట్లును అందుచేతనే యాతఁడు తన గద్యమున "సహజపాండిత్య" యని వ్రాసికొన్నట్లును గొంద ఱొకకథను జెప్పుదురు. ఆతఁడు రచియించిన మఱియొక గ్రంథ మగు వీరభద్రవిజయమునుబట్టియు,"శ్రీపరమేశ్వర కరుణాకలిత కవితావిచిత్ర'యని యతఁడు భాగవతగద్యమున వ్రాసికొని యుండుటను బట్టియు, నాతఁడు శివప్రసాదమున గంగాఝరీ సంకాశమగు కవితాధారను సంపాదించినట్లు మఱికొందఱు చెప్పుదురు. అయినను,

క. పలికెడిది భాగవతమఁట, పలికించెడివాఁడు రామభద్రుండఁట, నేఁ
బలికిన భవహరమగునఁట, పలికెద, వేఱొండుగాథఁ బలుకఁగ నేలా.

అని యతఁడనుటచే, శ్రీరామమూర్తి యతని స్వప్నమున సాక్షాత్కరించి భాగవతమును జేయు మని యాజ్ఞాపించినట్లును అట్లొనర్చినయెడల ముక్తిగలుగునను నమ్మకముతో నాతఁడు చేసినట్లును, స్పష్టమగుచున్నది.

అతఁడు దరిద్రుఁడు. ఏపూఁట కాపూఁటయే జరుగుట దుర్లభముగానుండెను. అతఁడు స్వల్పమైనభూమిని దున్నుకొని,

పండిన గింజేలతోఁ బొట్టపోసికొనుచుండెను. సర్వజ్ఞసింగమ నాయని యాస్థానకవియు నాతని బావయు నగు శ్రీనాథుఁ డొకసారి యాతనియింటికి విచ్చేసి, యాతని లేమిని గాంచి, మిగుల జాలిపడి, కష్టనిష్ఠురమైన హాలికవృత్తిని విడిచి భాగవత గ్రంథమును సింగమనాయనికిఁ గృతియొసఁగి ధనధాన్య వస్త్ర సమృద్ధినొందు మని యనేకవిధములఁ జెప్పఁగా,

ఉ. బాలరసాలసాలనవ • పల్లవకోమలకావ్యకన్యకన్
కూళల కిచ్చి యప్పడుపుఁ • గూడు భుజించుటకంటె, సత్కవుల్
హాలికులైన నేమి? గహ • నాంతరసీమలఁ గందమూల కౌ
ద్దాలికులైన నేమి? నిజ • దారసుతోదరపోషణార్థమై.

అని ప్రాపంచికసమస్తసుఖవిరాగుఁడై పలికెను. ఆ మాట లను విని శ్రీనాథుఁడు సిగ్గుపడి తనయింటికిఁబోయెను. గ్రంథము నరాంకితము చేయకుండుట గొప్పగా భావించి భాగవతమునం దాతఁ డిట్లు చెప్పెను.

ఉ. ఇమ్మనుజేశ్వరాధముల - కిచ్చి, పురంబులు వాహనంబులున్
సొమ్ములు గొన్ని పుచ్చుకొని • చొక్కి, శరీరము వాసి, కాలుచే
సమ్మెటపోటులం బడక, • సమ్మతి శ్రీహరి కిచ్చిచెప్పె నీ
బమ్మెరపోతరా జొకఁడు • భాగవతమ్ము జగద్ధితమ్ముగన్.

ఆతఁడు శ్వేతవరాహావతారఘట్టము నింటిలోఁ గూర్చుండి వ్రాయుచుండఁగా, భాగవతమును దనకుఁ గృతి నీయక నిరా కరించుటచేతఁ గలిగినకోపమున సింగభూపాలుఁడు పోతనా మాత్యుని బాధించుటకుఁ బంపినదూతలను లోనికి రానీకుండ, విష్ణుమూర్తియే శ్వేతవరాహరూపుఁడై యింటి ద్వారమును గాచుచుండె నని యొకకథ కొందఱు చెప్పుదురు.

గజేంద్రమోక్షకథలో గజేంద్రుఁడు మకరదంత పీడితుఁడై, ప్రాణసంశయదశ నొంది, భక్తిపూర్ణమనస్కుఁడై, తన్నుఁ బ్రార్థింపఁగా, శ్రీమహావిష్ణువు,

మ. సిరికిం జెప్పఁడు, శంఖచక్రయుగముం • జేదోయి సంధింపఁ, డే
పరివారంబును జీరఁ, డభ్రగపతిం • బన్నింపఁ, డాకర్ణికాం
తరధమ్మిల్లము చక్కనొత్తఁడు,............
.............గజప్రాణావనోత్సాహియై.

అని వ్రాసెను. ఆపద్యమును శ్రీనాథుఁడు చూచి "ఏమి బావా! మకరమును ఖండించి గజేంద్రుని ప్రాణములను గాపాడఁదలఁచిన విష్ణుమూర్తి, చక్రాద్యాయుధములను వెంటఁ గొనకుండ, రిక్తహస్తములతో వచ్చెనని చెప్పితివికదా! మకరమును గఱవవచ్చెనా? గిల్లవచ్చెనా? వేడుకచూడవచ్చెనా ?" యని యధిక్షేపించెను. ఆమాటల కేమియు నప్పుడు పోతనామాత్యుఁడు ప్రత్యుత్తరము చెప్పక, భోజనకాలమందుఁ దన కేదియో పని యున్నదని చెప్పి, త్వరగ భుజించి,ముందుగ లేచి పోయి, శ్రీనాథునికొడుకు నెక్కడనో దాఁచి, యొక పెద్దరాతిని నూతఁ బడవైచి, "బావా! పిల్లవాఁడు నూతిలోఁ బడినాఁ" డని పెద్దకేక వేసెను. అంత శ్రీనాథుఁడు తినుచున్న యన్నమును వదలివైచి, యెంగిలిచేతితోఁ బరుగెత్తుకొని వచ్చి, నూతిచుట్టు మహారోదనముతో నల్లలాడుచుండఁగాఁ, "త్రాళ్లునునిచ్చెనయు, దిగు మనుష్యులును, లేకుండ నూతిచుట్టును గంతులు వైవ వచ్చితివా?" యని యడిగి "నీకున్న పుత్రవాత్సల్యమిప్పు డెట్లు సాధనసామగ్రిమాట విచారింపకుండ నిన్నుఁ బరుగెత్తించినదో, విష్ణుమూర్తి కున్న భక్తవాత్సల్య మటులే యాతనిని

జక్రాదిసాధనచింత చేయనీయకుండఁ బరిగె త్తించినది" యని యును, బరికరము లన్నియు వెనుకనుండి వచ్చె ననియును, ప్రత్యుత్తరము చెప్పెను.

పూర్వమందే భాస్కరకవి శ్రీమద్వాల్మీకి రామాయణ మును దెలిఁగించినందున, "రామాయణమే నాచేతిలోఁ బడి యుండు నెడల, నాక్రోఁతిని విచిత్రముగా నాడించియుందు"నని యాతఁ డొకపుడు పలికెనని కొందఱు చెప్పుదురు.

ఈకథ లన్నియు యథార్థములు కాక, కల్పితములే యైనను, పోతనామాత్యుని దారిద్ర్యకష్టసహిష్ణుతను, విరాగమనస్క తను, సంపూర్ణసంతుష్టిని, భగవద్భక్తివిశేషమును, నసాధారణ కవితాధోరణిని, సహస్రముఖముల నవి చాటుచున్నవి. ఈ మహానుభావుఁడు 1435-వ॥ సంవత్సరమునఁ గీర్తిశేషుఁ డయ్యె నని చెప్పుదురు.

ఈతనికవిత్వము భక్తిరసప్రధానమైనది; మృదుమధుర పద గుంఫితమైనది; శబ్దాలంకార భూయిష్ఠమైనది; అనర్గళ ప్రవాహము కలది.

కవితాశైలి తెలియుటకై క్రిందిపద్యములను జేదుపుకొన వచ్చును.

ప్రహ్లాదచరిత్ర.

క. ఇందుఁ గలఁ, డందు లేఁ, డని
సందేహము వలదు, చక్రి సర్వోపగతుం,
డెందెందు వెదకి చూచిన
నందందే కలఁడు, దానవాగ్రణి ! వింటే.

శా. నిన్నున్నెచ్చరు నీతిపారమహిమజ్ఞుల్, • నీతోడి దైత్యార్భకుల్
గన్నా రన్నియుఁ, జెప్ప నేర్తురుకదా! • గ్రంథార్థముల్ పత్తురై,
యన్నా! యెన్నఁడు నీవు నీతిమతివౌ • దంచు, న్మహావాంఛతో
నున్నాఁడన్, నను గన్నతండ్రి! భవదీ•యోత్కర్ష మాఁ జూపవే!

వామనకథ.

శా. కారే రాజులు! రాజ్యముల్ గలుగవే? • గర్వోన్నతిం బొందరే?
వా రేరీ? సిరి మూట గట్టుకొని పో • వం జాలిరే? భూమిపైఁ
బేరైనం గలదే? శిబిప్రముఖులుం • బ్రీతిన్ యశఃకాములై
యీరే కోర్కులు? వారలన్ మఱచిరే • యిక్కాలమున్ భార్గవా

గజేంద్రమోక్షము.

శా. లా వొక్కింతయు లేదు, ధైర్యము విలో•లం బయ్యెఁ, బ్రాణంబులున్
ఠావుల్ దప్పెను, మూర్ఛవచ్చెఁ, దనువున్, •డస్సెన్, శ్రమంబయ్యెడిన్
నీవే తప్ప నితఃపరం బెఱుఁగ, మ•న్నింపందగున్ దీనునిన్,
రావే! యీశ్వర! కావవే! వరద! సం•రక్షింపు భద్రాత్మకా!

క. కలఁ డందురు దీనులయెడఁ,
గలఁ డందురు పరమయోగి•గణములపాలన్,
గలఁ డందు రన్నిదిశలను,
. గలఁడు కలం డనెడువాఁడు • కలఁడో? లేఁడో?

శ్రీరామ కథ.

క. భూతలనాథుఁడు, రాముఁడు,
ప్రీతుండై పెండ్లియాడెఁ • బృథుగుణమణిసం
ఘాతన్, భాగ్యోపేతన్,
సీతన్, ముఖకాంతివిజిత•సితఖద్యోతన్.

———— ——

# 7. చెఱపకురా చెడెదవు-
## చంద్రహాస చరిత్ర.
### మొదటి భాగము.

కేరళదేశరాజునకు మూలనక్షత్రమున నొక చక్కని మగశిశువు కలిగెను. అతఁడు పుట్టిన కొన్నిదినములకే తండ్రి శత్రువులతోఁ బోరి హతుఁడయ్యెను. తల్లి చిచ్చుఱికి మృతి నొందెను. అంత దాదులతనిఁ గుంతలదేశరాజధానియగు కౌంతలమునకుఁ గొంపోయి ప్రేమతో మూఁడేండ్లు పెంచి తాము మరణించిరి. గండదోషముచేఁ దనవారినందఱను గోల్పోయిన యా సుందరబాలకునకుఁ గౌంతలపురపురంధ్రులే కన్నతల్లులైరి. ఒక యామె యన్నము పెట్టుచు, నొక పుణ్యసతి జలకమార్చుచు, నొక యమ్మ కూఁకటిదువ్వి పూలుముడుచుచు, నొక దయావతి లాగులుచొక్కాలుదొడిగి బొట్టుపెట్టి ముస్తాబుచేయుచుఁ, బౌరకాంత లతనికే లోటురాకుండ ముద్దుగాఁ బెంచుచుండిరి.

ఇట్లు గారాబముగాఁ బెరుఁగుచు రాకొమరుఁడొక్కనాఁ డూరఁదిరుగాడియాడి మంత్రియగు దుష్టబుద్ధి సదనమునకు యాదృచ్ఛికముగాఁ బోయెను. అతఁడప్పుడు మహామునులతోఁ గొలువునఁ గూరుచుండెను. బాలభానునివలెఁ బ్రవేశించిన బాలకునిఁ జూచి "యీముద్దులాఁడు సర్వమహీమండల మేలఁగల మహిమగలవాఁడు. అట్టిసాముద్రికలక్షణము లితనియందగపడుచున్నవి." అని మునులందఱెంతో మోదముతోఁ బలికిరి. అసూయావతారమై యన్వర్థనాముఁడగు దుష్టబుద్ధి యామాటలు వినియువిననట్లుండి, యతులనతివినయముతో

ననిపివైచి, చండాలకింకరులఁ బిలువనంపి "యీ కుబ్జవాని నడవికిఁగొనిపోయి యటఁజంపివేయుఁ" డని యాజ్ఞాపించెను.

మంత్రిపనుపు ననుసరించి మాలతిలారు లాబాలకు నొక భీకరారణ్యమధ్యమునకుఁ దీసికొనిపోయి చంపనుద్యుక్తులై కత్తులుజళిపింప, నదిగాంచి యాతఁడాపద్బాంధవుఁడగు శ్రీహరిని నిజహృదయపీఠమునగట్టిగా నిల్పి కన్నులు మూసికొని యుండెను. అంతట నాహంత, లకాండజాత కృపాంతరంగులై బాలుఁ జంపఁజాలక, యతనివలకాలి పిల్ల వ్రేలు మొదలంటఁగోసి పట్టుకొని, బిడ్డనటవిడిచి పురికేగి, ఖండితమైన కాలికనిష్ఠిక మంత్రి ముందటఁబెట్టి నమస్కరించి, "దేవర యభిమతముతీర్చి వచ్చితి" మని విన్నవించుకొనిరి. దానిఁ గని యతఁడమందానందమునఁ ఋషులమాటలు మృషావాక్యములయ్యెనని నిశ్చయించుకొని నిశ్చింతుఁడై యుండెను.

అట నరణ్యమునందా నర్భకుఁడు, వ్రేలునఱకినబాధచే విలపించుచుండియును, జగద్రక్షకుని మఱవక మనమునను "శ్రీహరీ! శ్రీహరీ!" యని యఱచుచుండెను.

దుష్టబుద్ధికి విధేయుఁడగు కుళిందకుఁడను నొక శబరరాజు వేటకై గుబ్జమొక్క యటకువచ్చి సార్వభౌమదివ్యలక్షణలక్షితుఁడై శ్రీహరిం దలఁచుకొనుచు బాధపడుచున్న చిన్నవానిఁగని జాలినొంది గుబ్జముడిగి "ఇతఁడు హరిభక్తుఁడు, నేనును హరిపాదసేవకుఁడను. నేననపత్యుఁడనై యున్నానని కరుణించి శ్రీహరి నాకీబిడ్డను బ్రసాదించినాఁడు కాఁబోలు. ఔరసుఁడు దత్తుఁడు మున్నగు ననేకవిధసుతులుందురుగదా! అందు స్వయంప్రాప్తుఁడొకఁడు. ఈముద్దుబిడ్డ నాకు స్వయం

ప్రాప్త పుత్రుఁడు" అనితలపోసి, బాలకు బుజ్జగించి లేవనెత్తి తనతురగముపై నిడికొని మహానందముతోఁ దనరాజధాని యగు చందనావతీపురికి మరలిపోయెను; పోయి జోస్యుల యనుమతి నొకశుభముహూర్తమున నిజాంతఃపురంబు సొచ్చి సుందరబాలకుని దనరాణియగు మేధావిని కొసఁగెను. చంద్రు నివవ్వుహాసము గలవాఁడుగాన, జంద్రహాసుఁడను పేరు పెట్టు కొని దంపతులిరువురు, బిడ్డప్రమత్తులై యల్లారుబెల్లముగాఁ బెంచుకొనుచుండిరి. కుళిందకుఁడు కొడుకున కుపనయనము గావించి సద్గురువుల నియమించి వేదశాస్త్రములందును ధను ర్విద్యయందును దురగారోహణాదిక్షత్రియోచితసమస్తేతరవిద్య లందును నతని నారితేఱినవానిగాఁ జేయించెను.

క్రమముగాఁ జంద్రహాసునకుఁ బదియాఱేండ్ల ప్రాయము రాఁగానే, తండ్రిపంపున నతఁడు పరరాజులనోర్చి నిజవిక్ర మార్జితములైన ధనాదులు కప్పములుగాఁ గొనివచ్చి యత నికి నమస్కారపూర్వముగా సర్పించుచుండెను. మహావీరుఁ డనియు మహాభక్తుఁడనియుఁ బుత్రరత్నమనియుఁ జంద్రహాసు నకు జనులందఱు జయపెట్టుచుండిరి.

ఇట్లుండఁగా నొకనాఁడు, కుళిందకుఁడు చంద్రహాసుఁ బిలిచి "నాయనా! నీప్రతాపముచే సమస్త శత్రురాజులను జయించి ధన కనకవస్తు వాహనాదులుదెచ్చి మనచందనావతి నలకాపురిఁ గావించుచున్నావు. మాయమ్మకు నాకును గీర్తిఁ దెచ్చి నిరవధికానందప్రదుఁడవగుచున్నావు; చిరంజీవివై యుండుము." అని బిడ్డమేను నిమురుచు "తండ్రీ! మనయేలి కయుఁ గుంతల దేశాధీశు మంత్రియునగు నతనికిఁ గొంత

ధనము కానుకగాఁబంపి యంతకంటెనెక్కువసొమ్మరిగా నతని యేలికకంపుము." అనిచెప్పెను.

జనకునియాజ్ఞ శిరసావహించు చంద్రహాసుఁడు దుష్టబుద్ధి కొకలేఖవ్రాసి, చారులకిచ్చి, వారిచే నతనికిని రాజునకును రాజపురోహితుఁడగు గాలవునకును నసంఖ్యమైన ధనమును దుకూలకాంచనమణిభూషణాదులును గానుకలుగాఁ బంపెను. వారవి కొంతలమునకుఁ గొనిపోయి రాజపుత్రుఁడంపిన యుత్తరము దుష్టబుద్ధికిచ్చిరి.

దుష్టబుద్ధి కానుకలుగైకొని, యాయుత్తరము కుంతలేశ్వరునకుఁ జూపి, చారులను సత్కరించిపంపివైచి, రాజుచెవిలో నేమి యూఁదెనో తెలియదు, కుళిందకునిఁ బట్టి బంధింప నతని యనుమతిఁ బడసివచ్చెను. ధనాశఁ బుట్టించియుండవలెను, లేదా స్వయముగా జాబువ్రాయక తనయునిచే లేఖనంపి మాయెడల నపచారముచేసినాఁడని కొండెములుచెప్పి కోపము పుట్టించి యుండవలెను. ఎట్లైననేమి? మంత్రి యొకదళముతో బయలుదేఱి శీఘ్రముగాఁ జందనావతీపురిఁ జేరెను. అతని రాక తెలిసికొని కుళిందకుఁడు పుత్రునితో నెదురేగి భయభక్తులతోఁ బ్రణమిల్లి నిజభవనమునకు సగౌరవముగాఁ గొనివచ్చి సర్వోపచారములతో నాతిథ్యముఁ గావించెను.

పూర్ణచంద్రునివలె నెదుటఁ బ్రకాశించుచున్న చంద్రహాసునిఁగాంచి "మిత్రమా! యిట్టిదివ్యమంగళ విగ్రహుఁడైన కొడుకు నీకెట్లుగల్గెను?" అనిమంత్రి కుళిందకునడిగెను. కుళిందకుఁడు జరిగినసమాచారము పూసగ్రుచ్చినట్లుచెప్పి "నాథా

గ్యవశమున నాకుదొరకిన నాఁటికితఁడై దేండ్లవాఁడు" అని కూడఁ దెలియఁబఱిచెను.

ఆమాటవిని తలారులపై మనసులోమండిపడి "యిచట నేనేమిచేసినను నాకవశ్యమపాయము వచ్చును, గాంతల ములో వీనిని నాకుమారుచేతఁ జంపింతును" అని దుష్టబుద్ధి యెంచి, పైకాతిథ్య సత్కృతులచే సంతుష్టాంతరంగుఁడైన వానివలెనే నటించుచు నొకపత్రికవ్రాసి మూసి ముద్రవేసి చంద్రహాసుని దగ్గఱగాఁబిలిచి, యది వానిచేతికిచ్చి "స్వయ ముగా నతివేగముగా నీవుచని యిది నాతనయునికిమ్ము, నీకు శుభమగును." అని చెప్పెను. ఆజాబులో నిట్లువ్రాయఁబడి యుండెను:—

"చిరంజీవి కుమారుఁడు మదనునకుఁ దండ్రి దుష్టబుద్ధి దీవించి వ్రాసి ప్రేమతోఁ బుత్తెంచు శుభలేఖ. కుళిందకుని కొడుకగు నీ చంద్రహాసుఁడు కులస్థానపౌరుషాధికుఁడు, పరమ సుందరుఁడు, మనకు నీతఁడహితుఁడు, కావున సందేహింపక యీ పత్రిక చూచినతోడనే విషము నొసఁగుము".

చిత్తమని, రాకొమరుఁడొక జవనాశ్వమునెక్కి శీఘ్ర ముగాఁజని, కౌంతలపురప్రాంతప్రమదవనమధ్యమందున్న కాసా రముకడ దిగి, గుఱ్ఱమును నీరు ద్రావించి, మంచి పచ్చిక పట్టునఁగట్టి, బడలికచేఁ దానొకచల్లనిచోటఁ బరుండి నిద్రించు చుండెను.

కుంతలాధీశ్వరు కూఁతురగు చంపకమాలినియును దదమాత్యతనయ యగు విషయయును జెలికత్తెలతో ననంగ పూజార్థమటకు వచ్చి యపుడు వనవిహారము చేయుచుండిరి.

నిద్రించుచున్న రాజపుత్రుని విషయచూచి మోహించి, చరణా భరణముల చప్పుడుగాకుండ మెల్లగానడచి, చెంత కేగి, ప్రక్కను వ్రేలాడుచున్న పత్రికఁ దీసి విప్పిచూచి, తన యన్నకుఁ దండ్రి వ్రాసిన ఘోరపువ్రాఁత కెంతో పరితపించి,

క॥ విషమాస్త్రసమానునకు
నవ్విషమొసఁగన్ వ్రాసెఁ దండ్రి నిర్దయుఁ డని యా
వ్విషమాక్షరపం క్తిదుడిచి
విషయ నొసఁగుమనుచు వ్రాసె వేడుకతోడన్॥

(జై. భార. 8-77)

వ్రాసి పత్రిక యెప్పటియట్లమూసి యథాస్థానమున నుంచి కామోపహతయై పోయెను.

చేటికలతో రాజపుత్రియు విషయయు మరలి పురికరిగిన కొంతసేపటికిఁ జంద్రహాసుఁడు మేల్కని గుఱ్ఱమెక్కి వడివడిగాఁ బోవుచుండఁగా నతనికనేక శుభశకునము లయ్యెను. ఉత్తరము చూచి, యుత్తరముఁ దెచ్చిన నవమన్మథునిఁ జూచి, తన చెలియలి పుణ్యమే! మని కొనియాడుచు, దైవజ్ఞులా రాత్రినే మంచి లగ్నముంచుటచేత, మంత్రికుమారుఁడు విషయ నతనికిచ్చి దేవేంద్ర వైభవముతో వివాహము చేసెను.

---

## 8. చెఱపకురా చెడేదవు-

### చంద్రహాసచరిత్ర.

### రెండవ భాగము.

ఇఁక నటఁ జందనావతి యందున్న దుష్టబుద్ధి—యీపాటికి నా సంకల్పము పూర్తిగా నెఱవేఱియుండు—ననుకొని నిశ్చిం

కముగాఁ గుళిందకుని దుర్గమెల్లఁ జూఱకొని, ద్రోహియై యతనిని శృంఖలబద్ధునిఁజేసి, పెండ్లి మూఁడవనాఁడు తన యూరికిపచ్చి చూడఁగా, ననుకొనిన దొకటియు నైనదొకటియునయ్యెను. "దురాత్మా! నేఁటిదాఁక నామాట జవదాఁటనివాఁడ విప్పుడిట్లు చేసితివేమిరా?" యని మదనునిఁ గసరి యడుగఁగా "తండ్రీ! స్వహస్తలిఖితమైన మీజాబు ప్రకారమే చేసితినిగాని పిత్రాజ్ఞోల్లంఘనము చేయలేదు. చెల్లెలిని చంద్రహాసునికిచ్చి పెండ్లిచేసి, యతని కపాయమువచ్చునెడల రక్షించుటకై నాప్రాణమిత్తునని హిత జనులయెదుటఁ బ్రతిజ్ఞ చేసితిని. ఇదిగో మీరంపిన యుత్తరము" అని పలికి దానినిఁ దండ్రి చేతికిచ్చెను.

అదిచూచి యద్భుతమంది "యిదంతయు వీఁడు చేసిన మోసమే" యనుకొని, తనయునిపై జనించిన తన యవిశ్వాసము లోలోపలనే యడఁచుకొని, దుష్టబుద్ధి మిన్నకుండెను. ఇంతలో నూత్న వధూవరులు వచ్చి యతనికి దండముపెట్టిరి. లోపలఁ గుట్టుచుఁ బైకి దీవనలొసఁగి యతఁడు నాలవనాఁటి మహోత్సవముకూడ సాగనిచ్చెను. మఱునాఁడు పెందలకడ లేచి "అయ్యయ్యో! కూఁతురును గొడుకును నావంశమంతయుఁ జెఱచినారుగదా! చంద్రహాసునిఁ బెంపొందనిచ్చినఁ బ్రమాదమగును. వీనినెట్లైన విగతజీవునిఁజేసి యతుల మాటలసత్యముచేసెదను." అని కృతనిశ్చయుఁడై దుష్టబుద్ధి, వెనుకటి తలారులనేపిలిచి "కృతపడ్డతప్పు క్షమించితిని. నేఁడపరసంధ్యాముఖమునఁ గాళికాలయములోని కొంటరిగావచ్చిన వానిఁ బోనీక నఱకివేయుఁడు. అట్లుచేసిన నాయాస్తిలో సగమాస్తి

మీకిచ్చెదను; నాయొక్క కొడుకుమీఁద నొట్టుపెట్టుకొని యిట్లు చెప్పుచున్నాను, నమ్మి పనిచేయుఁడు" అని పలికెను. వారందుల కొడఁబడి మూఁడవజాముననే చండికాగృహములోఁ బ్రవేశించి యటడాఁగి యుండిరి. చంద్రహాసుని రావించి "నాయనా! వివాహానంతరమునఁ బెండ్లికొడుకొక్కఁడును వెళ్లి దుర్గాదేవి భజించుట యవశ్య కర్తవ్యమైన యాచారము గనుకఁ దప్పకుండ నీవీ సాయంకాలమున నటకుఁ జని కాళిఁ బూజింపుము" అని చెప్పెను. "చిత్త, మట్లే చేసెద" నని చంద్రహాసుఁ డొప్పుకొనెను.

ఆనాఁడే, కుంతలకాంతుఁడు శిరోవిరహితమై యున్న తన చాయఁగాంచి, యదియరిష్ట సూచనమని గ్రహించి, గాలవునిఁ బిలిపించి "మహాత్మా! నాకు రాజ్యముమీఁది కోరిక నశించినది. నానీడకుఁ దలగానరాకున్నది, కర్తవ్యమేమో సెలవిందు" అని ప్రార్థించెను. అంతటఁ బూజ్యుఁడైన పురోధనుఁడు వివిధములైన మరణసూచన లెఱిఁగించి "రాజా! యిట్టి యరిష్టములు గోచరించినపుడు, భగవదర్చన జపహోమదానాది సత్క్రియలచే వానికి శాంతిగావించి, తత్వజ్ఞులు సర్వసంగపరిత్యాగముచేసి జలము జలముతోఁ జేర్చునట్లు జీవాత్మఁ బరమాత్మతోఁ గలిపివేసికొందురు" అని చెప్పెను. రాజు, పాము కుప్పసము విడుచునట్లు, తాఁ దన రాజ్యాది బంధములఁ దొలఁగించుకొనఁదలఁచి మంత్రికుమారుఁడగు మదనుని రావించి "సర్వ సద్గుణ సంపన్నుఁడగు నీమఱఁది చంద్రహాసు నీ క్షణమే యిటకుఁ దెమ్ము, మా చంపకమాలినిఁగూడ నతనికిచ్చి పెండ్లిచేసెదను" అని చెప్పెను. చిత్తమని మద

నుఁడు గుఱ్ఱమెక్కి పరుగు పరుగునఁ జని కాళికార్చనకై యొంటిఁజనుచున్న చంద్రహాసునిఁగని యతనివలన యావద్వృత్తాంతమును దెలిసికొని "రాజాజ్ఞయైనది, నాగుఱ్ఱమెక్కి యీక్షణమే నీవాయన యొద్దకుఁబొమ్ము, నేను జని నీకు బదులుగా నమ్మవారి నర్చించెదను" అని చెప్పి పంపి, యతని చేతి గంధపుష్పాక్షతములు గైకొని తాను గాళికాదేవి గుడికిఁజనెను.

రాజు, గాలవాజ్ఞానుసారముగాఁ జంద్రహాసునకుఁ జంపక మాలినిఁ బెండ్లిచేసి, యల్లునకంత రాజ్యమును గట్టిపెట్టి, విరక్తుఁడై తాను దపోవనమునకుఁ బోయెను.

కాళికాలయమునఁ గనుచీఁకటిలో మదనుఁడు కాలుపెట్టఁ గనే, పశుహంతలు పైఁబడి, యతని నాయుధములతో నఱికి పొడిచి చంపిరి.

నూత్నవధూసమేతుఁడై మహావైభవముతోఁ జంద్రహాసుఁడు తన తొలి మామయగు దుష్టబుద్ధికిఁ బ్రణమిల్ల,నతని నగరునకేగెను. ఏగి యెఱిఁగి, తన యల్లుఁడు రాజునల్లుఁడును రాజునుగూడ నయ్యెనని తత్పూర్వమే విని కలఁగియున్న యతనికిఁ దన వృత్తాంతమును దనకు మాఱుగా మదనుఁడు చండికా సదనమున కరిగిన తెఱఁగును దెల్పఁగా, లోన నెంతయో కళవళమందియు దానిఁ గప్పిపుచ్చి, యల్లునిఁ బ్రియోక్తులతో సంతోషపెట్టిపంపి, దుష్టబుద్ధి యెడలెఱుఁగక యొంటరిగా గుడికిఁబోయి యటఁజచ్చి పడియున్న సుతునిఁజూచెను. చూచి భగ్నమనోరథుఁడై "నేను నేఁ ద్రవ్వికొన్న గోతిలోనే కూలితిని, భక్తులకుఁ గీడుసేయఁదలఁచు ద్రోహుల పన్నుగడలు

సాగునా? అతనిఁ జంపఁబోయి నాయొక్క సుతునిఁ జంపుకొంటిని. ఇఁక నా బ్రదుకేల?" యని యతఁడు పశ్చాత్తాపానలమునఁ బడి మలమలమాఁడి, బలిపీఠోపలముపైఁ దలఁ బగులఁగొట్టుకొని ప్రాణములు విడిచెను.

తెల్లవాఱఁగనే దేవినుపాసించు తపస్వి యొకఁడు వచ్చి, వీనుఁగులై గుడిలోఁబడియున్న మంత్రి మంత్రిపుత్రులఁ గాంచి, కతంబెఱుఁగక యుత్తలపడి, క్రొత్తగా సింహాసన మెక్కిన చంద్రహాస భూకాంతునితో నాఘోరవార్త విన్నవించుటకుఁ బరుగిడి పోయెను. ఆవృత్తాంతము వినినవెంటనే చంద్రహాసుఁడు పాదచారియై వడివడి వచ్చి గుడిసొచ్చి చచ్చిపడియున్న సన్నిహితబాంధవుల నిరువురఁ గాంచి "అయ్యో! నాకు రాజ్యము వచ్చిన వెంటనే యిద్దఱు ప్రధానపురుషులిట్లు హతులైరే! వీరిని బ్రదికింపకున్నఁ బ్రజలచే నాఱడి పడుదునే!" యని శోకతప్తుఁడై వెంటనే యొక విశాలమగు హోమకుండముఁ ద్రవ్వించి పావకుఁదగులుకొలిపి, ధ్యానాయత్త చిత్తుఁడై "తల్లీ! నీవు భగవంతుని చిచ్ఛక్తివి. నాకండలు దఱిగివేల్చి యిదిగో నాశిరమునీకుఁ బూర్ణాహుతిగా నిచ్చుచున్నాను" అని ఖడ్గము దూసి యట్లు గావింపఁబోఁగా, నంబ ప్రత్యక్షమై యాచేయి పట్టుకొని "వలదు, వలదు, వత్సా! నీవాంఛిత మేదో తెల్పు" మనెను. "జగజ్జననీ! మొదట వీరల బ్రతికింపుము, పిమ్మట శ్రీమన్నారాయణుమీఁద నాకుగాఢమైన భక్తిఁ బ్రసాదింపుము" అని వేఁడుకొనెను. "బిడ్డా! అట్లేయగుఁ గాక! నీకు బలాన్వితులగు నిద్దఱు కుమారులు గూడఁ గలుగుదురు" అని దేవి హస్తమస్తక సంయోగముచేఁ జంద్రహాసునకుఁ బరమ

తత్వజ్ఞానమును ప్రసాదించి, యంత ర్హితయయ్యెను. మామయు మఱందియును నిద్రమేల్కాంచిన వారివలె లేచి కూరుచుండిరి. దివినుండి పుష్పవృష్టి గురిసెను.

చంద్రహాసుఁడు, జరిగిన సర్వవృత్తాంతములును దెలిసి కొని దుష్ట శత్రువైన మామను మహోదారుఁడై క్షమించి, శృంఖలాబద్ధుఁడైన తండ్రిని విడిపించి,జననీజనకులగు మేధావినీ కుళిందకులను స్వాంతశుద్ధితో మ్రొక్కి, ప్రజానురంజకముగా రామరాజ్యము వలెఁ జిరకాలము రాష్ట్రము పాలించెను. అతనికిఁ జంపకమాలినియందుఁ బద్మాక్షుఁడను కొడుకును విషయ యందు మకరధ్వజుఁడను కుమారుఁడును గలిగిరి. వీరాగ్రేసరుఁడును విష్ణుభక్తుఁడునునగు నీ చంద్రహాసుఁడు శ్రీకృష్ణునిచే ధర్మరాజు నశ్వమేధ యాగంబునకుఁ గొనిపోఁబడి యట నధిక సమ్మాన మందెను.

---

# 9. గొప్ప చిత్రకారుఁడగు రవివర్మ.

సేద్యము, వాణిజ్యము, వడ్రంగిపని, కుమ్మరవృత్తి మొదలగు వ్యాపారములు ప్రజల జీవనమున కత్యావశ్యకములు. అవి లేనిచోఁ దినుటకుఁ దిండిగాని, వసించుట కిల్లుగాని, వండుకొనుటకుఁ బాత్రములుగాని యుండవు.

ఇవిగాక కేవల మనోరంజకములును నీతిబోధకములును నగు కళలు కొన్ని గలవు. కవిత్వము, సంగీతము, చిత్రలేఖనము, శిల్పవిద్య, మున్నగునవి యట్టివి. అవి లేకపోయిన మానవజీవన మసాధ్యముగానేరదు కాని, యంత యానందకరముగ నుండఁ

జాలదు. కవి, గాయకుఁడు, చిత్రకారుఁడు, తక్షకుఁడు లేని దేశ మనాగరక దేశ మనిపించుకొనును. అట్టి దేశములవారు సర్వ జంతు సామాన్యములైన యాహార నిద్రాదులనే ప్రయోజనములు చేసికొని, యితర పరమార్థములఁ గోరక పశుప్రాయులుగాఁ బరిగణింపఁ బడుదురు.



మన దేశము పూర్వ మత్యున్నతస్థితిలో నున్నప్పుడే విద్యలన్నియు మిక్కిలి వన్నె కెక్కి యుండినవి. వివిధాలంకారములతో నిర్మింపఁబడిన గోపురములును, రాలు మలిచి చిత్ర చిత్రముగాఁ జెక్కిన దేవాలయములును, బవిత్రీకృత పర్వత వివరములును, దాని కిప్పటికిని సాక్షులుగా నున్నవి. పూర్వకాల

మున స్త్రీలును జిత్రలేఖనమునందు మిక్కిలి నిపుణలై నట్టు నాటకాదులు నిదర్శనములై యున్నవి. కాళిదాసును మించిన కవియునుఁ ద్యాగరాజును మించిన సంగీత కళాకుశలుఁడును లేరనియే చెప్పవచ్చును.

చిత్రకర్మమే వృత్తిగాఁగల ముచ్చిజాతికూడ నొకటి మన సంఘములోఁ గలదు కాని, ప్రజాప్రోత్సాహము లేక నిరాలంబమై యావిద్య నానాఁటికి క్షీణదశకు వచ్చినది.

ఖిలమైన యాచిత్రశాస్త్రమునకుఁ బునఃప్రాణప్రతిష్ఠగావించి యభివృద్ధికిఁ దెచ్చిన మహాత్మునిచరిత్ర యీ పాఠములో నతిసంగ్రహముగ వ్రాసెదము. ఆయన రాజవంశములోఁ బుట్టిన రవివర్మ యను నాథునికి చిత్రవిద్యాప్రవీణుఁడు.

ఉత్తమకవు లెంత గౌరవపాత్రులో, యుత్తమ చిత్రకారులు నంత ప్రశంసనీయులు. చక్షుశ్శ్రోత్రముల ద్వారమున నానందమిడునది కవిత్వము. నయనద్వారమున మాత్రమే యమితానంద మొసఁగునది చిత్రలేఖనము. శ్రవణానందకర మగు గానమును, జక్షురానందప్రద మగుశిల్పమును గవితాకాంతకుఁ జెలికత్తెలు. సంగీత మెట్లాపాతమధురమో సరసప్రతిమాదర్శన మట్లు సద్యఃప్రమోదదాయకము. కొంతసేపు చేదివినఁ గాని కవితారసానుభూతి హృదయమునకుఁ గలుగదు. విగ్రహము కంటఁబడినంతమాత్రముననే తత్ప్రతిపాదితము లైన భావములును శృంగార కరుణాది రసములును ద్రష్టలచిత్తములఁ బ్రవేశించి వారిఁ జొక్కించును. చిత్రపటాలోకనక్షణమునందు మనకుఁ బొడము చిత్తవృత్తులను గవీశ్వరుఁ డొక యాశ్వాసము గ్రంథము రచించినఁగాని యుప్పతిల్లఁ జేయఁజాలఁడు. శిల్పి

నై పుణ్యా మంతగొప్పది. కనుక మన దేశములోఁ బడిపోయిన చిత్రలేఖన కళకుఁ బునరుద్ధారకుఁడై పుణ్యము గట్టుకొనిన రవి వర్మగా రెంతయును సంస్తవనీయులు.

తిరువాన్కూరు రాజధాని యగుతిరువనంతపురమున కుత్తరమున 20 మైళ్లదూరమున నున్న "కిలిమనూరు" అనుగ్రామమున 1848వ సంవత్సరమున రవివర్మ జన్మించెను. ఇతని కుటుంబమువారు పూర్వము చిరకాలము రాజ్యము చేసినవారైన నప్పటికిని 16-17 వ శతాబ్దులలోఁ బరాజితులై రాజ్యమును గోల్పోయిరి. అప్పటినుండియు వారు ప్రస్తుతరాజకుటుంబము వారికి విశ్వాసపాత్రులై వారితో వివాహసంబంధములు గలిగి యతిమైత్రితోఁ బ్రవర్తించుచున్నారు. కనుక నిప్పటికిఁ గిలిమనూరు వంశజులకు రాజసమ్మాన మెక్కువగా నున్నది.

కిలిమనూరు కుటుంబములోఁ బెక్కండ్రువిద్యాసంపన్నులు గలరు. అది రాజకుటుంబమే కాక పండితకుటుంబ మని కూడఁ జెప్పవచ్చును. మఱియొక విశేషము గలదు. రవివర్మలోఁ బరిణతి నొందిన చిత్రకళాభిరుచి, యందలివారి కెందఱికో కలదు. రవివర్మ తల్లి విదుషీమణి, వివేకవతి, కొంచెము కవిత్వము గూడఁ జెప్పఁగలిగిన యామె. పితృవ్యుఁడగు రాజరాజవర్మ చిత్రవిద్యయందు మిక్కిలి కుశలుఁడు.

సాధారణముగా మేధావంతులకు దారిద్ర్యపీడ దప్పదని చెప్పుదురుగాని, రవివర్మపట్టున నీమాట పట్టినది కాదు. అత్తగోడండ్రైన లక్ష్మీసరస్వతుల పొత్తున శోభిల్లుచున్న యుత్తమ రాజకుటుంబములో రవివర్మ, భోగములనడుమఁ, బెరిఁగి పెద్దవాఁ డయ్యెను.

పూవు పుట్టినతోడనే పరిమళము తెలియునందురు గదా! కులాచారానుసారముగ రవివర్మకు బాల్యమందు సంస్కృత భాష నేర్ప నారంభింపఁగా, బాలకునిమనసు గ్రంథములపై కెక్కక యతనిచేత పురాణస్థలగు నుత్తమకాంతల విగ్రహములు గోడలమీఁద గీయింప మొదలు వెట్టెను.

రాజరాజవర్మ యొకనాఁడు చెట్టుతోనున్న యొకపటమును జిత్రించి యేదోపనిమీఁద నావలికి వెళ్లెను. అంత రవివర్మ చిత్రనిర్మాణాగారములోఁ బ్రవేశించి పితృసోదరుఁడు తిరుగ వచ్చులోపల నాచెట్టుమీఁద నొకచిలుకను వ్రాసెను. రాజరాజవర్మ వచ్చి చూచి బాలుఁడు వ్రాసినచిలుక యంతసనీగా లేక పోయినను, బిల్లవానిమనసు నొప్పించుట కిష్టము లేక దానిని జెఱిపివేయక యుంచి బాగుచేసి చిలుకతోఁ జిత్రమును బూర్తిచేసెను.

1862-వ సంవత్సరమున, అనఁగా రవివర్మ పదునాలుగేండ్ల వాఁడు కాఁగానే, రాజరాజవర్మ యతనిఁ 'దిరువాన్కూరు' ప్రభువునొద్దకుఁ దీసికొనిపోయి దర్శనము చేయించి బాలకుని చిత్రరచనాభిలాషను గూర్చి విశేషముగాఁ బ్రసంగించెను. ప్రభువు మిక్కిలి సంతోషించి బాలకునికి నీటిరంగుల పెట్టె నొకటి బహుమతిచేసెను. నీటిరంగు లనఁగాఁ జమురుతోఁగాక నీటితోఁ గలిపి ప్రతిమలకు వేయురంగులు. ఆయువకునకుఁ గలిగిన యానంద మేమని చెప్పఁదుము! రాజ్యప్రాప్తియైనను రవివర్మకంత సంతోష మీయఁగలదని చెప్పలేము.

చెప్పుట కొక గురువు లేఁడు. తనబుద్ధినే గురువుగాఁ జేసి కొని యేఁడు సంవత్సరములు తదేకదీక్షతో నారంగులపెట్టెతోఁ

బనిచేసి రవివర్మ తనచిత్రశాస్త్రజ్ఞానము నభివృద్ధి పఱచుకొనెను.

పదునేడవయేఁట (1865వ సంవత్సరమున) రవివర్మకుఁ దిరువాన్కూరు మహారాజుగారి కుటుంబములోని యొక కన్యక నిచ్చి పెండ్లి చేసిరి. అందువలన నాతఁడు రాజభవనమున నివసించి యచ్చటి గొప్పగొప్ప పటములను గొప్పగొప్పచిత్రలేఖ్యములను జూచుట తటస్థించెను.

నిపుణుఁడగు పాశ్చాత్య చిత్రకారునిచేఁ దన కుటుంబములోని యందఱ పటములు వేయింపవలయునను కుతూహలము 1868. వ సంవత్సరమున మహారాజుగారికిఁ గలుగుటచే "థియడోర్జాన్సన్" అనునొక ప్రసిద్ధచిత్రకారుని యూరప్పునుండి పిలిపించిరి.

ఆయన తైలవర్ణములతోఁ బని చేయువాఁడు. తైలవర్ణములనఁగా నీళ్లతోఁగాక చమురుతోఁ గలిపి వేయు రంగులు.

వానిప్రాశస్త్యమును గనిపట్టి రవివర్మ యవి యుపయోగపఱుచు విధమును దనకు బోధపఱుపు మని పాశ్చాత్యచిత్రకుని వేఁడుకొనెను. అసూయ చేతనో మఱే యేకారణముననో జాన్సన్, రవివర్మకోరిక నెఱవేర్పలేదు. అయినను జాన్సను రంగులు కలుపునప్పుడు వేయుపాళ్లను, గలిపిన తరువాతఁ జిత్తరువునకు వర్ణము వేయు విధమును, విశేషశ్రద్ధతోను జాగరూకతతోను బరికించి యందలి కళారహస్యములను స్వబుద్ధితో వీలైనంతవఱకు రవివర్మ గ్రహించెను. గ్రహించి యతఁడు తైలవర్ణములతో నాఁటినుండియు పనిచేసెను. రాజ

భవనమునకు వచ్చినప్పుడు దక్క, మునుపటివలె రాజరాజవర్మ సాహాయ్యముకూడ నతని కిపుడు లేక పోయెను.

ఇట్లుండ, 1873-వ సంవత్సరమున, మదరాసు శిల్పకళాశాలాధ్యక్షుఁడగు 'చిజమ్' దొర తిరువనంతపురమునకు వచ్చి, రవివర్మనుజూచి, గురుశిక్ష యేమియులేక స్వయంకృషితోఁ జిత్రలేఖనమునం దతఁడు చేయుచున్నపనిఁ జూచి, యద్భుతపడి యతని బుద్ధికుశలతను మెచ్చుకొని, రాఁబోవు మదరాసు వార్షికచిత్రప్రదర్శనమున కొక చక్కని పటము చిత్రించి తీసికొనిరమ్మని ప్రోత్సాహపఱిచెను.

'చిజేమ్మ'ంతవాని మెప్పువడసిన తనబంధువు సామాన్యుఁడుగాఁ డని తలఁచి, సంతోషపడి, మహారాజుగా రందుల కగు ఖర్చులన్నియును దా మిచ్చెద మని సెలవిచ్చిరి.

అంత రవివర్మతనయావచ్ఛక్తియు వినియోగపఱిచి, వేనలి మల్లెపూలదండతో నలంకరించుకొనుచున్న ట్లొక మలయాళదేశపు నాయరు సుందరిని జిత్రించి, 1874 వ సంవత్సరము జాన్యుఅరి నెలలో మదరాసు ప్రదర్శనశాలకుఁ గొంపోయెను.

ఆపటముఁ జూచి యందఱాశ్చర్యమగ్నులై రవివర్మ చిత్రకళానైపుణ్యమును వేనోళ్లఁ బొగడిరి. పారితోషిక నిర్ణాయకులేకకంఠముతో గవర్నరుగారి పతకము రవివర్మకే రావలెనని చెప్పిరి. పటమునుజూచిన హాబర్టు గవర్నరుగారుకూడఁ బరమానందభరితులై యనన్యసామాన్యలభ్య మగు దర్శనగౌరవము రవివర్మ కొసఁగిరి.

పతకముతో, బహుప్రజాబహూకృతులతో, రవివర్మ తిరువనంతపురము రాఁగా, మహారాజుగా రవన్నియుఁ దమకు వచ్చినట్లే యానందపరవశు లైరి.

మఱుసటి సంవత్సరము వీణ వాయించుచున్న యొక ద్రవిడ కాంతను గీసి ప్రదర్శించి, రవివర్మ రెండవసారి బంగారుపతకమును బడసెను.

ఎడ్వర్డు ప్రభువుగారు 'ప్రిన్సఫ్ వేల్సు'గా నున్నప్పుడు, 1875 వ సంవత్సరమునఁ జెన్నపట్టనమునకు విచ్చేసిరి. తిరువాన్కూరు మహారాజుగారు వారిని సందర్శించుట కటకు వచ్చి, రవివర్మ చిత్రించిన ద్రవిడకాంత పటమును వారికి బహుమతిచేసిరి. చిత్రవిద్యావిశారదు లగు యూరప్పుదేశస్థుల బోధన సాహాయ్య మేమియులేక యట్టి చిత్తరువు వ్రాయుట మిగుల శ్లాఘనీయ మని వారు రవివర్మను గొనియాడిరి.

1876-వ సంవత్సరమున శకుంతలాచిత్రలేఖనపటమును లిఖయించి, రవివర్మ మదరాసులోఁ బ్రదర్శించెను. పురాణప్రసిద్ధులను జిత్రించుట కిదియే ప్రారంభము. హైందవులకుఁ బురాణములయందు మిక్కిలి యభిమానము గనుక, నాపౌరాణిక ప్రతిమను జూచి వారుప్పొంగిరి. హూబర్టుగారి తరువాత మదరాసు గవర్నరుగా వచ్చిన 'బకింగ్హాము'గారు దాని నత్యాసక్తితోఁ గొనిరి.

తరువాత రెండేండ్లలోపల రవివర్మ గవర్నరుగారిని వారి కుటుంబములో వారిఁ గొందఱను లిఖయించి పటముల వ్రాసెను. అందులో మొదటిది యిప్పటికిఁ జెన్నపట్టనములో

గవర్నరుగారిసదనమం దున్నది. ఇది కల్పనలు లేక, స్వాభావికముగ మూలము ననుసరించి యున్న దని చెప్పుదురు.

1878 మొదలు 1881-వ సంవత్సరమువఱకు రవివర్మకుం దెఱపి లేకుండఁ బని గలిగెను. అతని ఖ్యాతి నల్దెసల వ్యాపించెను. కనుక మాకిది వ్రాసిపెట్టు మని యది వ్రాసిపెట్టుమని యుత్తరము లవిచ్ఛిన్నముగా వచ్చుచుండెను. ఈ కాలములోఁ బౌరాణిక పటము లెన్నో వ్రాయలేదు. కాని వ్రాసిన వానిలో 'సీతాశోధన' మను ప్రతిమ మిక్కిలి రమణీయముగా నున్నది. సీతామహాదేవి దుఃఖగోపనము, శాంతి, గాంభీర్యమును, శ్రీరామమూర్తి విస్మయమును, భూదేవి యనాదరదృష్టియును, జక్కఁగాఁ జిత్రితములై యున్నవి.

సర్. టి. మాధవరావుగా రది చూచి, కొని, బరోడా గైక్వారుగారికి బహుమతి చేసిరి. గైక్వారనునది బరోడా దేశపు మహారాజుల బిరుదు. ఆయన యది చూచి సంతసించి తన పట్టాభిషేకమహోత్సవమునకు రవివర్మ నాహ్వానము చేసెను. ఆ సంస్థానములోఁ గొంతకాలముండి రవివర్మ మహారాజ కుటుంబమువారి ప్రతిమలు లిఖించి, మెప్పు వడసి వారి మన్ననకుఁ బాత్రుఁ డయ్యెను. మహారాజావలంబనము చేత రవివర్మకు ఖ్యాతియు ధనమును మిక్కిలి వృద్ధినొందెను.

మరల నింటికి వచ్చిన కొలఁదికాలములో నతని పితృవ్యుఁడు గురువు నగు రాజరాజవర్మ గతించెను.

మైసూరుమహారాజుగారి "ప్రైవేటు సెక్రటరీ" యొక్క పటము రవివర్మ చిత్రింపఁగా నది చూచి, మహారాజుగా రానందించి, 1885 వ సంవత్సరమున నతని రప్పించి కొన్ని

ప్రతిమలు వ్రాయించిరి. పిమ్మటఁ బుదుక్కోట రాజాగారి యొద్దఁ గూడ నతనికిఁ బ్రవేశము గలిగెను. అచ్చట నుండఁగా బుద్ధిశాలియు, గ్రంథకర్తయుఁ, బాలన క్రియానిపుణుఁడును, మదరాసు గవర్నరునగు "గ్రాండఫు"గారికి రవివర్మ పరిచితుఁడయ్యెను.

భారత రామాయణములందుఁ జెప్పఁబడిన మహాపురుషుల యొక్కయు, నుత్తమ పతివ్రతలయొక్కయుఁ, బటముల వ్రాయుఁడని 1888వ సంవత్సరమున రవివర్మను గైక్వారుగారు కోరిరి. మహోత్సాహముతో నతఁ డట్లు చేసెను. భారత రామాయణములందలివే కాక యితర ప్రసిద్ధ పురాణోక్తములైన కథల దాదాపుగా నన్నిటిని రవివర్మ తననిస్తుల తూలికా చమత్కృతిచేఁ జిత్రించెను. దానివలన నితనికి వచ్చిన రాజ సమ్మానమును బ్రజాశ్లాఘనము నింతంత కాదు.

చివరదశ, రవివర్మ కుచ్చదశ. అసంఖ్యాకు లైన శిష్యులు నానాహిందూదేశభాగములనుండి వచ్చి యతనియొద్దఁ జిత్రకళ నభ్యసించుచుండిరి. వయసుతో గౌరవమును ధనమును నెక్కువయ్యెను. కాని వార్ధకమునఁ బాటవముతప్పి బుద్ధినిశితత్వ మించుకతగ్గిన ట్లీకాలమునందు వ్రాసిన కొన్ని బొమ్మలవలనఁ గనబట్టును.

వెలుతురులో నున్న పదార్థములఁ జిత్రించునట్లు చీఁకటి మాటున నున్నవానిని జెక్కఁగాఁ బ్రదర్శింపలేఁ డను నొక దుష్ప్రతీతి రవివర్మకుఁ గలదు. కాని 1904 వ సంవత్సరములో నతఁడు వ్రాసిన 'రష్యా జపానుయుద్ధ' మను పటములో సాయం సంధ్యయందలి తేజస్తమస్సమ్మేళన మెంతయు మనోహర

ముగా నున్నది. అది చూచినవారికి, రవివర్మ యింకం గొంత కాలము బ్రతికియున్నం, జిత్రవిమర్శకులుచేసిన పై యాక్షేపణ ములం బొల్లుమాటలుగాం జేసియుండు నని తోంచును.

తన చిత్తరువులు గావలసినవా రనేకులుండుటచేం బ్రతుల, వేగముగా సులభముగాం దీయుటకు రవివర్మయొక తైల వర్ణముద్రాయంత్రము స్థాపించెను. అది సరిగాం గుదురక పోవుటచేతను, రంగులు యుక్తముగాం బడక పులిమినట్లుండుట చేతను. అమ్మకమునకుం దీసిన ప్రతులు బాగుగా లేవు. ఈము ద్రణయంత్రమువలన ధనాభివృద్ధి యమితముగాం గలిగెనుగాని చిత్రప్రాశస్త్యము తగ్గినది. కొన్ని నిజేముగా నివి రవివర్మ గీసినవగునా కావా యను సందేహము గలిగించునంత వికృ తముగా నున్నవి. మూలప్రతిమలకు వాని ప్రతులకు నెంతయో తారతమ్యము గలదు.

కర్జను ప్రభువుగారు 1900 వ సంవత్సరమునం దిరువా న్కూరునకు వచ్చినప్పుడు రవివర్మచిత్తరువులు గొన్ని చూచి యత్యాశ్చర్య మందిరి.

అదివఱకే యారోగ్యము చెడిన రవివర్మ 1905 వ సంవ త్సరమున మిక్కిలి రోగపీడితుండై 1906 వ సంవత్సరము చివర, నేంబదియెనిమిదియేండ్ల వయస్సున, స్వర్గస్థుం డయ్యెను.

చిత్రశాస్త్ర పండితుల పరీక్ష కక్కడక్కడం గొన్నిలోప ములు చూపట్టినను, రవివర్మపటములు ప్రజారంజకము లన్న మాట నిస్సందేహము.

దమయంతి, సీత, రాధ, మోహిని, మేనక, మొదలగు స్త్రీలను, మేనక చేతులలోం బెట్టుకొన్న శకుంతల, సత్యవాక్య

పాలనముకై తన్నుఁ జంపు మని జంకు లేక పూర్ణ ధైర్య తేజముతో నిలువఁబడియున్న రుక్మాంగదనందనుఁడు, యశోదకు నోరు తెఱచి విశ్వరూపదర్శన మిచ్చిన కొంటెబాలకృష్ణుఁడు, మున్నగు శిశువులను, రవివర్మ రమ్యముగాఁ జిత్రించెను.

రవివర్మ వ్రాసినపటములలో నెల్ల 'దమయంతి-హంస' 'మోహినీరుక్మాంగదులు' "విరాట సభలోని ద్రౌపది" "కీచక మందిరమునకుఁ బంపఁబడి పోవుచున్న పాంచాలి" ఈనాలుగు నతి సుందరములని చెప్పుదురు. అయినను ద్రష్టల రుచులఁ బట్టికూడఁ జిత్రశాస్త్ర మగపడు నన్నమాట యసత్యము కాదు.

---

## 10. నాటకములు.

నాటకములును, "సినిమా" లని చెప్పఁబడు చలప్రతిమా ప్రదర్శనములును, మన దేశములో నిప్పుడు మహావ్యాప్తినొంది యున్నవి. వినోదకరములుగా నుండునని ప్రజలనేకులు వానిని జూచుచున్నారు, చూచి యానందించు చున్నారు. పగలంతయుఁ బాటుపడి పనిచేసి బడలినవారికవి చిత్త విశ్రాంతి కరములును శాంతి కరములునై, మఱునాఁడు తాముచేసికొనవలయు సంసార కృత్యములకుఁ దమ్మెక్కువ సమర్థులఁగాఁ జేయు బుద్ధిబలనీతిబలోత్సాహబలములనొసఁగి వారికిఁ దోడ్పడు చున్నవా? చిత్తవిక్షేప కారకములై, దుష్ప్రవృత్తిజనకములై, మనశ్శరీర దౌర్బల్యాపాదకములై, వారి కపకారకము లగు చున్నవా? యని మనమాలోచించి చూచుకొన వలెను.

"సినిమా" లు పూర్వము మనకు లేవుగాని, నాటకములు మన దేశములోఁ జిరకాలమునుండి యున్నవి. వాని ప్రయోజనము లీపాఠములోఁ గొంచెము చెప్పెదము.

ధనము, పాఁడి, పంట, కీర్తి—మనుష్యున కివి యన్నియు సుఖదాయకములగు చున్నవి; కాని విద్య వీనికంటెను హెచ్చైనది. ఎందుచేత? అవన్నియు విద్యవలన సంపాదించు కొనవచ్చును గనుక. వ్యయించిన కొలఁది ధనముతగ్గి పోవును, విద్యపరుల కిచ్చినకొలఁదిఁ బెరుఁగును. విత్తమునకుఁ జోర భయమున్నది, విద్యకు లేదు. కావున నన్ని దానములకంటెను జ్ఞానదానము మహత్తమమైనదని చెప్పవచ్చును. అది యైహికాముష్మిక ఫలదాయి.

ప్రభువువలె శ్రుతిస్మృతు లే ధర్మముల శాసించి తెల్పునో, మిత్రునివలెఁ బురాణము లే నీతులఁ గఱపునో, యాధర్మములనే యానీతులనే కాంతాసమ్మితములై సత్కావ్యములు సరసముగాఁ బ్రజల కుపదేశించి, వారిని జ్ఞానవంతులను నీతిమంతులను జేయును. పరమ సుందరములైన యుపమాద్యలంకారములతో, హృదయంగమములైన యుదార భావములతోఁ, జిత్రవిచిత్రములైన కల్పనలతోఁ, జిత్తరంజకములైన నర్మోక్తులతో, లలితములైన మాటల కూర్పులతో, గద్యరూపముననో పద్యరూపముననో యుభయ రూపముననో, రచింపఁబడి మంచి కావ్యములు జ్ఞానప్రదములై సత్ప్రవర్తనమును లోకులకు బోధించి వారికి మహోపకారకము లగుచున్నవి. సత్కావ్యపఠనము వలన హృదయము మృదులమును నిర్మలమును నగును, మనసునుండి దుష్ప్రవృత్తులు తొలఁగిపోవును,

గష్టకాలమందు శీఘ్రనైరాశ్య రూపమైన చిత్తదౌర్బల్యము పోయి, ధీరత్వక్షమాశాంతిరూపమైన యంతస్సత్వము జనించును, దుర్భరముగాఁ దోఁచు నిహలోక జీవనము నుసహాముగను సుఖదాయకముగను జూపట్టును.

సామాన్యముగా హితోపదేశము ప్రియముగా నుండదు. వైద్యుఁడు మధుశర్కరాది మధురానుపానములతోఁ జేఁదు మందులిచ్చి శరీరామయముల నెట్లు శమింపఁ జేయునో కవి, ప్రియములగు శృంగార రసాదులలోఁ బొదిగి హితోపదేశములుగావించి యిహపరసుఖప్రతిబంధకములగు మనోరోగముల మాన్పును.

నాటకములు కావ్యములలోనివే. చదివివినుట కనువగు కావ్యములను శ్రవ్యకావ్యము లందరు; చూచుటకుఁ గూడ ననుకూలించు కావ్యములను దృశ్యకావ్యము లందురు. అవియే రూపకములు, వానినే సామాన్యముగా నాటకము లనుచున్నాము. మంచి నాటకములోఁ గథాకల్పన చక్కఁగా నుండవలెను. పాత్రపరస్పరసంభాషణము స్వాభావికముగా సరసముగా నుండ వలయును. ప్రశ్నోత్తరములకు హృద్యమైన పరస్పర సంబంధముండ వలయును.—అనఁగా వేసినప్రశ్నకుచితమైన యుత్తరము రావలెను, ఆయుత్తరము ముందు ప్రశ్నమును స్ఫురింపఁ జేయు చుండవలెను; అట్లుండియు నవి కథా ప్రవాహమునకుఁ గడుదూరముగా నుండి యప్రస్తుత ప్రలాపమని పించుకొనఁగూడదు. సంభాషణము స్త్రీపురుషుల యవస్థల కర్హముగా నుండవలెను. ఏకపాత్రము నోటఁదగిన కారణము లేకుండ, భిన్న స్వభావమును వెలువఱుచు

మాటలు రాఁగూడదు. కేవల పామరజన రంజకములగు మోటు పరిహాసములుగాక చిత్తోల్లాసకరములగు నర్మోక్తులు మితముగా నచ్చటచ్చట నుపయోగింపఁబడవలెను. భావముల మనోహరముగా వ్యక్తీకరించుట కుపయోగించు నుపమానములు సహజముగా సరళముగా నుండవలెనుగాని బలవంతముగా లాగి తీసికొనివచ్చి నట్లుండఁ గూడదు. ఇట్టి సల్లక్షణములు గలిగియుండి నాటకము ప్రధానముగా నేవ్రోకొన్ని సద్ధర్మము లను ద్రష్టలకుఁ గఱపివారి పురోభివృద్ధికిఁ దోడ్పడ వలెను.

ఆది కాలమునఁ బెక్కు దేశములలో నాటకములు మత సంబంధములై బయలుదేఱినవి. కాని రానురానవి వినోద మాత్ర ప్రయోజనములై పోయినవి.

శ్రవణద్వారమున గ్రహించిన విషయముల కంటె నాటక ప్రదర్శన ద్వారమున నేర్చిన విషయములు మనములో లోఁతు గానాటుకొని తత్తత్ఫలముల నిచ్చును. అందుచేతఁ గవులు నాటకములు కడు జాగరూకతతో రచించినఁ గాని దేశానర్థ కారులగుదురు. భగవద్భక్తి, దేశభక్తి, శాంతి, దాంతి, స్వార్థ త్యాగము, పరోపకారబుద్ధి, దయాసత్యశౌచములు, ధైర్య స్థైర్యములు—ఇట్టివి తమ కవితానైపుణితోఁ గఱపుచుఁ గవులు నాటకములు వ్రాయుట మంచిది. ఆధర్మముల కాటపట్టులైన పూర్వకాల పురుషులను బాలఁతులనుగాని, యట్టి కల్పితస్త్రీ పురుషులఁగాని వారు తమ నాటకములకు నాయికానాయకు లఁగాఁ జేయుచుండ వలెను.

నీతిప్రధానమైనప్పటికిని, జప్పగా రసహీనముగా రచింపఁ బడిన నాటకము రుచింపక పోవుటచేఁ, బ్రజలు దానినాడరు,

చూడరు, చదువరు; దానివలన వారికిఁ బ్రయోజనలాభ ముండదు గాని, నష్టమేమియుఁ గలుగదు. ఇఁక నీతిబాహ్యమైనను రస పుష్టమైయున్న నాటక మతి కుతూహలముతో నెందఱోయాడి చూచి చదువుకొందురు ; కాని పాపము ! తీయనివిషపానకము ద్రాగిన వెఱ్ఱులవలె వారెన్నో యిక్కట్టుల పాలై యిచటికి నచటికిఁ గూడఁ జెడిపోదురు.

కావునఁ గవితాప్రవీణులైన మహనీయులు కాలమును గని పట్టి, ప్రబలుచున్న యధర్మములనణఁగఁ ద్రొక్కుటకును, గ్రుంగిపోవుచున్నధర్మముల లేవనెత్తుటకును,దమ యావచ్ఛక్తి యునుపయోగించి నాటకరాజములు వ్రాసి దేశోద్ధారకులై లోకారాధ్యు లగుదురు; పామరజనరంజనమే పరమార్థముగాఁ జూచుకొని వారి యభిరుచుల ననుసరించి క్షుద్రనాటకము లెన్నఁడును వ్రాయరు.

---

## 11. పరశురామ పరాభవము.

ప్రదేశము.—మిథిలనుండి యయోధ్యకు దారి

ప్రవేశము.—దశరథుఁడు, వసిష్ఠుఁడు, రాముఁడు, లక్ష్మణుఁడు.

దశ.—ఇప్పు డంత తొందర యేమి వచ్చినది ?

వసి.—వచ్చినది కాదు. రానున్నది, అతిశీఘ్రముగ రానున్నది, సీతాదిస్త్రీజనమును బరిసరపర్వత గుహాంతరమునఁ గొంత సేపుంచి భరతశత్రుఘ్నుల నటఁ గాపుంపుఁడు.

దశ.—ఏల ? మహాత్మా! అట్లు సెల విచ్చెదరు ?

వసి.—కాంతానుజులు కదనరంగ ఘోరదర్శనమునకుఁ దగరు. రాజేంద్రా ! భరతాదులు నీకోడండ్రతో నిటు వచ్చుచున్నారు. వారి నటు పోమ్మని ముందుగా నాజ్ఞాపింపుము.

దశ.—సౌమిత్రీ ! నీవు పోయి స్త్రీజనముతో మెల్లగవచ్చుచున్న భరతశత్రుఘ్నులకు మహర్షి యాజ్ఞ తెలియఁజెప్పి యిటు వేగరా !

లక్ష్మ,—చిత్తము (నిష్క్రమించును.)

దశ,—మహాత్మా! కదనరంగ మనెద రేల? ఘోరదర్శన మనెద రేల? తాటక నామమాత్రావశిష్టగాఁ జేయఁబడినది కాదా? మారీచుఁ డంతరిక్షమున కెగురఁగొట్టఁ బడెను గాదా? సుబాహుఁడు వీరస్వర్గ మనుభవించుచున్నాఁడు కాదా? ఇఁకను గదనరంగప్రసక్తి యేమున్నది ?

గీ. దుష్టవధ మయ్యెఁ గష్టముల్ • దొలఁగిపోయెఁ,
గొడుకు లాకసారిగాఁ బెండ్లి•కొడుకులైరి,
క్రొత్తబట్టలుఁ బసుపును • గుంకుమయును,
బెండ్లికంకణములు నొడి• బియ్యములును,

గీ. కలిగి తోలుకారు మెఱపుఁదీఁ•గలను మించి
సకలమంగళ సద్గుణ•సహిత లైన
నలిన నేత్రలు కోడండ్రు • నలువు రెలమి
సారెలను గొని చేటికా•సమితితోడఁ,

గీ. గనులపండువుగా గల్లు•గల్లుమనుచుఁ
బచ్చుపచ్చుగ నానంద•భరము మీఱఁ
గూడరాఁగ నయోధ్యకేఁ • గొంచు నేగ,
ఘోరదర్శన మేమయ్యా? • గురువరేణ్యా?

వసి.—రాజేంద్రా ఇప్పుడే తెలియనున్నది. రామా ! ధను
ర్ధరుఁడవై భద్రముగా నున్నావు కాదా ?

రాము.—చిత్తము.

(నేపథ్యమందు) ఏఁడి ! రాముఁ డేఁడీ! అతనికొఱకే వచ్చి
యుంటిని.

వశి.—(అదరిపడి) గురునర్యా ! అతఁ డెవఁడు ?

(నేపథ్యమున)

గీ. క్షత్రవంశాటవీవీతి హోత్రదేవుఁ,
దురుతపశ్శాలి, శమదమప్రోజ్జ్వలుండు,
భార్గవుఁడు, జామదగ్న్యుండు పరశుధరుఁడు,
రాముఁ డిదె వచ్చుచున్నాఁడు రాముకడకు.

ఏఁడీ ! ఆరాముఁ డేఁడిఁ! నాయెదుట మఱియొక రాముఁడా?
(తిరిగి నేపథ్యమున) ఏఁడి ! ఏఁడీ !
తిన్నగ మాటలాడుటయైనఁ జేతఁ గాదా? రాముఁడెందు
లకు ? నీపనికి రామానుజుండనైననేను జాలనా ? ఇదిగో
వచ్చుచున్నాను.

రాము.—సౌమిత్రీ ! నీ వాఁగుము ! మహాతపశ్శాలి యెడల
సగౌరవముగాఁ బలుకవలయును. నీ వాయనను సమీపింప
నే వలదు. ఇటు రమ్ము.

లక్ష్మ.—(ప్రవేశించి) మీయెడల సగౌరవముగ మాటలాడు
చున్న యీపరశురాముని శిక్షింపననుజ్ఞ నేల యీయరు ?

(పరుశురాముఁడు ప్రవేశించును)

దశ.—గురువర్యా! అనునయవాక్యములచే నీ క్షత్రియవంశ నాశకుని శాంతిపఱచినఁగాని మనకు బ్రదుకులు దక్కవు. కావున మీరు ముందుగా నాతని సమీపించి—

వసి.—జామదగ్న్య! పితృవధామర్షాగ్ని ని క్షత్రియరక్తవర్షమున శాంతిపఱచి విగతతాపుఁడవై సంతుష్టచిత్తుఁడవై మహేంద్రాద్రియందుఁ దప మొనర్చుచున్నావని వింటిని, తపము నిర్విఘ్నముగా వర్ధిల్లుచున్నదా?

పరశు.—ఇదిగో! ఇంత సౌభాగ్యముగావర్ధిల్లుచున్నది. నేను శాంతిపొందెద నన్నను,లోకము నన్నుఁ బొందనీయకున్న దే! సర్వప్రతాప కథానాటకమునకు భరతవాక్యము చెప్పి, ప్రశాంత మగుచోట, నొకనికంట నేను, నొకఁడు నాకంటఁ బడకుండఁ బ్రచ్ఛన్నముగ, మునివృత్తిఁ గాలక్షేపము చేయుచుండఁగాఁ, దిరుగ నన్ను వీరలోకమునఁ బడవైచినవాఁ డెవఁడు? అనేకకోటిక్షత్రియకంఠనాశ విఖండన ప్రచండకోటియగు నీపరశువును దిరుగ నాచేఁ బట్టించినవాఁడెవఁడు? కతిపయవిస్ఫులింగావశిష్టముగా నాఱిపోయిన నాకోపాగ్నిని దిరుగ నింధనములు వైచి బుద్ధిపూర్వకముగా నుష్ణాన నూఁదినవాఁ డెవఁడు? ఇదిగో! ఈరాముఁడు! ఈక్షత్రియ డింభకుఁడు;

లక్ష్మ.—(అప) అన్నగారూ! ఏమి సెలవు? వేయనా? దౌడ విఱుగునట్లు వేయనా?

రామ.—(అప) తొందరపడవలదు. పెద్దలే, తగురీతిని దిద్దుపాటొనర్చెదరు.

దశ.—మహాత్మా! జామదగ్న్యా! నమస్కారము. ఈకుఱ్ఱవాఁడు - ఈపసిబాలుఁడు - ఈశాంతస్వభావుఁడు - మీయెడల నేమి యపరాధ మొనర్చినాఁడు? దయయుంచి రక్షింపుఁడు.

పరశు.—నిన్ను వెనుక రక్షింపఁదలచి, యుపేక్షించినందులకే-మాకు శాంతిభంగ మీయఁజాలినట్టియు మమ్ముఁ బరాభవింప సందేహింపనట్టియు కొడుకును గని, మిడిసి మిడిసి పడుచున్నావు. వాడుక లేమిచేఁ బరశువునకు వాఁడి తగ్గిన దనుకొనుచున్నావు కాఁబోలు! వార్ధకముచే బాహువునకుఁ బటుత్వము తగ్గినదనుకొనుచున్నావు కాఁబోలు!

లక్ష్మ.—అయ్యా! విశ్వామిత్రశిష్యు లగుదాశరథులను బెదరింప రాకుఁడు. పరశువును—

దశ.—(అప) నాయనా! నీకెందులకోయి! నీ వూరకుండుము. (ప్రకాశముగా) మహాత్మా! జామదగ్న్యా! గురుభక్తియుక్తుఁడు - దోషరహితుఁడు - అమృతమయాంతఃకరణుఁడగు నీచిన్నబాలుఁడు మీశాంతి కెట్లుభంగ మొనర్చినాఁడు? మిమ్మెట్లు పరాభవింపనున్నాఁడు?

పరశు.—పరాభవింపనున్నాఁడు కాదు-పరాభవించినాఁడు.

దశ.—ఏదియో వంకపెట్టుకొని మమ్ము హింసింప వచ్చినారు-ఇది న్యాయ్యము కాదు. నేను వినయపూర్వకముగఁ బ్రార్థించుచున్నాను. చిరకాలమునకుఁ బుత్రవంతుఁడ నైతిని. రక్షింపుఁడు.

పర.—వంకపెట్టుకొని వచ్చితినా? పరశురాముఁ డసత్యవర్తనుఁడా?

వసి.—జామదగ్న్యా! అది యంతయు నెందులకు? సత్యా సత్యావర్తననిర్ణయ మిప్పుడేల? ఇంద్రసన్నిధానమున శస్త్రసన్న్యాసమొనర్చి తిరిగి పరశుధారణ మొనర్చితివి కాదా? ఏదో కాలానుగుణముగఁ బోవుట యాచారమైయున్నది-సత్యపరీక్ష మన మిప్పుడు చేయఁదగినదికాదు. మి మ్మెట్లు శ్రీరాముఁడు పరాభవించెనో యాసంగతి చెప్పి యేదైన దోషమున్నయెడల క్షమింపఁ దగును. తపస్సంపన్నులకు దోషక్షమకంటె భూషణము వేఱొకటి యున్నదా?

పరశు.—నన్నుఁ బరాభవించిన నే నుపేక్షించియే యుందును. నాయిష్టదైవతమగు మహాదేవుని బరాభవింపలేదా?

దశ.—విల్లువిఱచియేనా?

పరశు.—కాదా? త్రిపురసంహారి యగునిటలాక్షునిపై నిస్సత్వ్యభావమా? కరుణాళుఁడగు నామహాదేవుఁ డీనేరము నుపేక్షించినను, భక్తవత్సలుఁడను, బరతేజోఽసహిష్ణువను, బరశురాముఁడను నైననే నుపేక్షించుట తగునా?

లక్ష్మ.—తగకపోయిన,నిప్పుడు చేయవలసిన దేదో చేయరాదా!

దశ.—(అప) నాయనా! మండుచున్న యగ్నిపై నేయి పోసెదవేమి? నీకాలోకోత్తరుని మహాతేజః ప్రభావము తెలియదు. నీ వూరకుండుము. (ప్రకాశముగాఁ బరశురామునితో) అయ్యా! అతఁడు చిన్నవాఁడు. క్షంతవ్యుఁడు. శివధనువును సజ్యముచేయుట జనకచక్రవర్తి పణముగా నిడినకారణమున, శ్రీరాముఁ డందులకు సాహసించెను. లేకున్నాతని కావింటితో నేమిపని యున్నది?

పర.—అట్లు పణముగా నిడుట జనకుని తప్పు కాదని నే నంటినా? అతఁడుకూడ మమ్మును మహాదేవునిఁబరాభవిం చినవాఁడే. అందుల కాతనిమాట తరువాతఁజూతము. అతఁడు దానిఁబణముగాఁ దెలిసియో, తెలియకయో, యుం చెను. రాముఁడు ధనుష్ఖండనమునకుఁ బరుగుపరుగున సిద్ధపడనేల ? తానే మహావీరుఁడా ?

వసి.—జామదగ్న్య ! ఇప్పటికి రాముఁడే కాక జనక మహా రాజుగూడ శిక్షార్హుఁడని తేలినది. బాగుగానున్నది. జానకీ కల్యాణముకొఱకు జనకుఁ డట్లు చేయవలసివచ్చెను. కనుక జానకియు శిక్షార్హురాలు. రాముఁడు బుద్ధిపూర్వకముగా మిథిలకుఁ బోలేదు. విశ్వామిత్రునిచే నీ కార్యమునకై తీసికొనిపోఁబడినాఁడు. కావున విశ్వామిత్రుఁడుగూడ శిక్షా ర్హుఁడు. విశ్వామిత్రునితో రామలక్ష్మణులను బంపుటకీ రాజేంద్రుఁ డంగీకరింపలేదు. అప్పుడు నేను జెప్పి పంపించు టచే నింతపరాభవము నీకు జరిగినది కావున, నేనును శిక్షార్హుఁడను. ధనువును నిర్మించినవిశ్వకర్మ యందఱికంటె మొదట శిక్షార్హుఁడు. కావున మమ్మందఱ నెట్లు శిక్షింపఁ దలఁచితివో యట్లు శిక్షించి నీవొక్కఁడవే సురక్షితుఁడవై యుండుము.

పర.—వసిష్ఠా! నాస్వభావ మెఱిఁగియుండియు నీవట్లు మాట లాడుదువా ? నేను సురక్షితుఁడనై యుండువాఁడనా ? అనేకపర్యాయములు క్షత్రియవంశజులను మారణమొ నరించి వారేలు నీభూవలయమును నేను గైవసము చేసి కొని, యాగముచేసి యాగానంతరమున నొక్కయడుగు

భూమిపై నను నాకొఱకు మిగుల్చుకొనక, యంతభూమిని గాశ్యపుఁ డనుమహాత్మునకు దాన మొసఁగలేదా ? ఇది సుర క్షితుఁ డొనర్చు పనియేనా ? ఆమహాత్ముఁడు నాదైన యీ భూమియందు నీవు నిలువరాదు పొమ్మని నిర్దాక్షిణ్యముగఁ బలుక, భూమిపై గాలిడుటకైన నధికారము లేక పక్షివలె నడిగాలినే యల్లలాడుచుండవలసి వచ్చెనుగదా ? ఇది సుర క్షితుని గతియేనా ? నేను నాకొఱకే ప్రాఁకులాడువాఁడ నైనయెడల, ని ట్లాచరించియుందునా? ధనుర్భంగమువలన మహాదేవాపరాధము జేరిగినదిగదా యని నేనుబరితపించు చుంటిని. భగవదపరాధ మాచరించిన యాతఁడు——

దశ.——మీదయచే క్షమింపఁబడఁ దగినవాఁడు. మహాత్మా ! నాకుఁ బుత్రభిక్ష పెట్టుము.

రాము.——(అప) తండ్రిగారూ ! స స్త్రీ బ్రాహ్మణోత్తముఁ డేమి యుఁ జేయఁజాలఁడు. మీరు పుత్రవాత్సల్యమున సందే హింపవలదు. మీ రొక్కగడియసేపుమాత్ర మాతనినసున యింపక యూరకుండుఁడు. నేను దగిన ట్లాచరించి యమ్మహా త్మ్ముని శాంతిపఱచి పంపెదను.

దశ.—— (అప) నాయనా ! నాతండ్రీ ! నీ వంతపనికిఁ జాలుదువా ?

రాము.——(అప) ఏమియు సందేహింపకుఁడు. మీ సెలవులేకుం టచే, నే నీభార్గవునితో నింతవఱకు మాటలాడలేదు.

దశ.——(అప) నాయనా ! నీకులదేవతలు నిన్నురక్షింతురుగాక! భగవానుఁ డగువసిష్ఠమహర్షి మంగళాశాసనము నిన్ను

సదా యనుసరించుఁగాక ! నీతల్లి కడుపుచేలువ, నిన్నుఁ జిరంజీవిఁ జేయుఁగాక !

రాము.—(అప) తండ్రిగారూ ! అనుగ్రహింపఁబడితిని.

దశ.—(అప) నాయనా ! గురువులవారితో మనవిచేయలేదు. మహాత్మా ! శ్రీరాముఁడు పరశురామునితో సంభాషించి యాతని శాంతిపఱచెద నని నాతోఁ జెప్పుచున్నాఁడు. అంగీకరింప వచ్చునా ?

వసి.—(అప) ఆతనిశాంతి శ్రీరామునిచేతిలో నున్నది కాని యందులకు మనము తగుదుమా ? అవశ్య మంగీకరింపుము.

దశ.—(అప) నాయనా ! గురువులవా రనుజ్ఞ యిచ్చిరి.

రాము.—మహాప్రసాదము ! బ్రాహ్మణశిఖామణీ ! ఇంత సేపటి నుండియు నన్నుఁగూర్చియే, మీరు ప్రసంగించుచున్నను, గురుజనాజ్ఞ కాకుండుటచే మీతో సంభాషింపక యూర కుంటిని. క్షమింపవలయును. ఇదిగో ! నమస్కరించు చున్నాను.

పర.—భగవానునకుఁ బరాభవమును, భక్తునకుఁ బ్రణామ మునా? ఈనూతనాచార మెక్కడ నేర్చుకొంటివి?

రాము.—త్రిపురాంతకుఁ బరిభవించు నుద్దేశ మేమియు లేదు. ఆ మహాత్ముని ధనువును సజ్యముచేయఁ బ్రయత్నించితిని.

పర.—సజ్యమే కాదు భగ్నముకూడఁ జేసితివి. నేను నీభుజసీర్య మునకు మిగుల మెచ్చితిని-కాని,

లక్ష్మ.—మీమెప్పుతో మా కేమియుఁ బనిలేదు.

పర.—అట్లనెదవేల? నామెప్పే మెప్పు.

గీ. సుస్థిరాహానసూరుని • సూరవరుఁడు
తెలిసి ముదమంది స్తుతియింప • వలయుఁజుమ్మ ;
కవివరేణ్యునికవితాప్ర • కాశకలన
కనియె గ్రహియించి స్తుతియించెఁ • గాదె మిగుల.

శివధనుర్భంగమున రాముని బాహుపరాక్రమము సంపూర్తిగ వెల్లడియైనది. అంతవఱకొప్పుకొనక తప్పునా? కాని! దానితో దైవాపరాధముకూడ—

రామ.—మహాత్మా! జామదగ్న్య! మీమాటకు వ్యతిరేకముగఁ జెప్పితినని మీరనుకొనవలదు. ధనుర్భంగకార్యమున నాభుజబలసంపత్తి యేమియు వెల్లడి కాలేదు. భుజబలముపయోగించువఱకేది? పట్టుకొని రవంత వంచుటకుఁ బ్రయత్నించు నప్పటికే యది వెళ్లున విఱిగిపోవ నే నేమిచే యఁగలను? మహాత్మా! అందువలన మహాదేవాపరాధము నాపై మీరు కట్టఁదగదు.

పర.—హా! హా! హా! ఏమి! ఎంతవాఁడవు! పట్టుకొనుటతోడనే భర్గచాపము భగ్నమైపోయినదా? బళీ! ఏమి పౌరుష విజృంభణము! శివునిధనువు నీ చేతిలోఁ జీపురుపుల్లయై పోయెనా? ఏమీ వీరాలాపములు! క్షత్రవీరశిరోహారముతో స్వర్గమునకు మెట్లుకట్టిన పరశురాముని యెదుటనే ప్రతాపప్రగల్భతాప్రాచుర్యమా? ఇరువదియొక్క. దండయాత్రలొనర్చి క్షత్రియలోక మారణము మే మొనర్చిన కథ నీవు వినియుంటివి కాదా?

రామ.—అప్పుడు శ్రీరాముఁడు జనింపక పోవుటచే మీకంతశ్రమము కలిగినది.

పర.—[అట్టహాస మొనర్చి] ఆ ! ఆ ! ఇప్పుడు వీరాధివీరుఁడవు పుట్టితివి కాదా? జగదేక మహావీరశిఖామణి వుద్భవించితివి కాదా? [చేతు లెత్తి] ఇంతవాఁడ వైతివికదా! శస్త్రాస్త్ర కోవిదుఁడ వైతివికదా! శంకరధనుఃఖండనుఁడ వైతివికదా! ఇదిగో వైష్ణవధనువు. దీనిని సజ్య మొనర్చి నాతో ద్వంద్వయుద్ధమునకు రమ్ము. ఇందుకొఱకే వచ్చితిని. ఇందుకొఱకే తపస్సు చాలించితిని. ఇందుకొఱకే తిరుగఁబరశువుఁ బట్టితిని.

దశ.—[అప—వసిష్ఠునితో] గురువర్యా! పరశురాముఁడు భీకరాకారుఁడై యున్నాఁడు. ఏమి చేయునో?

వసి.—[అప—దశరథునితో] చేయిచేసికొనఁగలవాఁ డంత నోరుచేసికొనునా? భయము లేదు.

పర.—దశరథరామా! మాటలాడక యూరకుంటివేల?

రాము.—వైష్ణవధనువును సజ్యము చేయు మని యాజ్ఞాపించితిరి. ఇదివఱకే యొక్కదైవాపరాధము నాపై వైచినారు కదా! నేనందుల కెట్లు సాహసింతును?

పర.—హా! హా! హా! శివధనువును విఱిచినట్లే దీనినిగూడ విఱువఁగల ననుకొనుచున్నావు కాఁబోలు! పూర్వము శివకేశవుల యుద్ధమందు విష్ణుదేవుఁడొనర్చిన హుంకారముచే శివధనువు కొంత సారహీన మయ్యెను. విష్ణుధనువును విఱుచుమాట యటుండనిమ్ము, నీవు దానిని వంపనైన లేవు. ఇది నిశ్చయము. ఇదిగో ధనువు.

రాము.—మీ మాట యసత్యము చేయవలసివచ్చును గదా యని విచారించుచున్నాను. ధను వక్కఱ లేదు. దానిని

వంచుట యొకవిశేషముకాదు. వంచినట్లే యెంచవచ్చును. వంచిన పిమ్మట మీతో ద్వంద్వయుద్ధ మని మఱియొక మాట సెలవిచ్చితిరే! అయ్యయ్యో! వృద్ధులు, బ్రాహ్మణులు, తపస్సంపన్నులు, పూజ్యులు నగు మీతో ద్వంద్వయుద్ధ మొనర్చుటకు నాకుఁ జేతులు వచ్చునా? తాటకయని చంపనా? సుబాహుఁడని మడియింపనా? మారీచుఁడని యెగురఁగొట్టనా? అయ్యయో! ఎంతమాట!

పర.—[కోపముతో] ఆ! ఆ! ఏమంటివి?

లక్ష్మ.—ఆయన యేమనెనో నేను స్పష్టముగాఁ జెప్పెదను. వినుఁడు. మీభుజమునకు జేన్నిద మర్హముకాని చాపము కాదు. మీచేతికి గోముఖమర్హముకాని శిలీముఖము కాదు. మీ చోరవకు వంటశాల లర్హములుగాని యాహవరంగములు కావు.

రాము.—లక్ష్మణా! పూజ్యుల నధిక్షేపింపకుము. మహానుభావా! శిరము వంచి రెండుచేతులు జోడించి భక్తితో నమస్కరింపవలసిన మిమ్ము నింతవఱ కమోఘ మనిపించుకొనిన నాబాణమునకు గుఱిచేయఁగలనా? నాయస్త్రవిద్యాగ్రహణ మిందుకొఱకేనా? కావున నన్ను క్షమింపుఁడు.

పర.—నేను బ్రాహ్మణుఁడ నని, యందుచేఁ గాతరుఁడ నని సందేహించుచుంటివా? అట్లెంచుట కేవలము తప్పు. ఇదిగో గొడ్డలి! ఇదిగో గోముఖము! ఇదిగో యజ్ఞసూత్రము! ఇదిగో ధనుస్సూత్రము! ఇదే బ్రాహ్మము! ఇదే క్షాత్రము! నీకొక్క చాపబలమేకాని మాకు శాప చాప బలములు రెండున్నవి. తెలిసినదా? జాగ్రత్త.

రాము.—మీచాప బలమునకు జేడియువాఁడను గాను. మిమ్ము గురుతుల్యులుగ భావించి సేవించునాకుఁ బూజ్యులగు మీరేల శాప మిచ్చెదరు? కావున మీశాపమును గుఱించియు జేడియువాఁడను గాను. భవదాశీర్వాద పాత్రుఁడ నగునన్ను క్షమించి ద్వంద్వయుద్ధ ప్రశంసను విడిచి మాదారిని మమ్ముఁ బోనిండు.

పర.—నే నందుల కంగీకరింపను. నీతో నా కిప్పుడు యుద్ధము తప్పదు. తప్పదు. తప్పదు.



రాము.—మహాత్మా! విశ్వామిత్రుఁడు నాకస్త్రగురుఁడు. మీరు విశ్వామిత్రుని యక్కమనుమ లని యామహర్షి నాతోఁ బ్రస్తావవశమున నొకప్పుడు సెలవిచ్చియుండెను. ఆయన కటాక్షించిన యస్త్రములతోడనే యాయన మనుమనిఁ

గొట్టుట గురుభక్తి విధానమున కనుగుణముగ నుండునా? నాతలపై గుర్వవిధేయత యేల పెట్టెదరు? నాకు బ్రహ్మహత్యాపాతక మేల కట్టెదరు? క్షమింపుఁడు.

పర.—నేనొనర్చిన సర్వక్షత్రాంతక యజ్ఞమునందలి హోమకుండమున, విశ్వామిత్రుఁడు నాకు బంధుఁడనియే యాహుతిగఁ జేయక మిగిల్చితిని. అంతేకాని యాతని యస్త్రములకు జడిసికాదు.

లక్ష్మ.—తల్లిని జంపినవానికిఁ దాతగారి యెడల నీ దాక్షిణ్యమేల?

పర.—రామానుజా! జాగ్రత్త! రామా! నాకు వీరావేశమెత్తుచున్నది! ఈవైష్ణవ ధనువును సజ్య మొనర్చి నాతో ద్వంద్వయుద్ధ మొనర్చెదవా లేదా? అట్లు చేయని యెడల మిమ్మిద్దఱను శాపముచే భస్మముచేసి మఱి పోవుదును.

రాము.—మహాత్మా! ఎంత చెప్పినను వినకుంటిరికదా! విధియిట్లు ప్రేరణము చేయుచుండ మీ రేమి చేయఁగలరు? కానిండు ఏదీ! మీ వైష్ణవధనువు?

పర.—సెబాసు! రామభద్రా! ఇదిగో!

రాము;—[ధనువు తీసికొని కన్నుల కద్దుకొనును]

దశ;—[అప] రామచంద్రా! దానిని విఱుతువేమో జాగ్రత్త సుమా! ఆ మహానుభావునకు మఱింత కోపము వచ్చును.

రాము.—[అప] మఱేమియు భయములేదు.

వసి.—[అప] దశరథా! ధనువును రామచంద్రుఁడు పరశురాముని హస్తమునుండి తీసికొనునప్పుడాతని తేజమును గూడ నాకర్షించుకొనినాఁడుసుమా!

దశ.—[అప] అది మీ కెట్లు తెలిసెను ?

వసి.—[అప] ఒక తేజము రాములిలో గుప్పునఁ బ్రవేశించినట్లు నా కగపడెను. అది గాక పరశురాముఁ డెంత నిస్సారుఁడై, తేజశ్శూన్యుఁడై, దీనుఁడై యున్నాఁడో! చూడు!

దశ.—[అప] ఔను [ప్రకాశముగా] ఆహా! రాముఁడు ధనువును వంచినాఁడు.

వసి.—సెబాసు! రామభద్రా!

రాము.—మహాత్మా! జామదగ్న్య! విల్లు వంచితిని. నాబాణ మమోఘము. కావున దానితో నీపాదములు గొట్టెదను! ఏమి సెలవు ?

పర.—అలౌకిక శౌర్యసముద్రా! రామభద్రా! నా తేజము నంతయు నీ వవలీలగా గ్రహించితివి. నీవు మహానుభావుఁడవు, లోకవంద్యుఁడవు, భగవానుఁడ, వని గ్రహింపలేక నీయెడల మహాపరాధ మొనర్చితిని. దయాళుఁడవై నన్ను క్షమింపుము. నాపాదములు గొట్టెద నంటివి. మహాత్మా! వలదు. నాగమనశక్తిని నిరోధింపకుము. తపోమహిమచే నేను సంపాదించిన యాలోకములఁ గొట్టుము.

రాము.—(బాణమును విడిచి) ఇదివఱకు మీరొనర్చిన పుణ్యకర్మమువలన జనించిన ఫల మీ బాణముతో నశించినది.

పర.—తొందరపాటుచే రానినష్ట మేమున్నది? తిరిగి నేను మహేంద్రాద్రికిఁ బోయి తప మొనర్చెదను. వసిష్ఠమహర్షీ! నమస్కారము. సెలవు తీసికొందును.

వసి.—మంచిది.

పర.—దశరథా! సెలవు.

దశ.—చిత్తము.

పర.—[రామునికిఁ బ్రదక్షిణ మొనర్చి] రామా! రామభద్రా! రాజీవలోచనా! దయ యుంపుము. సెలవు తీసికొందును. లక్ష్మణా! పోయివచ్చెదను.

(పరశురాముఁడు నిష్క్రమించును.)

దశ.—[రాముని( గౌఁగిలించుకొని] నాయనా! నాయనా! అదృష్టవంతులము. మహోపద్రవము దాఁటినది. లక్ష్మణా! భరతశత్రుఘ్నులను స్త్రీజనముతో నిటకుఁ దీసికొనిరమ్ము. వేగ నయోధ్యకుఁ బోదము.

వసి.—వారు తిరుగ నిచ్చటి కెందులకు? మనమే వారిని గలిసికొని పోదము.

దశ.—చిత్తము.

(అందఱు నిష్క్రమింతురు.)



## 12. స్తోత్రము.

అనురాగము సద్గుణము. ద్వేషము దుర్గుణము. అనురాగము శాంతిప్రదము, ఆనందదాయకము. ద్వేషము మనస్సంక్షోభకారణము, కలహజనకము, దుఃఖావహము. ఆనందబాష్పములు, చిఱునవ్వులు, ప్రసన్నాననములు, చేల్లనిపలుకులు, విందుఁగుడుపులు, దానిపరివారము. బొమముళ్లు, పండ్లపటపటలు, చేటుకుఁజోఁపులు, రక్తస్రావములు, బొబ్బలు, ఏడ్పులు, సంతాపాశ్రులు, దీని పరిజనము. కనుక స్వసుఖమునకుఁగాని,

పరసుఖమునకుఁ గాని, ప్రపంచములోఁ బ్రేమవంటిది మఱి యొకటి లేదు.

బాలురు మొదలు వృద్ధులవఱకుఁ దా మేపని చేసినను, నిచ్చె టనో యచ్చేటనో సుఖమువచ్చుననియే చేయుదురు. దుష్టులు పాపకార్యములు చేయునప్పుడు సైతము, దూరదృష్టి లేని వారై, తాత్కాలిక సుఖ మపేక్షించి చేయుదురు. కాని పాప మవి పర్యవసానమునఁ బరమబాధాకరము లగును. ఒరుల సుఖ పెట్టఁగా వచ్చినసుఖమే నిజమైన సౌఖ్యము. అన్యము సుఖా భాసము.

సుఖ మెప్పుడును బ్రేమపూర్వకము. మన మొకనిని సుఖ పెట్టినా మన్న, వానియందు మనకుఁ బ్రేమ గల దన్నమాట. ఆత్మప్రేమ సర్వజనసామాన్యము. తనతరువాతఁ దనకుటుం బము వారియెడలఁ బ్రేమయుండుట సహజము. హృదయముపరి పక్వ మైనకొలఁది నాయనురాగము కుటుంబమునుండి గ్రామ మునకును, గ్రామమునుండి దేశమునకును, దేశము నుండి ప్రపంచములోని యెల్లమానవజాతికిని, దానినుండి సర్వభూత ములకును, వ్యాపించును. స్వార్థపరిత్యాగులగు బుద్ధచైత న్యాది మహానుభావులు ప్రపంచమున కుపకారము చేయుటకై తామెన్నో యిడుములుపడిరి. తల్లిదండ్రులయెడలను, అన్నదమ్ముల యెడలను, అక్కసెల్లెండ్ర యెడలను, ఇతరసన్నిహిత బంధు వులయెడలను, సహజ మగునమరాగ మగపఱుపని వాఁడు చెడ్డవాఁ డనియే చెప్పక తప్పదు.

మనము శిశువులమై, కేవలము పరాధీనులమై యున్నప్పుడు, నిద్రాహార సుఖములను గొలఁదిగనో గొప్పగనో విడిచి, మన

శుచిత్వమునకై, జుగుప్సాకరము లగు కృత్యములు నిత్యమును జేసి, మనసుఖమే తనసుఖ మనుకొని వెంచి, పెద్దవారలఁ జేసిన మాతృదేవతను మఱచి యామెయెడల నవిధేయతతోఁ బ్రవర్తించునామమాత్రపుత్రు నేమనవలయునో తెలియదు. తండ్రి యెడలఁ గృతఘ్నుఁడై మెలఁగువాఁడును, నట్టివాఁడే.

సోదరులుగూడ మనకుఁ బ్రేమాస్పదులై యుండవలసినవారే. ఏకగర్భజనితులై యొక్కచో వసియించి, యొక్కకంచెమునఁ దిని యొక్కమంచమునఁ బరుండి కలిసి యాటలాడుకొని, కష్టసుఖములఁ బంచుకొని, పెరిఁగినవా రన్యోన్య కలహములు పెట్టుకొని, రచ్చకెక్కుట యనుచితము. అన్నదమ్ములలో నెవఁడేని యప్రయోజకుఁడైనఁ, దక్కినవారు తమ ప్రేమచే నాలోపమును గప్పికొనవలెను. పాండవుల సౌభ్రాత్రమునుగూర్చి కాని, రామలక్ష్మణుల సౌహార్దమును గూర్చి కాని చేదివి యానందబాష్పములు విడువనివా రెవ్వరునుండరు. ఈసందర్భమున నొక చమత్కారమైన పుక్కిటిపురాణము గలదు. అది చెప్పెదము.

శ్రీకృష్ణదేవరాయ లొకనాఁడు సభలో "దాశరథుల సౌభ్రాత్ర మెక్కువా? పాండవులది యెక్కువా?" యని ప్రశ్నించెను. అవతారపురుషుఁ డగు రామునిసోదరుల వినయ విధేయతలే యెక్కువ ప్రశంసనీయములని, యందఱును జెప్పిరి. ఆయుత్తరమున కనంగీకార సూచకముగాఁ బ్రభువు తలపంకించెను. సభవారాశ్చర్యపడి "తమ యభిప్రాయమేమి?" మని యతని నడిగిరి. అంతటనాయన "శూరాగ్రేసరుఁడగు రాముని యెడల విధేయత యెవరుచూపకుందురు? కేవల శాంత

పురుషుఁడును, దమ్ములంత శక్తిమంతుఁడు గానివాఁడును, నగు ధర్మరాజు నెడల వారు చూపించిన విధేయత యే విధేయత" యని జవాబిచ్చెను. అదివిని యందఱూరకుండిరి; కాని పరిహాసప్రియుఁడగు తెనాలి రామలింగము తటాలున లేచి, ప్రభువువైపునకుఁ దిరిగి "యెంతవారికి, నెన్నిజన్మములకుఁ, బాక్షిక బుద్ధిపోదు. మీరప్పుడు పాండవపక్షపాతులన్న మాట జగద్విదితమైయున్నది. ఇప్పటికి నట్లేయున్నా" రని పలుకఁగా, సభవారెల్లరు పకాపక నవ్విరి.

ఈక్రిందికథ భ్రాతృప్రేమ సంపూర్ణముగాఁ గలవారికి ప్రాణముపైఁ దీపికూడ నొక్కప్పుడుండదని తెలుపుచున్నది.

పూర్వకాలమున మనదేశములోని గోవాపట్టనము కొన్నాళ్లవఱకుఁ బోర్చుగీసువారి యధీనమై వాణిజ్యములో మిక్కిలి ప్రసిద్ధి కెక్కియుండెను. అక్కడకు వచ్చుటకు లిజ్బనుపట్టనము నుండి యొక పెద్దయోడ బయలుదేఱెను. అందులో నావికులైననేమి, సాంయాత్రికులైననేమి, సముద్రయాయులైన నేమి, క్రైస్తవగురువులైననేమి, మొత్తముమీఁదఁ బండ్రెండువందల జనులుండిరి.

జనాకీర్ణమగు, నాపోత, మాఫ్రికా దక్షిణాగ్రమును జుట్టి యీశానదిశగా హిందూదేశమునకు వచ్చుచుండఁగా, నొక కొండనుదాఁకి బద్దలయి నీరుపోసికొని మునుఁగుటకు సిద్ధముగా నుండెను.

అట్టి యపాయస్థితిలోఁ గొన్నిప్రాణములనైన రక్షించుటకుఁ జిన్నపడవయొకటి పెద్దనావలపైఁ గట్టియుంతురు. అట్టి పడవను నౌకాధ్యక్షుఁడు సముద్రముపైఁ బడవేసి, యందొక

రొట్టెలసంచియుఁ, దేనెలో నూరవేసి నిలువఁజేసిన నారింజే తొనలపెట్టెలు కొన్నియు, నుంచి మఱి పందొమ్మండ్రతో దానిలో దుమికెను. వారందఱు జనభారముచేఁ బడవమునిఁగి పోవునను భీతిచే నింకెవ్వరును రాకుండఁ గత్తులు దూసిపట్టుకొని కాచుచుండిరి. పరమాత్ముని కృపచేఁ బైనుండిపడు నుదకము తక్క వేఱు మంచినీళ్లు లేవు. పడవ తిన్నగానడపుటకు దిక్ప్రదర్శక యంత్రమైన లేదు. భగవంతునిమీఁద భారమువైచి, యానిరాధారులు హిందూ మహాసముద్రములోఁ బడి పోవుచుండిరి. మిగిలినప్రాణులతోఁ బెద్దయోడ సముద్రగర్భమందుఁ బడి నష్టమైన దని వేఱుగాఁ జెప్పనక్కఱ లేదు.

చిన్నపడవలోనున్న నౌకాధికారి నాలుగుదినముల పిదప రోగముచే మరణించెను. తక్కినవారు "నేను నాయకుఁడ నౌదును; నేను నాయకుఁడనౌదు" నని కలహింప మొదలు పెట్టిరి. చిట్టచివర కెక్కువమంది యెవని నెన్నుకొందురో వాఁడు నాయకుఁడుగా నుండుటకొప్పుకొని, యట్లు కావించిరి. ఈ నవీననౌకానాయకుఁ డాహారము తగ్గుచుండుట చూచి, యిఁక నంతమందియు నున్నయెడలఁ గొలఁది కాలములోనే సంఘమరణము సంభవించునని భయమంది, చీట్లువేసి ముగ్గుర వదలిపెట్టి నాల్గవవానినెంచి, యా చొప్పున నందఱిలో నలుగుర నబ్ధిలోఁ ద్రోయుఁడనిచెప్పెను. అట్లుచేసిన మఱికొన్నాళ్ల వఱకుబ్రతుకవచ్చునని యందఱొప్పుకొనిరి. పందొమ్మండ్రలో మతగురువొకఁడు, వడ్రంగియొకఁడు, నుండిరి. మరణకాలము నందు మతగురువును, బడవబాగుచేయుటకు వడ్రంగియు, నుపయోగింతురని వారిని విడిచిపెట్టిరి. అతఁడు పలదన్నను గౌరవ

ముచే నాయకునిఁగూడ వదలివేసిరి. ఇఁక మిగిలినవారు పదు నాలుగురు. అయిన, నను కొన్న ప్రకారము చేసినయెడల జావ వలసినవారు నలుగురేయుండిరి.

వేసినచీట్లను బట్టివచ్చిన మొదటిముగ్గురు భగవద్ధ్యానము చేసి ప్రాణములు విడిచిరి.

ఇఁక నాల్గనవాఁడు పడవమీఁదనుండి పడఁద్రోయఁ బడఁ బోవుచుండఁగా, శేషించిన పదునేగురం దున్నయతనితమ్ముఁడు కన్నుల నీరుపెట్టుకొనుచు వచ్చి యన్నను కౌఁగిలించుకొని "యన్నా! నీకు భార్యాపుత్రులున్నారు. వారుగాక ముగ్గురు చెల్లెండ్రు నిన్నే యాధారము చేసికొనియున్నారు. నేనన్ననో, యేకాకిని, అవివాహితుఁడను, నాకై దుఃఖించువారు లేరు. నీకు బదులుగా నన్నుఁ జావని" మ్మనెను.

తమ్ముని యపారప్రేమ కాశ్చర్యపడి "తమ్ముఁడా! చూచు చుఁ జూచుచు నీవంటితమ్మునిఁ గోల్పోయి నేనెట్లు బ్రతుకఁ గలను ? అట్టి బ్రతుకుకంటెఁ జావు వేయిరెట్లు మేలుగాదా ! చీటి నీకు రాలేదు. కనుక దేవునకు నీయట్టి పురుషరత్నమును జంపుట కిష్టములేదు. నేను బోయిననేమి ? నీవుందువుకాదా ! నాయనంతరము నీవదినెను బిల్లలను మనచెల్లెండ్రను జాగ్ర త్తతోఁ జూచుచుఁ గుటుంబభారమును వహించి,మనపిత్రార్జిత ముతోఁ గాలముగడపుకొనుము. ఇదియే నాకడపటిమాట" లనిచెప్పి యన్నలోకాంతరప్రయాణోన్ముఖుఁడై యుండెను.

ఎంత చెప్పినను దమ్ముఁడు వినఁడయ్యెను. చిట్టచివరకుఁ దమ్మునికోరికయే నెఱవేఱెను. అతఁడు సముద్రములోఁబడెను.

పడవలోనుండియు దుఃఖసముద్రములోఁబడి, యన్న, తమ్ముఁడు పడినవైపునకు మిడిగ్రుడ్లుపెట్టుకొని చూచుచుండెను.

తమ్ముఁడు మంచి యీఁతకాఁడు. ఈఁదివచ్చి పడవ చుక్కాను పట్టుకొనెను. లోపలికి మరలవచ్చునని నావికుఁడొకఁడు కత్తితో నతనిచేయి నఱకెను. బాధచే సముద్రములోఁ దిరుగఁ బడియు, నతఁడు ధైర్యము తెచ్చుకొని మరల రెండవచేతితో జుక్కానుపట్టుకొనెను. క్రూరహృదయుఁడగు నావికుఁడదియు ఖండించివేసెను. ధైర్యసాగరుఁడగు తమ్ముఁడు సాగరములోఁ గాళ్లతో నిలువీఁత యీఁదుచు రక్తముగాఱుచున్న మొండి చేతులను నీళ్లపై కెత్తి పడవలోని వారికి మ్రొక్కుచున్నట్లగ పడెను.

జడమగు సముద్రమే చంపకున్న యట్టివానినిఁ జూచి యెవరి మనసు కరఁగకుండును? అన్న నిశ్చేష్టితుఁడై పిచ్చివానివలెఁ జూపట్టెను. అంద ఱేకగ్రీవముగాఁ బాప మొక్కఁడేకదా! పడవలోనికి రానిండని యఱచిరి.

అంతట నతనిఁ బడవలోనికిఁదీసికొని యున్నస్థితిలో సాధ్యమైనంతవఱకు గాయములకుఁ గట్టుకట్టి చికిత్సచేసి రక్షమాఁపిరి. నాఁటిరాత్రి యంతయుఁ బ్రయాణముచేసిరి. ఉదయమయ్యెను. పోర్చుగీసు వారుండుతావునకు దగ్గఱగానున్న యాఫ్రికాలోని మొజాంబిక్కు పర్వతములు భగవత్కృపచేఁ గంటఁబడెను. పడవ నక్కడకుఁబట్టి స్వదేశస్థులున్న తావున కందఱు సుఖముగాఁ జేరిరి.

ఒక గ్రంథకర్త యీవృత్తాంత మంతయు యథార్థమని గట్టిగా జెప్పినాఁడు. పడవదిగిన నాఁటిరాత్రియే యీసోదరు

లతో నతఁడు భోజనము చేసినాఁడఁట. ఇట్టి సోదరులఁగన్న జనకు లెంతధన్యులో! దేశమెంత ధన్యమో!

---

## ౧౨. భారతదేశ మహావృద్ధగు దాదాభాయి నౌరోజీ.

మన హిందూస్థానమున నీనడుమఁ గలిగిన దేశభక్తులలో దాదాభాయి నౌరోజీయను నాతఁ డగ్రగణ్యుఁడు. ఈమహానుభావుని చరిత్ర మార్యావర్తమం దుద్భవించిన యెల్ల వారు ముఖ్యముగాఁ బఠింపఁదగినది. మాతృదేశ క్షేమాభివృద్ధులకై పాటుపడఁ దలఁచిన యెల్లవారి కీతనిచరిత్రము మహోపయోగకరమని చెప్పుట కెంతమాత్రము సందేహింపఁ బనిలేదు.

బొంబాయి నగరమున 1825-వ సంవత్సరమునందు 4-వ సెప్టెంబరు తేదీని, పార్సీకులమందు, దాదాభాయినౌరోజీ జనించెను. ఈతని కుటుంబమువారు మతగురువులు. ఈతఁడు నాల్గు సంవత్సరముల బాలుఁడై యుండఁగా, నీతనితండ్రి కాలధర్మము నొందెను. అయినను దల్లియు నామెసోదరుఁడును నీబాలుని బహుజాగరూకతతోఁ బెంచి పెద్దవానిని జేసి విద్యావంతునిఁ జేసిరి. ఈతఁడు 'ఎల్ఫిన్‌స్టను' (Elphinstone) పాఠశాలలో విద్యాభ్యాస మొనర్చి విశేషబుద్ధికుశలుఁ డని యుపాధ్యాయులచే మెప్పునొంది పాఠశాలాపరీక్షలలో ననేక బహుమతుల నందెను. 1845-వ సంవత్సరమున నీతఁడు విద్యాసమాప్తిని జేయఁగానే, బొంబాయిలోని యున్నతన్యాయ

స్థానమందలి ప్రధాన న్యాయాధిపతియగు దొరగా రీతనిబుద్ధి వైభవమునకు జ్ఞానగాంభీర్యమునకు మెచ్చి, యీతనిని న్యాయవాదిగఁ జేయవలయు నని సంకల్పించుకొని,యింగ్లండు దేశములో నీతఁ డాపరీక్షకుఁ జదువుకొనుట కగు వ్యయములో



సగము సొమ్మిచ్చెద మని సెలవిచ్చిరి. అంతకుఁబూర్వమే పార్సీలలో నిద్దఱుముగ్గురు క్రీస్తుమతమునఁ జేరియుండుటచేతదాదాభాయి నౌరోజీగూడ నటులే చేయునేమో యని యతసపెద్దలీయేర్పాటున కంగీకరింపలేదు. 1850-వ సంవత్సరమున నీతఁడు ఎల్ఫిన్‌స్టను (Elphinstone) పాఠశాలలో, గణితశాస్త్ర సహాయోపాధ్యాయుఁడుగాఁ జేరి, కొలఁదికాలములోఁ బ్రధానో

పాధ్యాయుఁ డయ్యెను. హిందూస్థానమునఁ గళాశాలలోఁ ప్రధాన పండితులుగా నున్న హిందువులలో, నీతఁడే మొట్ట మొదటివాఁడు. ఈమహాగౌరవ మీతనియనన్య సాధారణ మేధావి శేషమును బట్టి యీతనికిఁ జేకూడఁబడినది. కాని 1856-వ సంవత్సరమున నీతఁ డాపదవిని వదలుకొని తాను భాగస్వామిగా నున్న 'కామా' యను నొక వర్తకసంఘపుఁబనిమీఁద నింగ్లం డునకుఁ బోయెను.

ఈతఁడుపాధ్యాయపదవిలో నున్నప్పుడుకూడ, దేశభాషా క్షేమకరము లగు ననేక సత్కృత్యము లాచరించెను. కలాశాలా ప్రధానోపాధ్యాయుని సాహాయ్యమును బొంది బాలురలో భాషీయ శాస్త్రీయాంశ పరిశోధక సంఘము (Students' Literary & Scientific Society) నొకదానిని స్థాపించెను. దానితో సంబంధించిన యొక పత్రికను స్థాపించెను. బాలికా పాఠశాలను బొంబాయి పట్టణమున నీతఁడే మొట్టమొదట స్థాపించెను. 'సత్యవాది' యను గుజరాతి పత్రిక నారంభించి, దానికిఁ దానుత్తమ వ్యాసములను వ్రాయుటయే కాక యిత రులచేఁగూడ వ్రాయించెను. 'విక్టోరియా ఆల్ బర్టు మ్యూజీ యము', పార్సీ శరీరవ్యాయామశాల (Parsee Gymnasium), బొంబాయి సంఘము (Bombay Association), వింతతువివాహ సంఘము,—వీనిని స్థాపించుటకుఁ బాటుపడిన వారలలో నీతఁ డగ్రగణ్యుఁడు.

ఇంగ్లండు దేశమున నీతఁడు కాలుపెట్టినది మొదలు, మర ణించు వఱకును దేశ క్షేమాభివృద్ధితోఁ జేరిన సత్కార్య ములను చేయుటయందే నిశ్చలదీక్షుఁడై బద్ధకంకణుఁడై యుం

డెను. హైందవులను హిందూ దేశపు 'సివిల్సర్వీస్సు' (Civil Service) లోఁ జేర్చుకొను విషయమును గూర్చి యీబుద్ధిశాలి ప్రయత్నించెను. ఎవరినో యొకరిని దయయిష్టానుసారముగ నధికారులు సివిల్సర్వీస్సు నకెన్నుకొను పూర్వాచారము 1855-వ సంవత్సరమున రద్దుపఱిచిరి. అట్టి యుద్యోగముల నపేక్షించు వారికందఱి కొక పరీక్ష నియమింపఁ బడినది. ఆపరీక్షలో నెవరు ప్రథమ స్థానమునఁ గృతార్థులగుదురో వా రాయుద్యోగమున కర్హులను నూతనపద్ధతి యేర్పాటయినది.

ఆసంవత్సరమే ప్రథమపరీక్షకు పార్సీకుటుంబములో నుండి యొక్కఁడు 'దరఖాస్తు' చేసెను, కాని యాతనికి నియమితమగు వయస్సుకంటె నెక్కువయున్నదను కారణమున నాతని 'దరఖాస్తు'ను బరీక్షాధికారులు నిరాకరించిరి. 'దరఖాస్తు' చేసిన యాచిన్నవానికిని బరీక్షాధికారులకు నిందునుగూర్చి యుత్తర ప్రత్యుత్తరములు జరిగెను. ఆసమయమున దాదాభాయినౌ రోజీలండను పట్టనముననే యుండుటచేత, నాతఁ డాచిన్నవానికన్యాయము జరిగినదని విచారించి, యాతనివిషయమున వయోనియమమును బాటింపవలదని కడుదూరము వాదించెను గాని యాతడుఁ తనప్రయత్నమునఁ గృతార్థుఁడు కాకపోయెను. కాకపోయినను లేశమైన విచారమును నొందక యట్టి పరీక్ష యింగ్లండులో జరుగుకాలమందే హిందూ దేశమునఁగూడ జరుగవలయు ననునేర్పాటును గావించుటకై మిక్కిలి ప్రయత్నించి ప్రబలమైన ప్రతివాదముచేసి యొకసారియోడియు జెంకక స్థిరమైన పూనికతో, న్యాయమందలి బుద్ధితో, దేశక్షేమమందలి యక్షీణదీక్షతోఁ, బ్రయత్నించి ప్రయత్నించి తుదకు 1893-వ సంవత్సర

ములో నట్టి యేర్పాటునకుఁ బార్లమెంటు వారిసమ్మతిఁ బడసెను. మొన్న మొన్నటి వఱకా సమ్మతి కాగితము మీఁదనే యున్నది గాని క్రియారూపముగాఁ బరిణమింపలేదు. ఇప్పుడది అమలులోనికిఁ దేఁబడినది. ఈ శాశ్వతమహోపకారమును స్వదేశీయులకుఁ జేసినయాతఁడు దేశభక్తాగ్రగణ్యుఁడగు దాదాభాయి నౌరోజీయే. హిందూదేశప్రజనుల స్వరూపస్వభావములఁ గూర్చియు, వారి పరిపాలనక్రమమును గూర్చియు నాంగ్లేయులలోఁ దెలిసినవారు మిక్కిలి తక్కువ సంఖ్యగలవారై యున్నారను నంశ మీయన కనిపట్టి, యట్టియజ్ఞానమును హరింపనెంచి లండను ఇండియ న్సొసైటీ (London Indian Society) అను పేర నొక సంఘమును స్థాపించెను. పరిపాలికులు పరిపాలితులఁ గూర్చి సంపూర్ణముగా నెఱిఁగియున్నఁగాని న్యాయ్యమగు పరిపాలన సిద్ధింపదని యామేధావి యట్లుచేసెను. ఆసంఘమిప్పటికి నున్నది. ఇదిగాక, యీవిషయమై యాతఁడింతకంటె గొప్పది యగు మఱియొక సంఘమును ఈస్టిండియా అస్సోసియేషన్ (East India Association) అను పేర స్థాపించెను. ఆసంఘములోఁ దఱచుగా గొప్పవారిందఱును హిందూదేశపాలనమును గూర్చియు, నార్థికస్థితినిగూర్చియు, స్వీయపాలనమునుగూర్చియు దేశక్షేమాభివృద్ధికరము లగు ననేక విషయములఁ గూర్చియు, నుపన్యాసము లిచ్చుచుండిరి. ఆంగ్లేయులకు మనదేశమును గూర్చియు, దేశజనులఁ గూర్చియు, సంపూర్ణముగాఁ దెలియఁజేయుట కొఱకు నౌరోజీ దేశాటనమొనర్చి, యుపన్యాసములిచ్చి, వార్తాపత్రికలకు వ్రాసి, వ్రాయించి, యితరులచేత నుపన్యాసము లిప్పించి, మనదేశమునకున్న సెక్రటరీ ఆఫ్ స్టేటు

(Secretary of State) వారితో విధ్యుక్తముగా నుత్తర ప్రత్యుత్తరములు జరిగించెను.

1862-వ సంవత్సరమున 'కామా' సంఘమువారితో నితఁడు సంబంధమును వదలుకొని సొంత వ్యాపారమును జేసికొనెను. ఈతఁడొక స్వదేశీయునకుఁ గొంత ధనసాహాయ్య మొనరించి యాతఁడు దివాలా దీయకుండఁ గాపాడెను. కాని, యాసొమ్ము తిరుగ నీతనికిఁ జేరకుండుటచేత వ్యాపారమున విశేషముగ నష్టము సంభవించెను. ఋజుప్రవర్తనమునకు సత్యవాగ్ధీక్షకీతఁడదివఱకే ప్రసిద్ధిచెంది యుండుటచేత, నాకష్టకాలమందైన నీతనిమాట శిలాక్షరముగ నుండెను. ఇంగ్లండులోని బ్యాంకున కధికారి యగునొక యాంగ్లేయుఁడీతని యసాధారణ సత్యప్రవర్తనమును విశేషముగ శ్లాఘించెను. హితులు కొందఱిచ్చిన ఋణములతోడను, ఋణప్రదాతల మంచితనముచేతను, నీతఁడాకష్టములు గడచి 1869 వ సంవత్సరమున బొంబాయిచేరెను.

ఆ బొంబాయిలోని మహాజనులందఱాతఁ డింగ్లండులో దేశక్షేమమునకై పడినశ్రమకు, దేశీయులకుఁ జేసినయుపకారములకుఁ, దమకృతజ్ఞతను వెల్లడించుటకై యాతనికి మహోత్సవపూర్వముగ స్వాగత మిచ్చిరి. సర్వమహాజనసంఘ మొక్కటి కావించి దానియం దాతనివిగ్రహము నుంచిరి. ఆతనికిఁ గొంత ధన మిచ్చిరి. కాని యాతఁ డాధనమును స్వప్రయోజనములకై యుపయోగ పఱచుకొనక లోకోపకార కృత్యములందు వినియోగపఱచెను. కౌవస్జీఫ్రాంజి (Cowasji Framjee) శాలలో నితని విగ్రహము జస్టిసు రానెడిగారి (Justice Ranade) వలన ప్రకాశిత మయ్యెను (Unveiled).

తరువాతఁ గొలఁదికాలములోనే, నౌరోజీ యింగ్లండునకుఁ బోయెను. హిందూదేశము మిగుల బీదదేశ మనియుఁ, బన్నుల భారము వహింప శక్తికలది కాదనియు, స్థిరపఱచుటకీతఁడు ప్రయత్నించెను. ఈవిషయములఁగూర్చి యీతఁడు విశేషశ్రమ మొనర్చి సంపూర్ణ మైనజ్ఞానమును సంపాదించుకొనెను. ఈ యంశమునుగూర్చి యీతఁడొక గ్రంథమును వ్రాసెను. దీనిఁ గూర్చియే యీతఁ డనేకోపన్యాసము లిచ్చెను. ఈయంశమును గూర్చియే యీతఁడు సాక్ష్యమిచ్చినప్పుడు హిందూదేశమున మొత్తముమీఁదఁ దల కొకయిరువది రూపాయలకంటె సంవత్సరమున కాదాయము లేదని చెప్పఁగా, నది యసత్యమని కాఁబోలు సందేహ మవ్విరి. కాని, కాగితములు పరీక్షింపఁగా, లెక్కలు చూడఁగా, నది 27 రూపాయల కెక్కువలేదని తుదకుఁ దేలినది.

1874-వ సంవత్సరమున నౌరోజీ బొంబాయికిఁ దిరుగ వచ్చెను. బరోడారాజ్యము దుష్పరిపాలనమున మిక్కిలి దుఃస్థితి లోనుండెను. రాజకీయోద్యోగులు లంచము తీసికొని రాజకార్యభంగము లాచరించుచుండిరి. సరియైన లెక్కపత్రములు లేకుండుటచే నెవనిచేతికిఁ జిక్కినధనమును వాఁడు హరించుచుండెను. తిరుగ నీరాజ్యమును జక్కఁబఱచుటకు బహుధీశాలియుఁ బరమార్థ తత్పరుఁడును, ప్రజాపరిపాలన సమర్థుఁడును నగుప్రధానుఁడు కావలసియుండెను. దాదాభాయి నౌరోజీ యాపదవిలో నియమింపఁబడెను. బరోడాలో నుండు రెసిడెంటు నకు నీతనికి సరిపడక పోవుటచే, నాతఁ డితనియేర్పాటుల కెంత యడ్డు వచ్చుచుండినను, రాజద్రోహమువలన నన్యాయధనార్జన

మున కలవాటు పడిన రాజకీయోద్యోగు లీతని నెన్నిచిక్కులు పెట్టినను, లక్ష్యపెట్టక న్యాయైకదృష్టితో నారాజ[illegible]లి చిక్కుల నన్నియుఁ బాపి, యుద్యోగులలోని దురభ్యాసముల నన్నిటిని రూపుమాపి, రాజ్యాభివృద్ధికిఁ జక్కనిమార్గములఁ జూపి, యారాజ్యమును రెండు సంవత్సరములలోఁ [illegible]క్కఁబఱచి యాపనిని వదలుకొనెను.

తిరుగబొంబాయి వచ్చి కొంతకాలము మ్యునిసిపల్సంఘములో నొక సభ్యుఁడుగానుండెను. తరువాతఁ గొలఁదికాలమునకే బొంబాయి శాసన నిర్మాణసభలో సభ్యుఁ డయ్యెను. ఇంగ్లండునకుఁబోయి పార్లమెంటులో సభ్యుఁడుగాఁ జేరి భ[illegible] నకంతకు నుపకార మొనర్పవలయు నను నభిలాష [illegible] బలవత్తమమై వృద్ధినొందుటచే, శాసననిర్మాణ సభ[illegible]మును బరిత్యజించి, యింగ్లండునకు 1885 వ సంవత్సరములోఁ బోయెను. ఆ సంవత్సరమే జాతీయమహాసభ (National Congress) బొంబాయిలో నీతని ప్రోత్సాహమువలన స్థాపింపఁబడెను.

ఇంగ్లండునకుఁబోయి [illegible]ర్లమెంటులోని [illegible] యెన్ని ప్రయత్నములైన నాచరించెను, గాని [illegible] కృతార్థుఁడు కాలేదు. 1886[illegible] సంవత్సరమున [illegible] కత్తాలో జరిగిన జాతీయమహాసభ కగ్రాసనాధిపత్యము వహించుట కితఁడు వచ్చెను. వెంటనే యింగ్లండునకుఁబోయి యచట నయిదుసంవత్సరములు చాలఁ గష్టపడి తుదకు 1892 వ సంవత్సరములో (Central Finsbury) సెంట్రల్ఫిన్స్బరీకి సభ్యుఁడుగా పార్లమెంటులోఁ జేరెను. హిందూదేశ మంతయు నీహిందు

వునకు జరిగినమహాగౌరవమునకుఁ బరమానందభరిత మయ్యెను. భరతఖండాభిమాను లగు "వెడ్డరుబరన్" "కెయిన్" మొదలగు [illegible] సీతఁడు చేరి పార్లమెంటులో హిందూదే[illegible] కేర్పడిన సంఘమును దిరుగఁబూర్తిగా సంస్కరించెను.

1894-వ సంవత్సరమున లాహోరులో జరిగిన జాతీయ మహాసభ కీతఁడగ్రాసనాధిపతిగా వచ్చెను. బొంబాయి మొదలు లాహోరు వఱకు రెయిలుబండి యాఁగిన యన్నిస్టేషనులలోను నీమహానుభావునకు, మహారాజులకు జక్రవర్తులకు నర్హములగు సమస్తవైభవములతో స్వాగత మీయఁబడెను. లాహోరు [illegible] చేరఁగనే యాతఁడు కూర్చున్నబండికిఁ బూన్చిన [illegible]నవాసులే దానిని మహానందముతో జయజయధ్వానములతో లాగిరి.

1895-వ సంవత్సరములోఁ దిరుగఁ బార్లమెంటులో సభ్యుడుగా నుండుట కీతఁడు ప్రయత్నించెను. కాని కృతార్థుఁడు కాలేదు. అందులకీతఁడు లేశమును నిరుత్సాహపడక యింగ్లండు [illegible] దేశక్షేమమునకై పాటుపడుచుఁ దిరుగ సభ్యత్వ[illegible]టకొఱకు కదను వేచియుండెను. అప్పు డీతఁడు [illegible] "[illegible]" యను వార్తాపత్రికలో వ్రాసినకొన్నియంశము లివిగో.—

"సాంఘిక విషయమున, రాజకీయ విషయమున, విద్యా విషయమున, వ్యాపారవిషయమునఁ, బరిపాలనక్రమ విషయమున, దాదాపుగా నేఁబది సంవత్సరములనుండి నేను దేశసేవ

చేయుచుంటిని. నేను జేసిన ప్రయత్నములలోఁ గొన్ని ఫలించినవి. కొన్ని విఫలములైనవి. విజయము కలిగినప్పుడు నేను విశేషముగా సంతోషించి యెఱుఁగను. పరాజయము కలిగినప్పుడు దుఃఖించి యెఱుఁగను. జయాపజయములను గణింపక, శాంతితో, నోరిమితోఁ, బట్టుదలతో, దేశాభివృద్ధికై పాటుపడుటయే నాజీవయాత్రా ప్రయోజనమని నేను నిశ్చయపఱచుకొంటిని. అవకాశ మున్నంతవఱకు, నీశరీరమునం దారోగ్య మున్నంతవఱకు, నేను దేశక్షేమముకై శ్రమ మొనర్చెదను. తిరుగఁ బార్లమెంటులోఁ జేరుటకుఁ బ్రయత్నింతును".

అమృత తుల్యములగు నీతని మాటలు స్వదేశీయులెల్లరుఁ ద్రావి, యీతని దేశభక్తిలో, స్వార్థపరిత్యాగములో, సాహసములో, సత్యబుద్ధిలో, సహస్రాంశమైన సంపాదించు కొందురు గాక! ఈ మహానుభావుఁడు. సహస్రాధిక మాసజీవియై దాదాపు 92 ఏండ్లుబ్రదికి 1917 వ॥ సంవత్సరము జూన్ 30 వ॥ తేదీని స్వర్గస్థుఁడయ్యెను. ఈయనను "ప్రభావవంతుఁడైన భారతదేశ వృద్ధు(The grand old man of India)" అందురు!

---

## 14. ఖడ్గమృగము.

గొరిజెలు గలజంతువులలో ఖడ్గమృగ మొకటి. ఖడ్గమృగ మనఁగా ఖడ్గమువంటి కొమ్ము గలజంతు వని యర్థము. దీనికే ఖడ్గి యనియు గండక మనియుఁ బేళ్లు గలవు. ఖడ్గి యన్నను ఖడ్గమృగ మన్నను నొకటే యర్థము. గండక మనఁగా బలమైన గండ స్థలములు గలది.



ఖడ్గమృగము.

కాళ్లు పొట్టివిగా నుండుటవలనఁ జిన్నవిగా నగపడునుగాని వీనిలోఁ గొన్ని యేనుఁగు తరువాత నేనుఁగంత జంతువులు.

గండకములలో నేషియాఖండములోనివనియు నాఫ్రికా ఖండములోనివనియు రెండు పెద్ద తెగ లున్నవి. ఏషియా తెగ లో హిందూ, జావా, సుమిత్రా యను మూఁడంతర్జాతులును, నాఫ్రికా తెగలో నల్లవి తెల్లవియను రెండంతర్జాతులును నున్నవి.

స్థలభేదములనుబట్టి కొన్ని లక్షణభేదము లున్నను, మొత్త ముమీఁద గండకము లన్నియుఁ బెద్దజంతువులు. బలిష్ఠమైన శరీరము గలవి. కాళ్లు పొట్టిగాను బుష్టముగాను నుండును. తల పెద్దది, కోలగానుండును. కన్ను లురువైనవి కావు. చర్మము దళసరి. రోమములున్నయెడల నక్కడక్కడ మాత్ర ముండును. శరీరముమీఁద ముడుత లుండును. తోఁక సన్నముగాఁ బొడు గుగా నుండును. ముట్టెమీఁద నొకటిగాని రెండుగాని ఖడ్గము వంటి కొమ్ములుండును. ఇవి త్వక్సంబంధములే కాని శల్య సంబంధములు కావు.

ఖడ్గమృగము పట్టిపిఱికి మొద్దు. మనుష్యుఁడు కంటఁబడిన యెడలఁ బాఱిపోవలయునని చూచుచుండును. కాని తప్పించు కొనుట కుపాయాంతరము లేనప్పుడుమాత్రము, తిరుగఁబడి తన్నుఁ గాపాడుకొనును.

గండకములు నిశాటములు. వీనిలోఁ గొన్నిటికి బాడువ లునికిపట్టులు. కొన్ని యరణ్యములం దుండును. కొన్నిగండక ముల యడుగుదౌడయందుఁ బొడుగైన రెండు కోఱ లుండును. ఈ కోఱలనడుమ రెండు కత్తెరపం ళ్లుండును. అన్నిటికిని నమ

లుటకు దంతము లుండును. కొన్ని గడ్డి మేయును, కొన్నికొమ్మ లును రెమ్మలును దినును.

హిందూదేశపుఖడ్గి జావా సుమిత్రాల వానికంటెఁ బెద్దది. ఇది యైదారడుగుల యెత్తుండును. పదియు నఱయడుగుల పొడుగుండును. మగదానికిని నాఁడుదానికిని గూడ నొక్క కొమ్ము మాత్రమే యుండును. అదికూడఁ జిన్నది గనుక, నీ జాతివి శత్రువులను గోఱలతోఁ దాఁకి పోరాడును.

శరీరచ్ఛాయ గోధుమచాయ. తోఁకమీఁదను జెవులమీఁదను మాత్రము రోమము లుండును. పార్శ్వములందును గాళ్లమీఁదను బొగడ మేకులవంటికాయ లుండును.

శరీరముమీఁద ముడుత లుండును. నడుముమీఁది పెద్ద ముడుత గుజ్జుపుజీనువలె నుండును.

ఖడ్గికిఁ బందికివలెనే రొంపిలో స్నాన విష్టము.

పొడుగుగడ్డి గల చిత్తడిబయళ్లలో నివి యుండును. కత్తెరపం ట్లుండును గనుక నివి గడ్డి కొఱికి సమలును.

కోపము వచ్చినయెడల న దొకవిధముగా గర్జించును.

పరుగు వికారముగా నుండును.

చర్మము తుపాకిగుండు కూడ దూసికొనిపోవుటకు శక్యముగానంత దళముగా నుండు నని చెప్పుదురు. కాని, బ్రతికియు న్నప్పు డది మెత్తగానే యుండును. చచ్చి యాఱినపిదపమాత్రమే బిరుసెక్కి గట్టిపడును. అందువలన మనవారు పూర్వకాల మందు దీనిచర్మ మొలిచి, దానితో డాళ్లు చేసికొనెడి వారు.

దీనిని వేఁటాడువిధములు రెండు గలవు. ఏనుఁగునెక్కి యది యున్న తావునకుఁ బోయి చంపుట యొకవిధము. ఏనుఁగుల

మీఁదఁ బోయి యవి దాఁగియుండు తావులందుఁ జప్పుడుచేసి బెదరింపఁగా, నవి బయలుదేఱి పాఱిపోవునప్పుఁ డదివఱకే మార్గములలోఁ గాచుకొనియున్న వేఁటకాండ్రు తుపాకులతో వానిని గొట్టిచంపుట రెండవమార్గము.

జావాద్వీపపు గండకము హిందూదేశపుఖడ్గికంటెఁ జిన్నది. దీనికిఁ జర్మముమీఁదఁ గాయ లుండవు. సాధారణముగా రోమము లుండును. ముడుత లంత స్ఫుటముగా నుండవు. మగదానికిమాత్రమే కొమ్ముండును. ఇది మలక్కా, సుమిత్రా, జావాద్వీపములందును వంగదేశమందును నుండును. కత్తెరపండ్లు లేవు. కనుక జావాఖడ్గి గడ్డి కొఱుకలేదు. హిందూదేశ గండకముకంటె నెక్కువసాధువు.

సుమిత్రా జాతిఖడ్గి, అస్సాము బర్మా మలేదేశములందును, సుమిత్రా బోర్నియో ద్వీపులందును, నుండును. జావాలో లేదు. మూఁటిలోఁ నిది చిన్నది. సాధారణముగా దీనికి శరీర మంతటను బొడుగైన రోమములుండును. అవి గోదుమ రంగుగాఁగాని నల్లగాఁగాని యుండును. చర్మముమీఁది వళులు మిక్కిలి యస్ఫుటముగా నుండును. ఈ జాతికి రెండుకొమ్ము లొకదాని వెనుక నొకటి యుండును. కోఱ లుండును గాని కత్తెర పండ్లుండవు. అవియైనను గొన్నాళ్ల కూడిపోవును. ఈ జాతి మృగములు పర్వతారణ్యములం దుండును. ఇవి చక్కఁగా నీఁదఁగలవు. వేగముగా లొంగి మచ్చికపడును.

ఆఫ్రికా తెగలో నల్ల వనియుఁ దెల్ల వనియు రెండురకము లుండు నని చెప్పితిమి. తెల్లజాతి దాదాపుగా నిర్మూల మైన దని చెప్పుదురు.

ఈ రెండుజాతుల స్త్రీపురుష మృగములకును రెండేసి కొమ్ములుండును. అవి వానితో డీకొని శత్రువులతోఁ బోట్లాడును. శరీరముమీఁద వళు లుండవు. వీనికిఁ గోఱలుకాని, కత్తెరపండ్లుకాని లేవు. అందుచేత ముట్టె గుండ్రముగా, నఱికివైచిన, ట్లుండును. చెవులమీఁదను దోఁకమీఁదను దప్ప మిగిలిన చోట్ల రోమము లుండవు.

నల్లజాతి యాఫ్రికాలోఁ బెక్కుచోట్లఁ గలదు. దీని పై పెదవి సాఁగి యేనుఁగుతొండము చివరవలెఁ గొనదేఱి పదార్థములను బట్టుకొనుట కనువుగా నుండును. ఆకులును, గొమ్మలును దీనియాహారము.

బయళ్లందు మేఁత మేయుచున్నప్పుడు గుఱ్ఱముమీఁదఁ బోయి కాని, నీటిపట్లఁ బొంచియుండి కాని, దీనిని దక్షిణాఫ్రికాలో వేఁటాడుదురు. సౌడనులో నరబ్బులు మంచివడి గల గుఱ్ఱములమీఁదఁ బోయి, పెద్దకత్తితోఁ దొడనరములఁ దెగనఱికి కుంటుపఱిచి చంపుదురు. మఱియొక విధము గలదు. దాని సంచారమార్గములోఁ జిన్నగోయి త్రవ్వి పెద్దతుంగలమర్చిన వల లందులోఁ బఱతురు. పాపము! ఖడ్గమృగముకా లావలలోఁ దగులుకొనును. అందుచే నది బెదరి తుంగ నీడ్చుకొని పాఱిపోవఁ బ్రయత్నించును. కాని యాతుంగ యేవృక్షమూలమునకో తగులుకొని ఖడ్గమృగమును నిర్బంధించును. మఱునాడు మృగయులు దానిజాడ కనిపట్టి పోయి వధింతురు.

గండక మొక్కచోట స్థిరముగా నుండక యెప్పుడును దిరుగుచునే యుండును. ఎవరైనను దన్ను సమీపించినయెడల

మహాధైర్యశాలివలెనే బుసకొట్టి దూఁకుచు నెదురుగాఁ బోయి బెదరించును. కాని, వాఁడొక్క చేప్పట చేఁఱచినంత మాత్రముననే తోఁక ముడిఁచికొని యదే పరుగుగా వెనుకకుఁ దిరిగి పాఱిపోవును. ఇంత పిఱికిజంతువైనను ప్రాణాపాయసమయమున నత్యద్భుతమైన సాహసముతో శత్రువు నెదుర్కొని, దారిలో నున్న యెద్దులఁగాని బండ్లనుగాని సరకు చేయక, తన కడ్డువచ్చిన యన్నిటిని నుగ్గు నుగ్గు చేయుచుఁ ద్రోసికొనిపోవును.

ఖడ్గమృగము నిద్ర కుంభకర్ణనిద్రయే. అది గాఢనిద్ర పోవుచున్నప్పుడు తుపాకిమడమతోఁ బొడిచినను దానికి మెలఁకువ రాదఁట.

---

## 15. హాస్యకథ.

ఒకనాఁడు సాయంకాల మగుచుండఁగా నొకయూరి సత్రములోని కొకబాటసారి యశ్వారూఢుఁడై వచ్చి గుఱ్ఱపు లాయమునొద్ద నశ్వావతరణ మొనర్చి, యచ్చటిసేవకుని బిగ్గరగాఁ బిలిచి, "ఇదిగో! ఈ గుఱ్ఱమును జాగ్రత్తగా నశ్వశాలలోఁ గట్టివైచి దాని సంరక్షణమున నప్రమత్తుఁడవై యుండుము" అని పలికెను. "అయ్యా! లాయము, గుఱ్ఱములతో నిండియున్నది. ఎంతమాత్రమును స్థలములే" దని యాసేవకుఁడు ప్రత్యుత్తర మిచ్చెను. ఆబాటసారికన్నులను చిట్లించుకొని కుడి యఱచేతిని గుడిచెవి వెనుకఁజేర్చి "ఏమి? ఏ మనుచున్నా" వని బిగ్గరగాఁ బలికెను. బాటసారికిఁ జెవుడు కాఁబోలు నని, యా

యశ్వసేవకుఁడు "ఇక్కడ బొత్తిగా స్థలము లేదయ్యా!" యని గట్టిగానఱచెను. "ఇప్పుడే బహుమతి నిమ్మనుచున్నావా? రేపు నేను వెళ్లునప్పుడీయఁగూడదా? యప్పుడే నీ వేమిచేసినావని నీ కీయవలసినది?" యని బాటసారి కోపపడి పలికెను. "అది కాదయ్యా!" స్థలము! ఇక్కడ! ఏదీ? మీరే చూచుకొనుఁ" డని యాసేవకుఁడు గొంతు చించుకొని కేకవైచెను. "దానా మాటయేనా? దానికిఁబండ్లు లేవు, అందుచే గింజెలు నమలనేర"దని యాబాటసారి ప్రత్యుత్తరమిచ్చెను. "నావలనఁ గాదు బాబూ! మీగుఱ్ఱమును మీరే జాగ్రత్తపఱచుకొనుఁ" డని యాతఁడు గాడిదవలె నోండ్రపెట్టెను. "సరి సరి, మంచిది. కష్టపడి యేదో తీసికొనవలయును గాని ముందుగాఁ దెమ్మనవచ్చునా? సరే! దీనిని జాగ్రత్తగాఁ జూచుచుండు" మని యాతఁడు వడివడి లోనికి నడచిపోయి, యాసత్త్రాధికారిణియొద్దఁ జిరకాలపరిచితునివలె నవ్వుచు నిలువఁబడి, బసకు గదియొకటి కావలయునని పలికెను. "ఇంటి నిండ బాటసారు లున్నారు, మీ కిచ్చుట కొకగదియైనను లే" దని యామె మృదుమధుర కంఠస్వరముతోఁ బలికెను. "గదులు చిన్నవి, సదుపాయములుగా లే వనుచున్నావా? సదుపాయమున కేమి? సత్రములో నింతకంటె సౌఖ్యము వచ్చునా? నా కిబ్బందిగానుండునేమో యని నీవు సందేహింపఁ బనిలేదు. యాత్రికుఁ డను గానఁ బ్రయాణకష్టమున కలవాటుపడినవాఁడనే" యని బాటసారి పలికెను. అతఁడు బధిరుఁడు కాఁబోలునని యామె యనుకొని "అయ్యా! మీకు బాగుగా వినఁబడదా" యని గట్టిగా నఱచెను. "నేను వెనుక నిక్కడ

కెప్పుడును రాలేదు. ఎవరిని జూచి నన్నను కొనుచున్నావో ? మనుజునిఁ బోలినమనుజు లుండవచ్చు" నని యాతఁడు తల వంచుకొని, యొకగది యొద్దకు నడచిపోవుచుండెను. బాటసారికి బమ్మ చెవుడని యూపడఁతి నిశ్చయించుకొని, యాతని కడ్డుగా నిలువఁబడి, "అయ్యా! యీగదిలో నొకఁడు బసచేసి యున్నాఁడు. ఆగదిలో మఱియొకఁడు దిగియున్నాఁ" డని యామె రెయిలుబండి కూఁతవంటియొక యఱపఱచెను. "సరే! యీగదికంటె నాగదియే విశాలముగా నున్న యెడల నాగదియే తీసికొందు" నని గిఱుక్కునఁ దిరిగి యా రెండవగది యొద్దకుఁ బోయి, ద్వారమునొద్ద నున్న పడుక కుర్చీపైఁ బండుకొని, యీలపాట పాడుకొనుచుండెను. అప్పుడాయువతి యింత చెవిటి వాని నెక్కడను జూడలే దని కాఁబోలుఁ, దెల్లపోయి స్తంభమువలె నిలువఁబడియుండెను. అంత నాబాటసారి "నీదయ వల్ల సదుపాయమునకు లోటేమియు లేదు. ఇఁక నా కిప్పుడు కావలసిన దేదియు లేదు. కావున నీవు వెళ్లవచ్చు" నని పలికెను. అంత నామె చేయున దేదియు లేక, యుడుకుఁబోతుఁదనము వలనఁ గలిగిన వెఱ్ఱికోపముతో "పో! పో! చెవిటిముండ కొడుకా!" యని యాకసమంత నోరుచేసికొని యఱచెను. "భోజనములోని కేనా ? నీ యిష్టమువచ్చినది చేయవచ్చును. నా కొకటి యిష్టము, నొకటి యనిష్టముఁ గాదు. ఈ కాలపు నీరసులవలె నది కాఁక యని, యిది జేలుబని దేవులాడువాఁడను గాను. సాపాటు పుష్టియున్నవాఁడను గాని చేచ్చు పెద్దమ్మను గాను" అని పలికెను. అంత నా గృహిణి మహాకోపముతో "చంపినను పాపములేదురా! నీ గొంతుఁ

గోసినను బాపము లేదురా!" యని యెలుఁగెత్తి యార్చెను. "స్వగృహమువలెనే భావించుకొను మని వేఁడుకొనఁ జెప్పవలయునా?" యని బాటసారి నవ్వుచుఁ బలికెను. అంతనామెకుఁ గోప మేమయ్యెనో కాని, పక్కున నవ్వు వచ్చెను.

వీఁడు వదలు సాధన మే దని లోన నాలోచించుకొనుచుఁ గొంతసేపు నిలుచఁబడి "నీయిల్లు వల్లకాడుగాను! నీపీడ మాకెప్పుడు వదలునురా!" యని లోకాతీత మైన యొక కేక వైచెను. "నీరుల్లిపాయల పులుసు నీకిష్టమేనా యని యడుగవలెనా? మాతల్లివి! దానితో నద్దసేరు బియ్యపుటన్న మవలీలగాఁ దినఁగలను! అన్నపూర్ణమ్మవు! ఎన్నో సత్రములలో భోజనముచేసితిని గాని యింత యాదరణముమాత్రము నేను మఱెక్కడను జూడలేదు. అమ్మా! వైనయెవరికి శాశ్వతము! మంచిమాట యొక్కటియే నిలుచునది" అని యాతఁడు పలికెను. అంత నామె గొంతుచించుకొనుట వలనఁ గలిగిన దగ్గుతోఁ గొంత బాధపడి నీకిరోజున నన్నము పెట్టినయెడల నేను జానకమ్మనుగా నని తనలో నిం కేమేమో గొణఁగుకొనుచు లోనికిఁ బోయెను.

అది యొక పూఁటకూటియిల్లు. గదుల కద్దెయిచ్చి బాటసారు లక్కడనే పండుకొందురు. ఆదినమున నాయింటిలో బాటసారులు పదుగు రున్నారు. వా రందఱుఁ దల కొకగదిని దీసికొనిరి. గదియొక్కటి నైన బాటసారి యుపయోగమునకు లేనిమాట సత్యమే. అయిన నేమి? ఈసంగతి నాతనికిఁ దెలియఁజేయు టెట్లు? ఆతఁడు పడుకకుర్చీలో నూరక పండుకొనుటల యని, యాసత్రమునందు వంట యెక్కడఁ జేయఁబడు

చుండెనో, వడ్డనసాల యేదో, స్నానపుగది యేదో వానివానికి మార్గము లేవ్రా కనిపట్టుచుఁ దనలోఁ దా నేదో పాడుకొనుచుఁ దిరుగుచుఁ గాలక్షేపముఁ జేయుచుండెను. ఎనిమిదిగంటలు కాఁగానే యాతఁడు స్నానముగదిలోనికిఁ బోయి స్నానము చేయుచుండెను. ఆతఁడు స్నానము చేయుచుండఁగానే యా సత్రములో నదివఱకు బసచేసిన పదుగురు బాటసారులు వచ్చిరి. వారిని గాంచి జానకమ్మ " సత్రములోని కొక చెవిటి బాటసారి వచ్చియున్నాఁడు. ఆతఁడు నాప్రాణములు దీసినాఁడు. ఆతనికి నే నన్నము పెట్ట నని యొట్టుపెట్టుకొంటిని. మీకుఁ బదుగురకు మాత్రమే వంటఁ జేసితిని. మీరు శీఘ్రముగా భుజియింపుఁడు. పాదప్రక్షాళనము నిమిత్తము స్నానపు గదిలోనికిఁ బోనక్కఱ లేదు. ఇచ్చటి గంగాళములో నీ ళ్లున్నవి. మీయవశిష్టములఁ దీర్చుకొని వేగ విస్తరాకులయొద్దఁ గూర్చుండుఁడు. త్వరగ రండు. వడ్డనసాలతలుపు వేయుఁడు " అని వారితోఁ జెప్పఁగ, వారు మంచి దనిరి. ఇంతలో మన బాటసారి స్నాన మొనర్చి దుస్తులను ధరించి వెలుపలికి వచ్చి వడ్డనసాలకుఁ దలుపువైచి యుండుటను గని తలుపు కన్నములోనుండి చూచెను. వడ్డన యగుచున్నది. పదుగురును గూరుచుండి యున్నారు. వడ్డనసాల కెక్కడనుండి దారియున్నదో యిదివఱ కాతఁడు బాగుగఁ బరీక్షించిన వాఁడే కావునఁ జేటుకున దొడ్డిలోనుండి వచ్చి, యచట నున్న మొండిగోడను గుబాలున దాఁటి వంట యింటిలోనుండి వడ్డనసాలలోనికి మెఱపు మెఱయునంత వేగముతో వచ్చెను.

ఆతనిఁ జూచి జానకమ్మ తెల్లపోయెను. బాటసారులాశ్చ ర్యపడిరి. వారిలో నొక్కఁడు లేచి "నీ విక్కడకురాఁదగదు. వెంటనే యావలికిఁ బొ"మ్మని కేకవై చుచు వి స్తరియొద్ద నుండి లేచెను. "అయ్యయ్యో! నాకొఱకు నీ వేల లేవవలె నయ్యా! వంటవ్రాఁటింటిలో నింత గౌరవ మెందులకయ్యా! నే నొకయాకువైచి కొనలేనా?" యని పలుకుచు నాతఁడు లేచినచోట వేగ కూర్చుండెను. లేచిన బాటసారి మొరడై యట్టె నిలువఁ బడియుండెను. మొదటి పీఁటమీఁదఁ గూర్చుం డినబాటసారి లేచి "నీ వేల యిక్కడకువచ్చితివి. నీ కేమిబుద్ధి లేదా" యనిగట్టిగ నఱచెను. "నన్ను మొదటిపీఁటమీఁదఁ గూర్చుండు మని యేల నిర్బంధింతువు? నేనేమివియ్యంకుఁడ నయ్యా! కూర్చుండిన చోటనుండి లేవఁగూడదు. ఇక్కడ నాకు సుఖముగానే యున్న" దని మనబాటసారి పలికెను. అందఱును నవ్వసాగిరి. ఆతనికి భోజనము పెట్టకతప్ప దని వారు నిశ్చయించుకొనిరి. నేను మాత్రము వడ్డింప నని జాన కమ్మ భీష్మించుకొని కూర్చుండెను. వి స్తరియొద్ద నుండిలేచిన యాతఁడు వారందఱకుఁ గావలసిన దేమో వడ్డించెను.

మనబాటసారి యతిశీఘ్రభోజి యగుటచేభోజనకృత్యమును ద్వరగా ముగించుకొని లేచి యాజానకమ్మయొద్ద మూఁడణా లుంచెను. 'మూఁడుపావులాలతిండి తిని మూఁడణాలిచ్చెదవా?' యని యాడబ్బు లాతనిమీఁద నామె పడవైచెను. "సరి! సరి! ఈదినమున మనకు విందా?" అని యాడబ్బులను రొండిలో దోఁపికొని వడ్డనసాలనుండి యాతఁ డీవలికి వచ్చెను. ఈతని యసాధారణ బాధిర్యమునుగూర్చి నవ్వుకొనుచు బాట

పారులు మెల్లగా భుజించి యీవలికి వచ్చి చావడిలోఁ జేట్లలు గాల్చుకొనుచుఁ, బాడుకొనుచుఁ, బేకయాడుకొనుచుఁ, గాల క్షేపము చేసిరి. మనబాటసారి వారికిఁ గనఁబడకుండుటచే నెవ్వఁడో కడుపుఁగక్కుఱితిచే వచ్చి, తిని పోయినాఁ డని యనుకొనిరి. పండ్రెండుగంట లైనతరువాత నెవరిగదిలోనికి వారుపోయిరి. ఒకబాటసారి, యదిరిపాటుగఁ దనగదిలో నుండి వెలుపలికి వచ్చి "సోదరులారా! నాగదిలోఁ జెవిటిఖాఁడు పండుకొని పైకప్పెగిరిపోవునట్లు గుఱ్ఱుపెట్టుచున్నాఁ" డని గట్టిగఁ గేకవైచెను. మిగిలినవా రంద అచ్చటికి వచ్చి యాగ దిలోఁ బ్రవేశించి యాతని గట్టిగ లేపిరి. ఆతఁడు లేచునా ? అది గాక మెలఁకువతో నున్నవానిని లేపు టెట్టు? అతని చేయి పట్టి గట్టిగ నూఁపి "పో! నీ విచేట నేల పండుకొంటివి" అని వా రఱచిరి. అతఁడు లేచి "దొంగలే! దొంగలే! డొక్కఁజీల్చి ఱాలుకొట్టెదను. ఈప్రాంతమున దొంగ లున్నా రని వినుచునే యున్నాను. నే నొక్కఁడ ననుకొనుచున్నారు. ఈసత్రములో నేను గాక పదుగురు బాటసారు లున్నారు. జాగ్రత్త! ఇదిగో చిన్నతుపాకి" యని తలవైపున నున్న పిస్తోలును దీసి పైకిఁ బేల్చెను. బాటసారు లడ లొంది పరుగెత్తు కొని పోయిరి. ఆగదిలో నాతఁడు తెల్లవాఱువఱకు హాయిగా నిద్రించెను.

తెల్లవాఱిన పిదప లేచి గుఱ్ఱపువానికిఁ గొంత బహుమాన మిచ్చి, మొగము గడుగుకొనుచుఁ గూర్చుండిన జానకమ్మను జూచి "అమ్మా! నేను బోయెదను. నేను జెవిటివాఁడ నని మీా రంద అనుకొని యుందురు. నేను జెవిటివాఁడను గాను.

నీవు కోరినమూఁడుపావులా లివిగో! గది కొకరూపాయ యద్దె యిదిగో! నాస్నేహితుఁ డొకఁడు నాల్గు రోజులక్రింద నీ సత్ర ములోనికి వచ్చియుండె ననియు నాతనికి బస యీయక నీవు వెడలఁ గొట్టితి వనియు నాతఁడు నాతోఁ జెప్పెను. నే నీ సత్ర ములోనికి వచ్చి భోజనము చేసి బస చేసినయెడల నెంతపందె మని యాతని నే నడుగఁగా నిరువది రూపాయల పందె మని యాతఁ డనెను. అందుకొఱ కిచ్చుటకి వచ్చితిని. చెవిటివాని వలె నటించితిని. పందెమును గెల్చితిని. పందెముకొఱకు నీవ లన నెన్నితిట్లు లైనఁ దింటిని" అని చెప్పి గుఱ్ఱ మెక్కి పోయెను.

---

## 16. మహామారి.

రోగములలో భీకరము లైనవియుఁ బలువుర యమపుర మునకుఁ బంపునవియు నగు విషూచీ స్ఫోటకములను గుఱించి మీరు నేర్చుకొని యున్నారు. వీనికంటెను భీకర మైనదియు, వైద్యులకుఁగూడ వెఱపును గలిగించునదియు, ననేకకుటుంబ ములను నిర్మూలము చేయునదియు, నగు మహామారిని గుఱించి మీ రిప్పుడు నేర్చుకొనఁ బోవుచున్నారు. దీనినే యింగ్లీషున "ప్లేగ్" అందురు.

మహామారి సుమారు రెండువేల సంవత్సరములనుండి ప్రపంచమును బీడించుచున్నట్లు నిదర్శనములు గలవు. పదు నాల్గవశతాబ్దిలో లండనుపట్టనమున వ్యాపించి, జనసంఖ్యలో నాల్గవవంతును తనవాతఁ బెట్టుకొని "బ్లాక్డెత్" త్తని చెప్పఁబడు చున్న రోగ మీమహామారియే యని చెప్పుదురు. 1665-వ

సంవత్సరమున నీవ్యాధి లండనుపట్టనమున వ్యాపించి డెబ్బది వేలమందిని దననోట వైచికొన్నది.

19-వ శతాబ్దిలో నిది, రష్యా, టర్కీ, చైనా, యిండియా దేశములకు వ్యాపించి జనులను మిక్కిలి పీడించుకొని తినెను. 1896 వ సంవత్సరమున బొంబాయిపట్టనమునఁ బ్రవేశించి తొమ్మిదిమాసములలో నిరువదివేలమందిని నాశము చేసినది. క్రమముగా నక్కడనుండి యుత్తరదక్షిణములకుఁ బ్రాఁకి ప్రజానష్టమును గావించుచున్నది.

ఈ మహామారి సోఁకినమనుజుఁడు బ్రదుకుట పునర్జన్మమే. ఈరోగమునకు భయపడనివాఁ డుండఁడు. ఈరోగ మెట్లు వ్యాప్తమగుచున్నదో చూచి తద్రోగనివారణమార్గములను యోజింపవలసి యున్నది.

విషూచీ స్ఫోటకములవలెనే ప్లేగుకూడ సూక్ష్మక్రిముల వలనఁ గలుగుచున్నది. ఈ క్రిములు రోగులరక్తమందును, మలమూత్రాదులందును, మహామారి బిళ్లలందును నుండును. ఇంత యేల! రోగియొక్క సర్వావయవములందును, వానిశరీరమునుండి వెలువడు ప్రతిపదార్థమందును నుండును.

ఈ రోగ మెలుకల నతిశీఘ్రముగ నంటును. చుంచులు, క్రోఁతులు, సీమపందెల్లు, వీనికిఁగూడ నీవ్యాధి తగులును. పశువుల కంతగ రాదని చెప్పుదురు. ఉడుతలు, ఈఁగలు, చీమలు, నల్లులు, పేలు మొదలగు వానికిఁ గూడ నీరోగము వచ్చును.

పైఁ జెప్పిన ప్రాణులు రోగముతగిలి చచ్చిపోఁగా, వాని కళేబరములనుండి మారిక్రిములు, మిడినల్లులమూలమున మానవ శరీరములందుఁ బ్రవేశించి, యక్కడఁ బిల్లలుపెట్టి

రోగమును గల్గించుచున్నవి. రోగులను దాకుటవలనఁగాని, వారివస్త్రముల నంటుటవలనఁగాని కూడ నీవ్యాధి వ్యాపించును. భోజన సామగ్రు లగుబియ్యము, నేయి, నూనె, బెల్లము, పెరుఁగు, పాలు, నీళ్లు, వెన్న, కొబ్బెరకాయలు, ఖర్జూరపుఁ బండ్లు మొదలగువానిని మహామారి గలదేశముల నుండి తీసికొనివచ్చి భక్షించినఁగూడ నీరోగము ప్రాప్తించును. ఈవ్యాధిక్రిములు గలవాయువును బీల్చుటవలనఁగూడ వ్యాపించును.

సాధారణముగ నీరోగమువలనఁ జెచ్చిన యెలుకలవలన మనుజుల కది యంటు నని యాధునికవైద్యశాస్త్రజ్ఞుల యభిప్రాయము. ఈరోగముచేత బాధపడుచున్నయెలుక తనకన్నములోఁజొవక యీవలికివచ్చి చచ్చునఁట. దానిశరీరమునుండి మిడినల్లులు బయలుదేఱి మానవశరీరముల నంటి కఱచును. అందువలన మహామారివిషము మన రక్తములోఁ బ్రవేశించును.

ప్లేగువిషము శరీరమునఁ బ్రవేశించిన రెండు మూఁడు దినములలో రోగచిహ్నములు కాన్పించును. శరీరమున వణఁకు పుట్టును. హెచ్చుగా జ్వరము వచ్చును. నాడి దడదడ కొట్టుకొనును. ఊపిరియాడుట కష్టము. అపరిమిత మైన తలనొప్పి కలుగును. కన్నులు చింతనిప్పులవలె నెఱ్ఱగనుండును. వమనములు వెడలును. నీరసత హెచ్చుగనుండును. కొందఱకు దగ్గు కూడఁ బుట్టును. నిద్ర తిన్నగఁ బట్టదు. చంకలోను మోఁచేతిముందఱను, గజ్జలలోను మెడమీఁదను బిళ్లలు కట్టును. ఈ బిళ్లలు గట్టిగ నుండి, సళుపుచుండును. రోగి వీనిని ముట్ట

నీయఁడు. ఆయాసముచే నెప్పుడును మూలుగుచుండును. చుట్టు పట్ల నేమి జరుగుచున్నను నది వాని మనస్సు నంటదు.

రోగచిహ్నములు కాన్పించిన 12, 16, గంటలకు జ్వరము 106 డిగ్రీలవఱకు హెచ్చును. నాలుక కమలిన ట్లుండును. ఇట్టి స్థితిలో రోగి మృతి నొందవచ్చును.

ఈరోగము వ్యాపింపకుండ మహామారి ప్రవేశించిన పట్టన మందుఁగాని, పల్లెయందుఁగాని జనులందఱును మారి టీకాలు వేయించు కొనవలెను. ఇవి పొడిపించుకొనిన వారికి రోగము వచ్చినను మరణము సంభవింపదు. ఈరోగమువలనఁ జచ్చిన యెలుకగాని మఱియొక జంతువుగాని క్రిందఁబడియున్న యెడలఁ, దత్క్షణమే యాయింటిని విడిచిపెట్టవలెను. దానికళేబర మును దగులఁబెట్టవలెను, ఆస్థలమందు నిప్పులు పోసినచో విష క్రిములు చచ్చును. సూర్యరశ్మి యింట వ్యాపింపఁజేసినను చచ్చును. ఎప్పుడును గృహమును శుభ్రముగా నుంచుకొను టయే కాక యాదినములలో బియ్యము మొదలగు భోజన సంభారములనెండఁ బెట్టించియే యుపయోగపఱుప వలయును.

మహామారికిఁ జికిత్స యంత ప్రయోజనకారి కాదు. ఐనను రోగిని గదల్పక పరుండఁబెట్టవలెను. వైద్యశాలకుఁ గొని పోయినచో రోగి నతిజాగ్రత్తతోఁ జూతురు. టీకాలు లేని వారు రోగియొద్దకుఁ బోరాదు. టీకా లున్నవారే వాని కుప చారము చేయవలెను. రోగము దాఁచిపెట్టక వెంటనే వైద్యు నితోఁజెప్పి, రోగిని వైద్యశాలకుఁ బంపవలెను. అట్లు చేసిన యెడల రోగ మంతగా వ్యాపింపదు.

---

## 17. మంచు-దాని వివిధరూపములు.

మేఘోత్పత్తిని గూర్చియు వర్షమును గూర్చియు మీరిది వఱకుఁ జేదివియున్నారు. ఇందులో మంచునుగూర్చి కొంచెము వ్రాసెదము.

తెనుఁగులో మంచని సర్వసాధారణముగా వాడుకొను పదార్థమునకు సంస్కృతములో ననేకపర్యాయ పదములున్నవి. హిమము, తుహినము, మిహిక, కుహేళిక, తుషారము, ప్రాలేయము, అవశ్యాయము, నీహారము, అనువీనికన్నిటికి మంచనియే యర్థము. కాని వివిధము లగు మంచులను దెలుపు వేఱువేఱు పదములు మాత్రము లేవు.

మంచొకప్పుడు గడ్డకట్టి యుండును. ఒకప్పుడు ద్రవరూపమున నీళ్లవలె నుండును. ఒకప్పుడు ధూమరూపమున నుండును.

### గడ్డమంచు.

వర్షజలముగాని, భూమిమీఁదనుండు నితర జలము గాని శైత్యముచేఁ బేరుకొని గడ్డమంచగును. వేసఁగిలో మీరు నీళ్లలోను సోడాలోను వైచుకొని త్రాగుమంచుగడ్డ యీజాతిమంచే. ఇది మనుష్యులు యంత్రసాహాయ్యమున నీటిని గడ్డకట్టించి సిద్ధము చేసినదిగాని ప్రకృతిలో స్వాభావికముగా నేర్పడినది గాదు.

శీతల ప్రదేశములలో నదులును సముద్రములును సరస్సులును ఘనీభవించుటవలన నేర్పడిన మంచుగడ్డలును, వర్షముతో నొకప్పుడు కురియు వడగండ్లును, స్వభావ జన్యమైన గడ్డ

మంచు భేదము లే. సంస్కృతమున వడగండ్లను "కరక" లందురు. వడఁకు, కల్లు, రెండును గలిసి వడగల్లయినది. కల్లనఁగా "ఱాయి" వడఁ కినఁగా "చలిచే వడఁకుపుట్టించునది—మంచు"

ఇవి గాక యింగ్లండు మొదలగు చలిదేశములలో శీతకాలమునఁ జిన్న పింజెలవలెఁ బైనుండి వర్షించి భూమిమీఁదఁ జిత్రమైన ముగ్గులు పెట్టినట్లు తెల్లగాఁబడు మంచొకటి గలదు. ఇదియు సంహృతజలమే కాని కొంచెము మెత్తగా నుండును. పిల్లకాయలు దీనిని దీసి పిసికి బంతులు చేసి యాడుకొందురు. దీనిని దూదిమంచు చేనవచ్చును. హేమంత ఋతువులోఁ బచ్చిక మీఁదను జెట్లయాకులమీఁదను బడి ముత్యములవలెఁ గాన్పించు నీటిమంచొకప్పు డతిశైత్యముచే గడ్డకట్టి పడును. ఈ తుషారముకూడ గడ్డమంచు లోనిదే.

గొప్పపర్వతములమీఁద నడుగునుండి కొంత యెత్తు వఱకు నడవులు పెరుఁగును. ఆపైని గడ్డియు నాఁచును బయలు దేఱును. అంతకుఁ బై ప్రదేశ మతిశీతల మగుటచే సంవత్సరము పొడుగునను హిమావృతమై యుండును. ఘనీభూతమైన మంచు, పర్వతము నెత్తిమీఁద నొక తెల్ల కుళ్ళాయిలాగున నుండును. వేఁడిమిచే ద్రవింపకుండ మంచెంతవఱకెప్పుడును గడ్డకట్టుకొనియే యుండునో యా క్రింది హద్దునకు హిమావధి యని పేరు పెట్టవచ్చును. ఈ యవధి భూమధ్యరేఖకడ 16,000 యడుగుల యెత్తుననుండి, క్రమక్రమముగా తగ్గి ధ్రువప్రాంతములందు సముద్రమునకు సరి మట్టముగా దిగును.

హిమావధి కెత్తుగా నుండు మంచుపై పొర లడుగువానిని నొక్కిబరు వెక్కువ చేయును. ఇది గాక గ్రీష్మకాలోష్ణముచేఁ

పై భాగము లింంచుక కరఁగి జలరూపముగా లోని కింకి రాత్రి చేలువచే మరల ఘనీభవించి హిమసంచయ మెక్కువగావించి బరువు మఱింత యధికము చేయును. ప్రతిశీతకాలమునను గ్రొత్తమంచు వచ్చి పూర్వమున్న దానికిభారమువృద్ధి చేసిదానినిస్థిర ముగ నొకచోటనుండుటకు వీలులేకుండఁ ద్రోయుచుండును. అంతట నీగడ్డమంచు, నదివలెఁ గ్రిందికి నిమ్నళముగ జాఱిప్రవహించును. దీనిని హిమవాహిని యని చెప్పవచ్చును.

అది యధోభాగమునకు వచ్చినప్పు డచ్చటి యుష్ణముచే గొంత కరఁగి మురికినీరుగఁ బ్రవహించును. పర్వతభాగములను బరువైనమంచు రాచుకొని వచ్చుటచేఁదత్సంబంధ పృథ్వీ పదార్థములు మంచు నంటుకొని నీటిని గలుషము చేయును. కొన్నికొన్ని చోట్లఁ దఱిమెనఁ బట్టినట్లు నున్నగనుండు పెద్ద ఱాతిబండ లుండును. అవి పూర్వమెప్పుడో యిట్టిహిమవాహినీ సంఘర్షణముచేత నే యట్లఱిగి స్నిగ్ధములైన వని యూహింపవలయును.

హిమావధి, శీతలతమములైన ధ్రువప్రాంతప్రదేశములందు సముద్రపు మట్టముననే యుండు నని చెప్పితిమిగదా. అట్టితావుల నీహిమవాహినులు సముద్రములోపలికిఁ గడుదూరము ప్రవహించును. అవి తరంగఘాతములచేతను నితరకారణముల చేతను బెద్ద పెద్ద మంచు దిబ్బలుగవిఱిగిపోవును. మంచుగడ్డలు నీళ్లకంటెఁ దేలికకనుక, నవి సముద్రముమీఁదఁ దేలి కొట్టుకొనిపోవును. ప్రారబ్ధవశమున నెప్పుడైన నిట్టిమంచుఁగొండల నడుమ నొకనావ పడినయెడల, నది యెంత పెద్దదియు దృఢమైనదియు నైనను, నలినలియై పోవును. వీనిని హిమపర్వతము

లని చెప్పవచ్చును. ఇవి పోయిపోయి సముద్రోష్ణతర ప్రాంతము లందుఁ గరఁగి నీరయి, కూడఁ గొనివచ్చినశిలాదిపదార్థములతో నచ్చట మెట్టలు వేయును.

## నీటి మంచు.

రాత్రులందు భూమి, పై వాయువుకంటె నెక్కువగఁ జల్ల పడును. అందుచేతఁ బై గాలిలోనున్న వెచ్చని నీటియావిరి నేల నున్న చల్లనిచెట్ల యాకులను బచ్చెగడ్డిని నంటి, చల్లపడి నీరయి, ముత్తెపుఁజుక్కలవలె వానిమీఁదఁ బడును. అవియే మన ముదయమున శీతకాలమందుఁ జూచుచుండు తుషార బిందువులు.

భూమిక్రక్కుచున్న వేఁడిమిని బైకిఁ బోనీయక మేఘములడ్డు పెట్టును. కనుక నవి భూమి త్వరగాఁ జల్లపడుట కడ్డములు. ఈ హేతువుచే మేఘచ్ఛన్నములైన రాత్రులకంటె నిర్మలాకాశములైన రాత్రులం దెక్కువ నీటిమంచు పడును.

## పొగమంచు.

నీటియావిరి మేఘ మెట్లగునో క్రిందితరగతి పుస్తకములోఁ జెప్పఁబడెను. జలప్రదేశములనుండికాని, స్థలభాగములందలి నీటి నుండికాని, వెచ్చనినీటి యావిరి పైకిఁబోయి శీతలప్రదేశముల నంటి వాయువుకంటెఁ దేలికయైన చిన్నచిన్న జలబిందువులుగా ద్రవీభవించి దృశ్య మగును. పెద్దయెత్తున నిట్లేర్పడిన దానిని మేఘ మనుచున్నాము. క్రిందిభాగముల నేర్పడిన దానిని బొగ మంచనుచున్నాము. అది తెల్లని పొగవలెఁ గాన్పించును గనుక దాని కట్టి పేరువచ్చినది.దట్టముగా నున్న యిట్టిమంచును మూడ

మంచేందురు. పొగమంచు భూమిమీఁదను నదులమీఁదను సముద్రముమీఁదను గూడఁ గానిపించును. ఈమంచు దట్టముగా నున్నప్పుడు సముద్రముమీఁద నెదురుగా వచ్చునవి కనఁబడకపోవుటచేఁ బడవ లొకదాని నొకటి డీకొని బ్రద్దలగుట పూర్వము పెక్కుసారులు తటస్థించుచుండెను. కాని యిప్పుడట్టి యపాయము లు జరుగకుండ నుపాయము లనేకము లేర్పఱచుకొని జనులు జాగ్రత్త పడుచున్నారు.

---

## 18. ధ్రువకథ.

### మొదటిభాగము.

ఆకాశమందుత్తరమునఁ గాన్పించు స్థిర నక్షత్రములలో నొకదానిని ధ్రువనక్షత్రమందురు. దిక్ప్రదర్శకయంత్రములు లేని పూర్వకాలములలో, నావికు లీ నక్షత్రమును బట్టియే రాత్రులందు సముద్రముపైఁ పడ యోడల నడపుకొనెడువారు. పుణ్యాత్ముఁడగు నొక రాజకుమారుఁడు తన తపోమహిమచే నీ నక్షత్రపదమందినాఁడని హైందవ పురాణములలో నున్నది. మహాపురుషులును మహామహిళామణులును నాకసమందట్టి యున్నతస్థానము లొందియున్నట్లు మనపూర్వులు నమ్మెడువారు. సప్తర్షిమండల మట్టిదే, యరుంధతీ నక్షత్ర మట్టిదే. ఈ విశ్వాసము మనవారికే కాక ప్రాచీన గ్రీకులకుఁ గూడఁ గలదు. వారి పురాణకథలలోఁ గూడఁ గొందఱు వీరపురుషులును వీరకాంతలును దారకలైనట్లు వర్ణింపఁబడి

యున్నది. విష్ణుపురాణస్థమైన కథ ననుసరించి, యందలి కొన్ని చక్కని పద్యములెత్తి వ్రాయుచు, నీపాఠములో ధ్రువచరిత్ర సంగ్రహముగాఁ జెప్పుచున్నాము.

ఆదిమనువు స్వాయంభువుఁడు. అతనికిఁ బ్రియవ్రతోత్తాన పాదులను నిరువురు కొడుకులు గలిగిరి. ఆ యుత్తానపాదుఁడే భాగవతోత్తముఁడగు మన ధ్రువుని తండ్రి.

ఉత్తానపాదుఁడు భూవలయ మేకచ్ఛత్రముగా, జనప్రియుఁడై యశస్సంపన్నుఁడై, పరిపాలించుచుండెను. అతఁడు సునీతి సురుచియను నిరువురు భార్యలఁ బెండ్లియాడెను. సునీతి యనఁగా మంచి నీతిగలది, సుశీల. సురుచి యనఁగా మంచిశరీర కాంతిగలది, సుందరి. వారి గొప్పతనములు వారి పేరులవల ననే స్ఫురించుచున్నవి. అందు సునీతికి ధ్రువుఁడును సురుచికి నుత్తముఁడునుబుట్టి, సమరూపరేఖా విలాస వివేకములతోఁ బెరుఁగుచుండిరి.

ఒకనాఁడు రాజు, తొడపై నుత్తమునిఁ గూరుచుండఁ బెట్టుకొని సురుచిఁ బ్రక్కనుంచుకొని, సింహాసన మధిష్ఠించి మునులతోఁ గొలువుండఁగా, ధ్రువుఁడుచూచి తానుగూడఁ దండ్రి యంకపీఠమెక్కవలయునను నాశతోఁ జెంతకేగి తన చేయిచాఁచెను. అదిచూచి సురుచి సపత్నియెడ ద్వేషమాత్స ర్యములు పట్టఁజాలక, మర్యాద చూడక, వెఱవక, రాజ సమ్ముఖమున ధ్రువ బాలకునితో నిట్లు పలికెను:—"ఈ సిం హాసన మెక్కుటకు నాసుతుఁడర్హుఁడు గాని నీవర్హుఁడవుగావు. ఈరాజు కూర్మిపత్నినై విరాజిల్లుచున్న నాకుఁ దాను సవతినని గర్వించి నీతల్లి నాకడకువచ్చి యేమేమో వాఁగుచుండును.

ఆ కూఁతలు నేను విన(జాలను. దానిని నేనాడఁజెల్లునుగాని నన్నది యాడఁగూడదు. ఆ మాటలు నాకేకాక యీపతికిఁ గూడ రుచింపవు. ఉత్తానపాదుఁడెక్కిన యుత్తమ సింహాసన మందుండఁదగినవాఁడు త్తముఁడే, వానికంటెను నీవు త్తముఁడ వగుదువేని యప్పుడు చూచుకొనవచ్చును." అట్లని యూర కుండక సవతికొడుకు రెట్టఁబట్టిపొమ్మని వెనుకకుఁ ద్రోసి వీఁపుపైఁ జఱచెను. సురుచి ప్రేమ సుతప్రేమను మించివైచి నందున, రాజు బెల్లముగొట్టిన ఱాయివలె వాగ్బంధమంది యూరకుండెను.

అయవమానమును భరింపలేక ధ్రువుఁడు కన్నుల నీరు పెట్టుకొని గిఱుక్కున మరలి మాతయొద్దకేగి జరిగిన వృత్తాంత మంతయు నామెతో వెక్కి వెక్కి యేడ్చుచుఁ జెప్పకొనెను. తల్లి తన పైఁటచెఱఁగుతో బిడ్డకన్నులు దుడిచి, శిరము మూర్కొని, కౌఁగిటఁజేర్చి, యేడుపుడిపి, చెమ్మగిల్లిన కన్ను లతో గద్గదస్వరమున "నాయనా! సురుచి చెప్పిన దంతయు నిజము, విభుఁడు ప్రియపడి యామెకు వశుఁడైయున్నాఁడు. ఆచనవు పాపాత్మురాలనగు నాకు లేదు. సురుచి సౌభాగ్యవతి గనుక సుతునితోఁ దాను పతి మన్ననలు పడయుచున్నది; మందభాగ్యులమగు మన కవియెట్లు లభింపఁగలవు? తండ్రీ! యింతకష్టపడుటకు నీవు దాసీప్రాయురాలనగు నాకడుపున నేల పుట్టితివి?" అని తనయుతోఁ బలికి యిఁక దుఃఖము పట్టఁ జాలక యెలుఁగెత్తి యేడ్వఁ జొచ్చెను. పసివాఁడైనను ధ్రువుఁడు తల్లి నూరార్చుచు నిట్లుపలికెను. "అమ్మా! యేల యేడ్చెదవు? ఎవరివలన వారికీ సిరిసంపదలు వచ్చినవో యతఁ

డనుగ్రహించి యవి మనకుమాత్రమిూయఁడా? వారి సుఖములు క్షణభంగురములు. నేనువెళ్లి తపముగావించి దేవతలకేనియు సంపాదింపనలవిగాని యత్యున్నతపదము సంపాదించి, యది యాచంద్రతారకముగా ననుభవింతును. నీవ్వాఁడిల్లి నన్నాశీర్వదించి పంపుము.'' అని రాజసుతుఁడు పురి వెడలిపోయి యొకచోఁ గృష్ణాజినంబులపైఁ గూర్చుండిన సప్తమహర్షులను జూచి నమస్కరించెను. "బిడ్డా! నీవెవరవు? ఇట్లొంటరిగా నేలవచ్చితి?''యనివారడిగిరి. ధ్రువుఁడుముద్దులొలుకు పలుకులతోఁ దన్నుఁగూర్చియుఁ దన తల్లిదండ్రులఁగూర్చియు విన్నవించుకొని "నేను దపము చేయఁబోవుచున్నాను. నా పూర్వ పుణ్యమున నాకుమిూదర్శనలాభము కలిగినది'' అని చెప్పెను. అంతట మును లందఱు నత్యాశ్చర్యపడి "అయి దేండ్ల యర్భకుఁడవు, మోహాన సుకుమారమూర్తివి, మేనవ్యాధులేమియులేవు, తలిదండ్రులుగలిగిన ధన్యాత్ముఁడవు. నీవెక్కడఁ? దపస్సెక్కడఁ? దపఃఫలమెక్కడ? నీవెట్టికుట్టి బుద్ధులుమాని శీఘ్రముగా నింటికిఁబొమ్ము'' అని మందలించిరి. అంతట ధ్రువుఁడు తన తండ్రి యెదుటను మహామునుల యెదుటను దనసపతితల్లిచేసిన పరాభవము మున్నగు వృత్తాంతములన్నియు సవినయముగాఁజెప్పి "నేఁదపస్సుచేయఁ గృతనిశ్చయుఁడనై యున్నాను. నామనసు మరలదు. మిూపాదములపైఁ బడినాను. ఉన్నతపద ప్రాప్తి నాకుఁ గలుగు నుపాయము తమరు నాకనుగ్రహింపక తప్పదు'' అని మనసు కరఁగు మాటలతోఁ మనవి చేసికొనెను. దానిపై మునులు "ఔరా! రాజనందనుని చలము! బనరమున బాణములకుఁ జలింపని క్షత్రియ బాలకుని మనసు, విమాతయొక్క

వికృతోక్తుల కెట్లు నొచ్చివికలమై పోయినది!" అని యను కొని "బిడ్డా! మీ వంశకర్త లెవని సేవించి మహనీయమహిమాన్వితులైరో, మే మెవరి నుపాసించి యాధిక్యమొందితిమో, యాభుక్తిముక్తి ప్రదాతయగు వాసుదేవు భజించి నీవును నభీష్టసిద్ధినొందుము," అని పలికి, బాలకునకు "ఓంనమో భగవతే వాసుదేవాయ" యను ద్వాదశాక్షర మంత్ర ముపదేశించి, తపశ్చరణ ప్రకారముఁ దెల్పి కృతార్థుఁడవు గమ్మని దీవించిరి.

---

## 19. ధ్రువకథ.

రెండవ భాగము.

ధ్రువుఁడు మహర్షులకు నమస్కరించి చని వారి యుపదేశ విధులు మఱవక చిత్తము యోగాయత్తముచేసి కాళిందిలోఁ గృతస్నానుండై మధువనంబను మహా పుణ్యభూమియందు

గీ. షోడశాబ్దవయోమూర్తి • సుందరాంగు,
శంఖచక్రగదాఖడ్గ • శార్ఙ్గహస్తుఁ,
బీతకౌశేయు, లక్ష్మీసమేతవక్షు,
నాదిదేవుని విష్ణుని • నాత్మఁదలఁచి (వి. పురా 2-41

తదేకాగ్ర మనస్కుఁడై శరీరాభిమానంబు సమూలంబుగాఁ జంపుకొని ఘోరతపస్సు చేయుచుండెను.

అట్టి మహానుభావులు తపస్సు చేయునప్పుడు తన పదమునకు భంగము గలుగునేమో యను భయముచే దేవేంద్రుఁడు

తత్తపోవిఘ్నము చేయుటకుఁ బ్రయత్నించు చుండును. ఇప్పుడు నట్లే బాలకుని తపము భంగముచేయుట కింద్రుఁడు భూతప్రేత పిశాచరాక్షస గణములఁ బిలిపించి ధ్రువుని భయ పెట్టుఁడని పంపెను. అంతట వారచటికిఁ జని కొందఱు క్రూర సర్పములై బుసకొట్టుచుఁ గఱవవచ్చిరి, కొందఱు సింహశార్దూలాది భీకర మృగంబులై బొబ్బరించుచుఁ బైఁబడఁబోయిరి, కొందఱు కొఱివి దయ్యములై కూఁతలుపెట్టుచు వెఱపింపఁ జొచ్చిరి. ఎవరేమి చేసినను ధ్రువుఁడు చలింపక ధ్యాన నిమగ్నుఁడై యే యుండెను. అంత నొకమాయావినియైన రాక్షసి సునీతి రూపధారిణియై యతనిపాలికివచ్చి బాష్పపూరిత లోచనయై గద్గద స్వరంబుతో నిట్లు పల్కెను:—

ఉ॥ అన్న! కుమారచంద్ర! తగు • నయ్య! నిరంతర దుఃఖవార్ధిలో
నన్నిటు ముంచి యీవిధము • నన్ భయదాటవులందపంబు సే
యన్నడ తెంచి; తిట్టినను • నవ్వులు మెత్తురె? పిన్నబిడ్డలన్
వెన్నుఁడు మెచ్చి యెన్నఁడొస • వె న్వరము ల్నినుబోంటి వారికిన్?

(వి. పురా 2-50

ఉ॥ అందని పంటికేమిటికి • నఱ్ఱునిగిడ్చెదు? విష్ణుఁడున్న యా
కందువ చందమామగుట • కల్లను; మీవనిగట్టిపెట్టి, నా
డెందములోని యుమ్మలిక • డిందుపడం జను దెమ్ము! పోద మిం
పొందసమస్తభోగముల • నొందెదు తండ్రికి వేడ్క సేయఁగన్.

(వి. పురా 12-8

శా॥ అరంబండిన పైరువోవిడిచి దు ♦ ర్వ్యాపార చిత్తంబుతో
ఘోరారణ్యములోన మోడునఱక ♦ న్గొడ్డండ్లు సేయించిన,
ట్లీరాజ్యంబు సమస్తము న్విడిచి, నీ ♦ వేలా తపోనిష్ఠకుం
కేరన్వచ్చితి భావికాలఫలము ♦ ల్చింతించి సత్పుత్రకా! (వి. పురా2-52.

శా॥ బాలక్రీడలఁ దల్లిదండ్రులనద ♦ భ్రప్రీతి నొందించి, యి
చ్ఛాలంకార విహారముల్సలిపి, పూ ♦ జ్యంబైన రాజ్యస్థితుల్
చాలంగైకొని, వార్ధకంబునఁదప ♦ స్సంపత్తిఁ గైకొంట గా
కేలా దేహము దుఃఖపెట్టెదవు తండ్రీ చిన్నప్రాయంబునన్?
(వి. పురా2-53

ఉ॥ దట్టపులజ్జతో, సవతి ♦ తల్లిదురుక్తులు నెమ్మనంబునం
బెట్టి, విరక్తిపుట్టి, పటు ♦ భీషణవృత్తిఁ జరింపనేల? నీ
కిట్టిచలంబు చాలఁగల ♦ దేని, మహీతలమెల్ల నేలఁగాఁ
బట్టము గట్టునేర్పునకు ♦ పాయమెఱింగితి, రమ్ముపుత్రకా! (వి పురా 2-54

శా॥ నోముల్పెక్కులు నోఁచి, యుజ్జ్వలతపో ♦ నుష్ఠానకర్మంబులు
ద్దామప్రీతి నొనర్చి, సత్సుతునిఁగాఁ ♦ దండ్రీ! నినుంగాంచితిన్
నామాటల్వినను, రాజ్యభోగములకు ♦ న్రమ్మింక; రాకుండినన్
నీమీఁదంబడి ప్రాణముల్విడిచెద ♦ న్నిక్కంబుగా నిచ్చటన్. (వి పురా2-55

ఇన్నిమాటలును శిలాప్రతిమకుఁ బెట్టిన చక్కిలిగింతలైనవి. ఇంద్రుఁడు మఱికొన్ని మాయలు పన్నించి నాఁడు. అవన్నియుఁ గూడ నౌత్తానపాదియందు, దుష్టునకుఁ జేసిన యుపకారములవలె, విఫలములైనవి. బిడౌజుఁడంత బెగడొంది వైకుంఠము నందున్న శ్రీమహావిష్ణువు కడకేగి "మహాప్రభూ!

చెక్కుమీఱిన వసగాఁడు ధ్రువశిశు వుగ్రతప మాచరించు చున్నాఁడు. అది భంగముచేయుటకే నెన్నో పన్నికలు పన్ని విఫలమనోరథుఁడ నైతిని. ఇంకూరకున్న నతఁడు నీకృపవలన నమరపదంబు లన్నియుఁ జూఱకొనుట తప్పదు. రక్షింపుము'' అని వేఁడుకొనెను. అంతట శ్రీహరి చిఱునవ్వునవ్వి "పాకశాసనా! భయపడకుము. మీరాజ్యములు గీజ్యములు నతఁడుగోరఁడు, వాని యభీష్టము నేనెఱుఁగుదును. ఎవరికిని బాధలేకుండ నాభక్తుని కోర్కె దీర్చి పంపెదను. నీవుపోయి నిశ్చింతుఁడవై యుండుము" అని చెప్పి యింద్రునిఁ బంపి, ధ్రువునకు:—

సీ॥ వారివాహముఁబోలు • వక్షస్థలంబున
నిందిరాశంపపెం • పొందుచుండ,
భూమిపద్మమువంటి • బొడ్డుఁదామర యందుఁ
గమలజచంచరీ • కంబు మెఱయఁ,
గల్పవృక్షంబు శా • ఖలమించుబాహుల
నరిశంఖఫలయుగం • బంద మొందఁ,
బరిపూర్ణచంద్రుతోఁ • బ్రతివచ్చుమోమున
దరహాసనవసుధా • ధారలొలుక,

గీ॥ నభముతోఁ బ్రతియైనస • న్నడుమునందుఁ
గనకకౌశేయ సాంధ్యరా • గంబు మెఱయ,
భక్తలోకైకరక్షణో • పాయధుర్యుఁ
డై జనార్దనుఁడపుడుప్ర • త్యక్షమయ్యె॥ (వి. పురా 2-67

ప్రత్యక్షమై "కుమారా! నీతపోమహిమకు మెచ్చితిని. నీకు వలయు వరంబులు వేఁడుకొను మిచ్చెదను" అని వాత్సల్యరస మొలుకఁబలికెను. ఆపలుకులువిని, కనులు దెఱచి, లోపల నింత



వఱకు నిడుకొని యోగదృష్టి ధ్యానించుచున్న సచ్చిదానంద మూర్తి బాహ్యదృష్టికిఁ గాన్పించుటచే, భగవత్సాక్షాత్కార మైనదని తెలిసికొని ధ్రువుఁడు, మహావినయ భయభక్తులతో

స్వామికి సాష్టాంగ దండప్రణామంబు లాచరించి లేచి నిలఁబడి కరములు మొగిచి యిట్లనియె.

కం॥ వరమిచ్చెదనని లక్ష్మీ
వర! వచ్చితి; నాకునిన్ను ♦ వర్ణింప మనో
హరమైయున్నది; యఘసం
హరమగు వాక్ప్రతిభ నాకు ♦ నందింపఁగదే! (వి. పురా. 2-73

అనుటయు దయామయుఁడగు పుండరీకాక్షుఁడు సర్వోప నిషద్రహస్య వచస్సంఘాతంబగు తనశంఖం బాబాలుమస్తకం బుపై మోపిన, శిశువు మనంబు చిత్ప్రకాశ మహిమంబయ్యె ను. అంతట ధ్రువుఁడు జలజాసనాదులకైన నలవిగాని రీతిని సర్వేశ్వరు మహిమంబు వర్ణించుచు వరంబేమియుఁ గోరకుంట చూచి శ్రీహరి "బిడ్డా! నీస్తోత్రంబువలన సంతుష్టుఁడనైతిని. నాదర్శనంబెన్నఁడు వృథగాదు. వరంబుఁ గోరు" మనిన, బాలుండు పరమేశ్వరున కిట్లనియెను.

కం॥ సర్వప్రాణులయందును
సర్వాంతర్యామివైన ♦ సర్వేశుఁడవున్
సర్వజ్ఞుండవు నగు నీ
కుర్వీధర! కోర్కె సెప్ప ♦ నుచితమె కృష్ణా!॥ (వి. పురా. 2-81

శా. ఐనంజెప్పెద చిత్తగింపుముమహా ♦ త్మా! తంద్రిసింహాసనా
సీనుండై కొలువున్న నేనచటికిం ♦ జేరంగ నాసించితిన్;
దానింగన్గొని మాఱుఁదల్లికినుకన్ ♦ దట్టించి, యిందుండ మ
త్స్థానుండర్హుఁడు గాని నీవుతగ, వం ♦ చున్నన్నుఁ బల్కెన్వెసన్
(వి. పురా. 2-82

శా. ఏనవ్వాక్యము లాత్మలోనిలిపి, లో • కేశుండవై నట్టి నీ
చే, నత్యున్నతమైన దివ్యపదము • క్షీణప్రభావంబునుం
బూనవ్వచ్చితి ; నాకునవ్వరమునం • పూర్ణంబుగాఁ జేయవే !
ధ్యానారాధమునీంద్ర హృత్కమలస • ద్మా ! పద్మపత్రేక్షణా !
(వి. పురా. 2-83

పరమేశ్వరుఁ డంతధ్రువున కప్పటిజన్మస్థితికిఁ గారణంబగు నతని పూర్వజన్మవృత్తాంతంబుఁ దెల్పి, శైశవంబులోనుండి యును దన యందనన్య సామాన్యంబగు భక్తిగలిగియుంటకుం బ్రశంసించి యిట్లు పలికెను.

కం॥ త్రిదశగ్రహతారాముని
పదములకన్నిటికినుపరి • భాగంబునఁ, బెం
పొదవుధ్రువస్థానంబు
న్నది; యచ్చోటిత్తునీకు • నరవరపుత్రా ! (వి. పురా 2-89

ప్రజా సంతుష్టికరముగాఁ గొంతకాలము పరిపాలనము చేసి, తరువాత మాతృసహితుఁడవై నీవామహోన్నత పదమున నాకల్పాంత ముడురూపమునఁ బ్రమోదభరితుఁడవై యుండుము. తదనంతరము నిన్నుముక్తుఁ గావించినాలోఁ గలుపు కొందును.'' అట్లాశాసించి భగవంతుఁ డంతర్థానము నొందెను.

అంతట రాజపుత్రుఁ డింటికేగి, జనకులకుఁ జక్షురుత్సవము గావించి, పెండ్లియాడి, సర్వజనాహ్లాదకరముగాఁ గొంత కాలము రాజ్య పరిపాలనమొనరించి, సంతానవంతుఁడై, పర్యాప్తముగాఁ బ్రపంచసుఖములన్నియు ననుభవించి, పిమ్మట నొకనాఁడు, సురసిద్ధ సాధ్యగంధర్వాదులు సంస్తుతులు సల్పు

చుండఁగాఁ, దల్లితో నొకదివ్యవిమానమెక్కి, పరమేశ్వరుఁడు ప్రసాదించిన పరమసుఖస్థానమునఁ బ్రవేశించెను. దివియందు వారిరువురును నేఁటివఱకు దేదీప్యమానముగాఁ గాన్పించు చున్నారు.

---

## 20. కూచుక్కు లేక ఇండియారబ్బరు.

పెన్సిలుతో వ్రాసి రబ్బరుముక్కతోఁ జెఱుపుచుండుట మీరు ప్రతి నమును జేయుపనియే కదా. ఇంగ్లీషుభాషలో 'రబ్' అనఁగాఁ జెఱుపుట, తుడిచివేయుట. అట్లు చేయునది 'రబ్బరు.' మొదట ఇండియాలోఁగాని తత్పరిసరద్వీపములలోఁ గాని యీపదార్థమిచ్చు చెట్లు కనఁబడి యుండవచ్చును. అందుచే నావస్తువు నిప్పటికి నిండియారబ్బ రని చెప్పుచున్నారు. దాని కే "కూచుక్కు" అని మఱియొక పేరు.

పెన్సిలుగీటు తుడిచివేయుట యొకటే రబ్బరుప్రయోజనము గాదు. దానియుపయోగము లనేకములు. ప్రత్యేకము దాని తోఁగాని యదియు గంధకమును గరఁగించి చేసిన "వల్కనై" ట్టను పదార్థముతోఁగాని, యెటుత్రిప్పిన నటు తిరుగు గొట్ట ములు, పాదరక్షలయడుగట్టలు, పట్టెలు, పటకాలు, సాఁగు నట్టిబట్టలు, తాఁకుడుదెబ్బవలన రైలుబండ్లు చెడిపోకుండ వాని కమర్చు 'బఫరు' లు, రింగులు (చుట్టలు) క్రికెట్టుబంతులు, టెనిసుబంతులు, చేజోళ్లు, గదులలోఁ గ్రింద నమర్చురాలవంటి పలకలు, అక్షరపు టచ్చులు, కచ్చేరీలలోని తేదీముద్రలు, ఇంక నెన్నెన్నో పదార్థములు చేయుదురు. విద్యుచ్ఛక్తి చెదరి

పోకుండ టెలిగ్రాఫుతీఁగలు మున్నగువానిని దానితోఁ గప్పుదురు. ప్రకృతిశాస్త్రబోధన సామగ్రులును, చికిత్సోపకరణములును, బెక్కులు దానితోఁ జేయుదురు. భాగ్యవంతుల గుఱ్ఱపు



బండ్ల చక్రములయొక్కయు, మోటరుబండ్ల చక్రముల యొక్కయుఁ జుట్టుకమ్ములు (టైరులు) దానితోనే చేయుదురు. పిల్లలాడుకొను బొమ్మ లనేకములు రబ్బరుబొమ్మలే. కలపు గొట్టములు, దువ్వెనలు, బొత్తాములు ఇట్టివస్తువు లనేకములు వల్కనైట్టుతోఁ జేయుదురు.

రబ్బరు చేతికి మెత్తగా నుండును. ఎటు వంచిన నటువంగును, విఱుగదు. లాగినప్పుడు సాఁగును. వదలినప్పు డెప్పటి

యట్లు ముడుఁచుకొనిపోవును. నీటికిఁ దడియదు. సులభముగా నంటుకొని తెల్లమంటతోను మిక్కిలి పొగతోను మండును. కాలునప్పుడు గాటువాసన గొట్టును. శైత్యమువలన బిరుసెక్కి సాఁగునట్టి గుణమును గోల్పోవును. ఉష్ణముచే మెత్తపడి, పోయిన గుణమును దిరుగఁ దెచ్చుకొనును. రబ్బరు వెచ్చచేసి సాఁగఁదీసి పట్టుకొని యట్టే చన్నీళ్లలో ముంచి పైకిఁ దీసి విడిచిపెట్టిన, నా పట్టుననే యుండును, సంకుచింపదు, కాని దానిని మరలవెచ్చచేసి లాగి విడిచిన యథాప్రకారము ముడుఁచుకొనిపోవును.

రబ్బరు నీళ్లలోఁగాని సారాయిలోఁగాని కరఁగదు. కర్పూరతైలములోఁగాని తారునుండి తీసిన "నాఫ్తలీ" న్నను ద్రావకములోఁగాని, యుంచినయెడల దానిలోఁ గరఁగిపోవును. నాఫ్తలీనులో రబ్బరును గరఁగించి యది బట్టలకుఁబూసిన, నాబట్టలలో నీరుచొరదు. వానకుఁ దడియని గొడుగులు, చొక్కాలు, టోపీలు, బండిగూఁటికప్పులు, మొదలగునవి యిటు చేసినవే. ఈరీతి వస్త్రాదులు చేయుట "మేకింటాషు" అనునతఁడు మొట్టమొదటఁ గనిపట్టినాఁడు. కనుక నిట్టి నీరు దిగని బట్టల నిప్పటికిని మేకింటాషు లందురు.

ఇండియారబ్బరు, పాలుగాఱు వివిధజాతి వృక్షములనుండి చేయఁబడుచున్నది. వానిలో ముఖ్యమైనవృక్షము బొమ్మలోఁ గనఁబఱిచినాము. రబ్బ రిచ్చు మొక్కలు మన దేశము యొక్క యీశాన్యదిశనుండు ఆసాములోను, దక్షిణామెరికాలోను, ఆఫ్రికాలోను హిందూదేశప్రాంతమందలి ద్వీపసమూహములలోను విశేషముగాఁ గన్పట్టును.

సమశీతోష్ణభూములం దుండు మొక్కలు విశేషముగా రబ్బరుపాల నీయఁజాలవు. ఉష్ణప్రదేశమందలిచెట్టు రబ్బరు హెచ్చుగా నిచ్చును.

కొన్నిరబ్బరుచెట్లు రమారమి 50 అడుగులయెత్తువఱకుఁ బెరుఁగును. కొన్ని పొదలకంటె నెక్కువగా నుండవు. కొన్ని తీఁగలవలె నుండును.

రబ్బరుపాలు తీసి యొకపాత్రములోఁ బెట్టియట్టే యుంచిన యెడలఁ గొంతసేపటి కడుగున నీటివంటి పలుచని రసముచాల దిగి, పై కిమీఁగడగట్టిన పదార్థము తేలును. ఈపదార్థమును దేవి, యొకపాత్రలో నుంచినయెడల నదిగడ్డకట్టి, కరఁగినతారుముద్ద వలెఁ గేవల ఘనపదార్థముగాక కేవలద్రవపదార్థము గాక యుండును. ఇదియే రబ్బరు వస్తువులు చేయుటకు మూలపదార్థము.

చెట్లనుండి పాలుతీయు విధములు రెండు చెప్పెదము.

చెమ్మకాలము పోయినతరువాతఁ బాలుదీయువాఁడు తోఁటలోనికిఁ బోయి, పరిపక్వమై సిద్ధముగా నున్నచెట్లు వెదకి, వాని మొదటఁ గొన్నికుండపిడుతలు పెట్టియుంచును. తరువాతఁ జిన్న చేగొడ్డలి యొకటిపుచ్చుకొని, తనకందినంత యెత్తున, నంఁగాదాదాపుగా రెండు గజములయెత్తున లోఁతుగా నంగుళము వెడల్పునఁ బైకిఁ గ్రిందికి నొకగంటి పెట్టును. వెంటనే యొకపిడుతఁ దీసి తడి జిగటమట్టితో దానిని నాటు క్రిందఁ జెట్టున కంటించును. ఇట్లే చెట్టుచుట్టును నాలుగైదంగుళములదూరమున నాయెత్తుననే నటికి యేనుఁగుల కడ గంటలయొడ్డాణమువలె నన్ని పిడుతలుఁ దగిలించును. సాధా

రణముగా మూఁడుగంటలకాలములో గంట్లనుండి పాలన్నియుఁ బాత్రములలోనికిఁ గాఱును,

మఱునాఁడేగి మరల నట్లే చెట్టుచుట్టు వరుసగాఁ బైవానికి నాలుగంగుళముల క్రిందఁ గ్రొత్త గంట్లు వెట్టును. ఈవరుసక్రింద మఱియొకవరుస, దానిక్రిందమఱియొకటి, యీ ప్రకారము వృక్షమూలమువఱకు నాట్లునాటి, పాలుదీయును.

ఈపిడుతలలోని పాలన్నియుఁ జివరనొక పెద్దగోలెము లోఁ గుమ్మరించును. ఇది మొదటివిధము.

ఒక గజమెత్తు వఱకుఁ బైబెరడు డొలిచివైచి యడుగున సగముచెట్టు చుట్టును, జిగురుమట్టితో నొక చిన్నకాలువగా నేర్పఱచి, యొకమూతి చేసియుంచును. ఆమూతిక్రిందనొక పెద్ద పాత్ర పెట్టును. తరువాత బరడుతీసిన స్కంధభాగమునకు గొడ్డటితోఁ బెక్కుచోట్లలోఁతుగా గంట్లు పెట్టును. అంత నాయన్ని నఱకులనుండియు విశేషముగాఁ బాలు వచ్చి కాలువలోనికిఁ గాఱి, యందుండి పల్లముగా నున్న మూతితుదకు వచ్చిపాత్రములోఁ బడును. ఇది రెండవమార్గము.

ఈ రెండుమార్గములఁ గనఁబఱుచుపటమును జూడవలయును.

ఈపాలలో నీటిపాలు విశేషముగా నుండు నని యితఃపూర్వము చెప్పితిమికదా, ఆనీరంతయుఁ బోయినఁగాని రబ్బరు రానేరదు. ప్రయోజనము ననుసరించి వివిధాకారములుగల పాత్రలలోఁ బాలుపోసి యిగురఁ బెట్టుదురు. క్రమక్రమముగా నీరంతయునావిరిగాఁ బోయిరబ్బరు క్రింద నిలుచును. కొందఱు సెగమీఁదఁ బెట్టి వేఁడిపొగ నీపాలకుఁ దగుల నిత్తురు. దీని

వలనఁ జెమ్మ బాగుగా నాటిపోవునుగాని, రబ్బరునకు ధూమ్రవర్ణము వచ్చును.

పాలనుండి 'బిస్కట్టు' అని చెప్పరొట్టెరబ్బరు చేయు విధము చెప్పెదము. దాని దళసరి నాలుగైదంగుళము లుండును. ఈరూపముననే రబ్బరు సాధారణముగా నెగుమతి చేయుదురు. బొమ్మ చూడుఁడు.

సరియైన కఱ్ఱ నొకదానిని దీసికొని పలుపుగా నున్న కొనకుఁ బా లంటుకొనకుండఁ దొలుత మెత్తని జిగటమన్ను పూయుదురు. పూసినతరువాత దానిమీఁద రబ్బరుపాలు పోయుదురు. పోసి కొబ్బెర పెంకులవంటి పెంకులతోను గఱ్ఱల తోను మండుచున్న పాత్రరూపమైన పొయిమీఁద దానిని గామతోఁ బట్టుకొని కాఁతురు. ఉష్ణమువలన నొకప్రక్క యాఱఁగానే, రెండవప్రక్కఁద్రిప్పి సెగమీఁదఁబట్టుదురు. అదియు నాఱినపిదప మఱికొన్నిపాలను బలక మీఁదఁబోసి రెండువైపులును గాఁతురు. ఇ ట్లనేక పొరలుగా రబ్బరు తయారైనతరువాత నంచులుకోసి యంతయు నూడఁదీయు దురు. రొట్టెవలె మందముగా నుండును గావున నీరబ్బరచ్చు నకు రొట్టెరబ్బ రను పేరు వచ్చినది.

కాని యీరబ్బరులోఁగూడ మట్టియు నితర మలిన పదార్థ ములును గలిసి యుండును గాన,దీనిని శుద్ధిపఱుపవలయును. నిప్పు లోఁబెట్టుద మన్ననదియంటుకొనితగులఁబడును. నీళ్లలో నానవేసి కడుగుద మన్న, నీళ్లు దాని నంటి లోనికి దిగవు.



కనుక దానిని జిన్న చిన్న చీలికలుగాఁ జీల్చి యంత్రసాహాయ్యమునఁ గడిగి పిమ్మట నీళ్లలోఁ బడవేయుదురు. అంతట,రబ్బరును దానిలోనికల్మషములును విడిపోయి వేఱువేఱుగానుండును. అప్పుడు స్వచ్ఛమైన రబ్బరును దీసి వేఁడినీటియావిరితో నిండిన గదిలో నుంచి యాఱఁబెట్టుదురు. తరువాత రబ్బరుఖండముల నొకస్థూలయంత్రములోఁ బెట్టి నొక్కి మరల దళసరి యచ్చులుగాఁ జేయుదురు. ఎక్కడను వాయురంధ్రములుగూడఁ గనఁబడనంతనేర్పుతో నీయచ్చుల నొత్తుదురు.

పలుచేని ఱేకురబ్బరు గావలసినవారికి యంత్రసాహాయ్యమున నాయచ్చులను సూక్ష్మముగా నెంత సన్నపొరలుగానైనఁ గోయుదురు.

అన్ని రబ్బరులలోను ప్రశస్తమైనదియు మిక్కిలి వెలఁ దెచ్చునదియు నగునది బ్రెజీల్ దేశమందలి "పేరా" రబ్బరు.

అన్నిటికంటెఁ దక్కువదై చవుకగా నుండునది "సిద్దిబుఱ్ఱ" రబ్బరు (Negro-bead Rubber). పనికిమాలిన రబ్బరుముక్కలకుఁ, బాత్రలయడుగునను బ్రక్కలను నంటుకొని దిగఁబడిన రబ్బరుపూసలకు, నీపేరు వచ్చినది.

రబ్బరుపలకలను సన్నపట్టెలక్రిందఁ గోసి పెక్కుసారులు వానిని జెల్లగా నున్నప్పుడు సాఁగఁదీసి యుష్ణోదకములోఁ బెట్టి యెప్పటిస్థితికి రానిచ్చుచుండిన యెడల, నవిమిక్కిలిసత్తువగలిగి బాగుగా సాఁగును. అట్టిరబ్బరు 'టేపు' రబ్బ, రందురు. టేపు రబ్బ రనఁగాఁబట్టెడవలె నుండు రబ్బరన్నమాట. దీనినే వెడల్పు తగ్గించి సన్నగాఁబొడుగుగా దారములవలెఁ గోసినయెడల, దానిని తీఁగ రబ్బ రందురు.

కొన్నికొన్ని పదార్థములు గలిపి చేసిన, రబ్బరునకు నానావిధములైన రంగులువచ్చును. దీపపుఁగాటుకఁగలిపినయెడలనల్లరంగు వచ్చును. 'జింకాక్సైడ్డు' కలిపినఁ దెల్లగా నుండును. 'ఆర్సెనిక్సల్ఫైడ్డు' పసుపు రంగుఁ దెచ్చును. "ఆంటిమొనీ సల్ఫైడ్డు"ను ఎఱ్ఱ యినుపత్రుప్పును గలిపిన నెఱ్ఱరంగునిచ్చును.

పూర్వ మడవులలోఁ బెరుఁగురబ్బరుచెట్లనుండియే రబ్బరు చేసెడువారు. కాని దాని బహూపయోగములఁ జూచి వానిని నాటి తోఁటలువేయుచున్నారు. అట్టి తోఁటలవలన రాబడి విశేషముగా వచ్చుచున్నది.

కొందఱు మొదటనాఱుపెంచి తరువాతదానిఁ దీసివేఱుచోట దూరదూరముగా నొక్కొక్కముక్కగా నూడ్తురు. కొందఱు

గింజెలు నాటి మొక్కలైన తరువాత వానిని గడల్పకయే మట్టుననే పెరుగనిత్తురు. ఎకరముమీఁద 150 మొదలుకొని 200 మొక్కలవఱకును నాటుదురు. కొందఱీమొక్కలనడుమ కాఫి, తేయాకు, కోకో, మిరియము వేయుదురు. రబ్బరు మొక్కలు ఫలించులోపలనే, వీనివలనభూస్వామికిఁగొంతలాభము వచ్చుచుండును.

మూఁడు నాలుగేండ్లమొక్కలు పాలు తీయుట కనుకూలించును. అప్పుడు భూమికి గజమెత్తున మ్రాని కైవారము 18 అంగుళములు మొదలు 20 అంగుళములవఱ కుండును.

కృత్రిమపురబ్బరు పాలక్కఱలేకుండఁ జేయుదురు గాని, యది కష్టసాధ్యము,వ్యయమెక్కువ, యుపయోగము తక్కువ. అదిస్వభావసిద్ధమైన రబ్బరుతో సరిరాదు.

---

## 21. భీష్మ చరిత్రము.

### మొదటిభాగము.

తొల్లి చంద్రకులాభరణ మగు శంతను మహారాజు హస్తినాపురమును రాజధానిగఁ జేసికొని కురుదేశమును బరిపాలించుచుండెను. ఆరాజచంద్రుఁడు సద్గుణవతియును సౌందర్యరాశియు నగు గంగామహాదేవిని విధ్యుక్తముగా వివాహమై, యాలలనామణియందు దేవవ్రతుఁ డను నొకసుపుత్రునిఁ బడసెను. ఆగంగానందనునకు బాల్యమునందే మాతృవియోగము గలుగుటంజేసి తల్లిలేని కొఱంత లేశమైన నాబాలుఁ డనుభ

వింప కుండునట్లు, తల్లియుఁ దండ్రియుఁ దానయై యాశంత నుఁడు తనూజాతుని మిక్కిలి గారాబముతోఁ బెంచుచుండి విహితకాలమున నుపనయనము గావించి విద్యాభ్యాసమునకై యాయర్భకుని సకలవిద్యాపారంగతుఁ డగుపరశురాముని కప్ప గించెను. ఆగాంగేయుఁడును శ్రద్ధాభక్తులతో గురుసేవ గావించి సకల విద్యావిశారదుఁడై సకలకలాపరిపూర్ణుఁ డగు శర త్పూర్ణిమా చంద్రునివలె జేవ్వనమున నలరారుచుండెను. ఆ పుత్రరత్నమును యౌవరాజ్యాభిషిక్తునిఁ జేసి, యతని ప్రజా పరిపాలన సామర్థ్యమునకు నుల్లమున సంతసిల్లి రాజ్యభార మంతయు నాతనిపై నుంచి యాభూపతిపుంగవుఁడు వివిధక్రీడా విశేషముల వినోదింపఁదొడఁగెను.

ఇట్లుండ నొకనాఁ డాభూమీశోత్తముఁడు మృగయావినో దార్థము యమునాతరంగిణీతటమున విహరించుచుండ, నతని కొక సుందరీమణి కనఁబడెను. అంతఁ దన పరిచరులచే నాకోమలి వృత్తాంత మంతయు నరసి, రాజచూడామణి కన్యకామణికి జనకుఁడగు దాశరాజు నొద్ద కేగి యామానవతిని దన యర్ధాం గిగఁ జేయుమని కోరెను. అందుల కాదాశరా జెంతయు సంత సించి యామగువయందుఁ గల్గు నాదౌహిత్రుని రాజ్యాభిషి క్తునిఁ జేయఁ బ్రతిజ్ఞ చేసితి రేని తప్పక మీకోరిక నెఱవేర్చి కృతార్థుఁడ నగుదునని ప్రత్యుత్తర మిచ్చెను. అదివఱకే దేవ వ్రతుని యౌవరాజ్యాభిషిక్తునిగఁ జేసియుండుటయు, నతఁడు ప్రజానురంజకముగఁ బరిపాలించుచుండుటయుఁ దలపోసి యాధరణీకాంతుఁడు చెప్పుట కేమియుఁ దోఁపక విషణ్ణచిత్తుఁడై తిరిగి వచ్చి క్రీడావినోదంబులు వదలి యంతఃపురము చేరి

యూకాంతామణి యందలియనురాగము మిలిమీఱ, వగలఁ బొగులఁ జొచ్చెను. ఈ వృత్తాంతమును సాంతముగ నమాత్య వరులచే శంతను తనూజుఁ డాలించి, సచివసామంత బంధు మిత్రాదులతో దాశ రాజుపాలి కేతెంచి, "సఖా ! దాశరాజా! నీవు కోరినప్రకారము తప్పక నీదౌహిత్రునకే పట్టము గట్టె దను. పూజ్యుఁ డగు నాజనకునకు నీపుత్రికారత్నమును ధర్మ పత్నిగ నొసఁగుము. ఇంకను నాలోచించుచుంటివేమి? ఈ కా ర్యమునకు నేను సమ్మతించినను నాసంతతివారు విఘాత మొన రింతు రనియా? అట్లైన నిదిగో నీయెదుట, నీమిత్రులయెదుట, నీపౌరులయెదుట, నీయమాత్యులయెదుటఁ, బంచభూతముల యెదుట, సకలచరాచరాం తర్వర్తియు సర్వసాక్షియు నగు పరమేశ్వరునియెదుటఁ, బ్రమాణము చేసి చెప్పెద. నే నామర ణ మఖండబ్రహ్మచారినై యుండెద" నని నచ్చఁ బలికి సకు టుంబపరివారముగ నాదాశరాజేను దోడుకొనిపోయి, మత్స్య గంధి యోజనగంధి సత్యవతి యనునామముల నలరారు తత్క న్యకాతిలకమునకుఁ దనజనకునకుఁ బరిణయ మహోత్సవమును, శుభముహూర్తమున మహావైభవమున విధి విధానమున జరి పించి, దేవవ్రతుఁడు శాశ్వతకీర్తిసంపన్నుఁ డయ్యెను. తండ్రి యుఁ గుమారుని సంపూర్ణ పితృభక్తికిని నిరుపమ స్వార్థపరి త్యాగమునకును మెచ్చుకొని "వత్సా ! దేవవ్రతా ! మర ణము నీయధీనమై యుండునుగాక !" యని యాశీర్వదించెను. పెద్ద లందఱు నతనిభీషణప్రతిజ్ఞకు వెఱఁగంది భీష్ముఁ డను బిరు దము నొసఁగిరి. నాఁటనుండియు దేవవ్రతుఁడు భీష్ముఁ డను నామమున సుప్రసిద్ధుఁ డయ్యెను.

తరువాతఁ గొంతకాలమునకు నాయన్నలమిన్నయం దా శంతనునరేంద్రుఁడు చిత్రాంగద విచిత్రవీర్యు లనుపుత్రులఁ బడసి స్వర్గస్థుఁ డయ్యెను. భీష్ముఁడు దనయనుఁగుఁదమ్ముల నిర్వురఁ బ్రాణతుల్యులుగఁ గాపాడి విద్యాబుద్ధులఁ గఱపి, సంప్రాప్త యౌవనుఁ డగుచిత్రాంగదునకుఁ బట్టము గట్టి తానే సచివుఁడై కార్యభారము నడపుచుండెను. గర్వాతిరేకమున నా చిత్రాంగదుఁడు భీష్ముని సరకుసేయక యొంటిగఁ జిత్రాంగదుఁ డనుగంధర్వ రాజుపై దండెత్తిపోయి యవక్రపరాక్రమముతోఁ జిత్రవిచిత్రముగ సంగరరంగమున ఘోరముగఁ బోరాడి. తుట్టతుద కా గంధర్వునిచే నిహతుఁడై వీరోచితస్వర్గ మధిష్ఠించెను. అంత భీష్ముఁడు దనతమ్ముని యకాలమరణమున కెంతయుఁ జింతిల్లి యథోచితవచనములఁ దల్లినోదార్చి యౌవనావిర్భూతశోభా విరాజితుఁ డగు విచిత్రవీర్యుని సింహాసనారూఢునిఁ జేసెను. అంత నాయనుజునకు వివాహము చేయఁ గోరి గంగానందనుఁడు కాశీకానగరమున జరుగుచున్న స్వయంవర మహోత్సవమున కేగి యచేట మూఁగిన రాజకుమారుల నందఱ నోడించి యా కాశికాధీశుకన్యల మువ్వురఁ దోడుకొని వచ్చుచుండెను. వారిలో జ్యేష్ఠురా లగునంబ తాను సాళ్వదేశాధీశుని వలచితి ననియుఁ ద న్నచ్చోటికిఁ బంపవలయు ననియు వేఁడుకొన, నాకరుణాళువగు శాంతనవుఁ డా బాలను పరివారముతో సాళ్వునియొద్దకుఁ బంపి యంబికాంబాలిక లనుతక్కిన యిర్వురను దెచ్చి విచిత్రవీర్యున కిచ్చి మిక్కిలివైభవముతో వివాహమహోత్సవమును జరిపించెను. అక్కడ సాళ్వునికడ కేగి. యంబ పరగృహీత యనుకారణముచే నతనిచేత నిరాకరింపఁ

బడి మరల భీష్ముని జేరి యతనితమ్మునకే తన్నిచ్చి వివాహముచేయుమని బతిమాలుకొనియెను. కాని యాయంబ యన్యాయత్తచిత్త యనుహేతువుచే భీష్ముఁ డందుల కొప్పకొనఁ డయ్యెను. చిట్టచివర కాయంబ భీష్మునిగురు వగుపరశురాముని శరణు సొచ్చెను. ఆరేణుకానందనుఁడు భీష్ముని బిలువ నంపి యామగువను తానైనను తమ్ముఁడైనను వివాహమాడి తీరవలయు నని నిర్బంధించెను. అందుల కా భీష్ముఁడు వినమ్రుఁడై "గురువరేణ్యా! గురునియాజ్ఞనైనను నుల్లంఘింప నగునుగాని యధర్మముమాత్ర మాచరింపఁగూడదని ధర్మశాస్త్రములు వక్కాణించుచుండుటఁ దమ రెఱిఁగిన విషయమే కదా" యని మనవిచేసెను. అంత నిరువదియొక్కమారులు రాజకులమును దన క్రోధానలముచే భస్మము చేసిన యాపరశురాముఁడు కోపావేశమున దుర్నిరీక్ష్యుఁడై రణమునకు సంసిద్ధుఁ డయ్యెను. అఖండ బ్రహ్మచర్యదీక్షాగరిష్ఠుఁడును ధర్మపక్షావలంబియు నగు భీష్ముఁడును గ్రీష్మకాలభానునివలె ననుపమతేజోవిరాజితుఁడై సంగరమునకు సన్నద్ధుఁ డయ్యెను. ఇట్లు శూరాగ్రేసరు లిరువురును సంగ్రామమునకు దిగి హోరాహోరిగ నిరువదిమూఁడు దినములు ఘోరముగఁ బోరాడిరి. తుట్టతుదకు భీష్ముని దుస్సహదుర్వార ధైర్య శౌర్యములకుఁ దాళఁజాలక తా నోడితి నని చెప్పి యుఁబను విడనాడి పరశురాముఁడు తనదారిని బోయెను. భీష్ముని పనిపట్టుదు నని యంబ యగ్నిప్రవేశము చేసి, పాంచాలము నేలు ద్రుపద మహారాజునకుఁ బుత్రికయై జనించి, కారణాంతరమునఁ బురు

షుఁడై శిఖండియనునామము ధరించి, ధనుర్విద్యాకౌశలమును బడసి శత్రువును వధించుటకుఁ దటివేచియుండెను.

---

## 22. భీష్మచరిత్రము - రెండవభాగము.

అట నంబికాంబాలికలతోఁ గొంతకాలము సుఖము ననుభవించి సంతానరహితుఁడై విచిత్రవీర్యుఁడు కాలధర్మము నొందెను. ఇట్లు తనపుత్రు లిరువురును సంతానవిహీనులై కులమును నామమాత్రావశిష్టముచేసి గతించినందుల కెంతయుఁ జింతించి సత్యవతి భీష్ముని సమీపించి "కుమారా! నీవైనను బెండ్లిచేసికొని సుసంతానమును బడసి గోత్రము నుద్ధరింపు" మని మాటిమాటికి నొక్కి చెప్పుటయేకాక యాప్తవరులగు పెద్దల చేతను జెప్పించెను. కాని దేవవ్రతుఁడు దృఢవ్రతుఁడగుటచే నందుల కొడంబడకుండఁగా మత్స్యగంధి కన్యకగా నుండుతఱిఁ బరాశరానుగ్రహమునఁ గలిగిన వ్యాసమహర్షిని వంశోద్ధరణమునకై ప్రార్థించెను.తదనుసారముగా నామహాముని యంబికకుఁ బ్రజ్ఞా మాత్రచక్షుఁడగు ధృతరాష్ట్రుని, నంబాలికకుఁ బాండురోగి యగుపాండురాజును బ్రసాదించెను. భీష్ముఁడీయిరువురను మిక్కిలి మక్కువతోఁ బెంచి యుక్తవయస్కులైనపుడు ధృతరాష్ట్రునకు గాంధారి యను కన్యకారత్నమును, పాండురాజునకుఁ గుంతీమాద్రు లను బాలికామణులను వివాహముచేసి, జ్యేష్ఠుఁ డగు ధృతరాష్ట్రునిఁ బట్టాభిషిక్తునిఁ జేసి, తదనుజుఁ డగుపాండురాజును యువరాజుగ నొసరించి, దానికి జనించినను సాత్యవతేయానుగ్రహము గలుగుటచేత సకల

విద్యావిశారదుఁడును సకలసద్గుణసంపన్నుఁడు నగు విదురుని వారికి మంత్రిగ నియమించి, తాను సేవల మొక దండనాథుఁడుగ వారిదండ మెలఁగుచు వారిసేమమే యన్నివిధముల నరయుచుండెను. ధృతరాష్ట్రునకు గాంధారియందు దుర్యోధన దుశ్శాసనప్రముఖు లగు నూర్వురు పుత్రు లుద్భవించిరి. పాండురాజునకుఁ గుంతియందు యమవాయు సురేంద్రాను గ్రహముచలన ధర్మజభీమార్జునులును, మాద్రియందు నశ్వినీసుతుల ప్రసాదమున నకులసహదేవులును గలిగిరి. ధృతరాష్ట్రుని తనూజాతులు ధార్తరాష్ట్రు లనియుఁ గౌరవులనియుఁ బాండుసుతులు పాండవు లనియుఁ బ్రసిద్ధిఁ గాంచిరి. ప్రజాపరిపాలన దక్షుఁడును వినిర్జిత సకలారిమండలుఁడును నగు పాండురాజు దన తనయులు బాలురై యుండఁగనే పరలోకగతుఁడయ్యెను. భీష్మానుమతముగా ధృతరాష్ట్రుఁడు దనయనుఁగుఁదమ్ముని తనూజాతుల దగ్గఱఁ దీసి యాదరముతోఁ గాపాడుచుండెను. పాండవులును దమసుగుణసంపత్తిచేఁ దమ పెదతండ్రియొక్కయు బంధువులయొక్కయు మంత్రులయొక్కయుఁ బ్రజలయొక్కయు మన్ననకుఁ బాత్రులై తనరారుచుండిరి. భీష్ముఁడు దన మనుమ లగు కౌరవపాండవులకు, ధనురాచార్యుఁడని ప్రఖ్యాతివడసిన ద్రోణాచార్యుని గురువుగా నియమించి, వారిని శస్త్రాస్త్ర ప్రవీణులఁ జేసెను. పాండవజ్యేష్ఠుఁ డగుధర్మరాజు కౌరవజ్యేష్ఠుఁ డగు దుర్యోధనునికంటెఁ బెద్దవాఁ డగుటచేతను, వినయాది సుగుణములచేఁ దనరారుచుండుటచేతను, బ్రజారంజకుఁ డగుటచేతను, గురువృద్ధులకుఁ గూర్చువాఁడగుటచేతను, నతనిఁ దనకు యువరాజుగా ధృతరాష్ట్రుఁడు భీష్మ

ప్రేరణమున నంగీకరించెను. అందులకు దుర్యోధనుఁ డసూయా గ్రస్తుఁడై పాండవులఁ బరిమార్ప నెంచి వారిలో నొకఁడగు భీమునకు విషాన్నమును బెట్టించెను. వానిని జలమునఁ ద్రోయించెను. లక్కయింటఁ వారలఁ బెట్టి దానిఁ గాల్పించి వారిం జంపఁ జూచెను. కాని ధర్మాత్ములగువారియెడల నివి యన్నియు నిష్ఫలము లయ్యెను. పాండవులకు నానాటికిఁ గలుగు చుండు నీయుపాయములను దలపోసి భీష్ముఁడు ధృతరాష్ట్రునితో నాలోచించి యర్ధరాజ్యమును బ్రత్యేకముగఁ బాండవుల కిప్పించి దుర్యోధనుని ధృతరాష్ట్రునకు యువరాజుగా నభిషిక్తునిఁ జేసెను. కాని యంతటితో దుర్యోధనుఁడు తృప్తి నొందక శకునికర్ణ దుశ్శాసనులను దుర్మంత్రులతో యోజించి కపట ద్యూతమును గల్పించి, యందుఁ బాండవుల నోడించి, పండ్రెం డేండ్లు వనవాసమును నొక్కయేఁ డజ్ఞాతవాసమును వారికి విధించి, వారిని సకలకష్టములఁ బెట్టెను. భీష్ముఁడు సమయము చిక్కినపుడెల్లఁ బాండవుల సుగుణసంపదను, వారి శక్తిసామర్థ్యములను, దుర్యోధనునకుఁ జాటి చెప్పుచుఁ దాను నమ్మియుండు దుర్మంత్రుల దుర్గుణదౌర్బల్యములను విశదీకరించుచుఁ బాండవులతోఁ బొత్తు గలిగి మను మని యెంతయో బోధించుచుండెను. కాని యాబోధనములన్నియు దుర్యోధనునియందు బూడిదలోఁ బోసిన పన్నీరువలె నిష్ప్రయోజనము లయ్యెను. తుద కన్నియుడుమలఁ గుడిచివచ్చి మాయర్ధరాజ్యము మాకిమ్మని కోరినపాండవులను నిరాకరించి వారితో సుయోధనుఁడు గయ్యమునకుఁ గాలు ద్రవ్వెను. పాండవులును గౌరవులును యుద్ధ సన్నద్ధులైరి. భీష్మునకు విషమావస్థ తటస్థించెను. ఈవీరశిరో

మణికి నిరువురును సమానులైన మనుమలే యైనను న్యాయపథ మవలంబించి యనేకకష్టముల కోర్చి తానే యూఁత యని యెంచుకొనియున్న పాండవులయం దీతనిమనస్సు లగ్నమై యుండెను. తన్ను శూరాగ్రేసరుఁ డని నమ్మి దుర్యోధనుఁడు దనకు సర్వసేనాధిపత్య మొసఁగినను, దన కాతనియందు నను రాగము శూన్యమై యుండెను. కాఁబట్టి మనస్సును బాండవుల కును శరీరమును గౌరవులకును బంచి యిచ్చెను. ఇరుప్రక్కల వారును రణమునకు సంసిద్ధులై నిలిచినతఱి ధర్మజుఁడు పాద చారియై వచ్చి తనకు నమస్కరించి యుద్ధమునకు ననుజ్ఞ యిమ్మని కంటఁ దడిపెట్టుకొని వేఁడుకొన్నప్పుడు, దేవవ్రతుఁడు దనమనస్సు కరఁగఁ బరిపూర్ణవాత్సల్యముతో "వత్సా! ధర్మ రాజా! తప్పక నీకు జయము గలుగునుగాక!" యని యాశీర్వ దించెను. పాండవులును గౌరవులును దలపడి పోరాడఁజొచ్చిరి. కౌరవసేనాధ్యక్షుఁ డగు భీష్ముఁడు విజృంభించి మధ్యందిన మార్తండుని చందమున దుర్నిరీక్ష్యుఁడై బాణాగ్ని జ్వాలలచేఁ బాండవసైన్యమును భస్మపటలము గావించుచు, మూర్తీభవిం చిన శౌర్యమో యనునట్లు లెనిమిది దినము లొక్కతీరున ఘోరముగఁ బోరు సలిపెను. దుర్యోధనుఁడు దానితో సం తృప్తి నొందక పాండవపక్షపాతి వగుటచే నీప్రతాపమును సం పూర్ణముగఁ జూపవైతి వని తన్ను దూషింప, నాశాంతనవుఁడు తొమ్మిదవనాఁ డత్యంత రౌద్రాకారమును దాల్చి, రణరం గమునం దెచ్చటఁ జూచినను దానయై, రథగజ తురగ పదాతి నిచయముల శరపరంపరలచేఁ దుత్తునియలుగఁ గొట్టుచుఁ,దన్ను మార్కొనిన పదివేవురు రాజకుమారుల శిరములఁ దెంకులవలె

మింటికి నెగయఁగొట్టి, కేవలసారథ్యమే చేసెదఁగాని చేత నాయుధముఁ బట్ట నని ప్రతిజ్ఞ చేసిన శ్రీకృష్ణుఁడు గూడఁ దన మాటను మఱచి చేతఁ జక్రాయుధమును బట్టి తనపై కుఱుకు నట్లు కృష్ణార్జునుల శరీరములు చిల్లులు వడఁగొట్టి, సంధ్యా సమయమునఁ దనసైన్యమును మరల్చి సంగ్రామముఁ జాలించెను. భీష్మునిదుస్సహదుర్వార ప్రతాపమునకు వెఱఁగంది భీతిల్లిన ధర్మరాజా నాఁటిరాత్రి గాంగేయుని శిబిరమున దర్శించి "మహాత్మా! నీవు నేఁటితీరునఁ దీవ్రప్రతాపమునఁ బోరితివేని నిన్నెదిర్చి జయింప నెవరితరమగును? నీయాశీర్వచనము సఫల మగుటకుఁ దగిన యుపాయ మేదియో సెలవిచ్చి నన్నుఁ గృతార్థునిఁ జేయవే!" యని దీనాననుఁడై వేఁడుకొనియెను. అంత దేవవ్రతుఁడు "కుమారా! నే నంగనతోను, నంగనాభిధానుని తోను, నంగనాపూర్వునితోను సంగరముచేయనని ప్రతిజ్ఞ చేసి యున్నాఁడను. కాన నంగనాపూర్వుఁ డగు శిఖండిని ముందిడు కొని నాతో యుద్ధము చేసినయెడలఁ దప్పక నే నోడిపోయెద" నని తెలిపి ధర్మరాజును బ్రోత్సాహపఱచి పంపెను. పదియాన నాఁటి యుద్ధమున నర్జునుఁడు భీష్ముఁడు దెలిపినయట్లు సమర మును సలిపి యామహావీరుని శరతల్పమునఁ బరుండఁ బెట్టెను.

ఆమహానుభావుఁడు స్వచ్ఛందమరణమును జనకునికరుణచేఁ బడసి యుండుటచేత, నాయంపశయ్యపై నుత్తరాయణము వచ్చువఱకుఁ బరుండియుండి, తన్నడిగినవారి కెల్లధర్మ సూక్ష్మ ములు విశదముగ నుపదేశించుచుఁ బ్రశాంతముగఁ గాలమును గడపి, యుత్తరాయణపుఁ దొలియేకాదశినాఁడు తనహృదయార విందమున:—

మ. త్రిజగన్మోహననీలకాంతి తనువు ♦ ద్దీపింపఁ బ్రాభాతనీ
రజబంధుప్రభ మైనచేలము పయిన్ ♦ రంజిల్ల నీలాలక
వ్రజసంయుక్త ముఖారవింద మతిసే ♦ వ్యంబై విజృంభింప, మా
విజయుం జేరెడు వన్నెకాఁడు మది నా ♦ వేశించు నెల్లప్పుడున్.

మ. తనకున్ భృత్యుఁడు వీనిఁ గాచుటమహా ♦ ధర్మంబు సు మ్మంచు న
ర్జునసారథ్యము పూని పగ్గములఁ జేఁ ♦ జోద్యంబుగా బట్టుచున్
మునికోలన్ వడిఁ బూన్చి ఘోటకములన్ ♦ మోఁదించి తాడించుచున్
జనులన్ మోహము నొందఁజేయుపరమో ♦ త్సాహుం బ్రశంసించెదన్

సీ. కుప్పించి యెగసినఁ ♦ గుండలంబులకాంతి
గగనభాగం బెల్లఁ ♦ గప్పికొనఁగ,
నుఱికిన నోర్వక ♦ యుదరంబులో నున్న
జగములవ్రేఁగున ♦ జగతి గదలఁ
జక్రంబుఁ జేఁబట్టి ♦ చనుదెంచురయమునఁ
బైనున్న పచ్చని ♦ పటముజాఱ,
నమ్మితి నాలావు ♦ నగుబాటు సేయకు
మన్నింపు మని క్రీడి ♦ మరలఁ దిగువఁ,

గీ. కరికి లంఘించుసింహంబు ♦ కరణి మెఱసి
నేఁడు భీష్మునిఁ జంపుదు ♦ నిన్నుఁ గాతు,
విడువు మర్జున! యనుచు మ ♦ ద్విశిఖవృష్టిఁ
దెరలి చనుదెంచుదేవుండు ♦ దిక్కు నాకు.

అని శ్రీకృష్ణ భగవానుని ధ్యానించుచుఁ దనయాత్మను బర
మాత్మాధీనము చేసి కీర్తిశేషుఁ డయ్యెను. కావుననే యాసేతు
హిమాచలపర్యంతము, హైందవు లెల్లరును భీష్మైకాదశి యగు

మాఘశుద్ధమందలి యేకాదశిని బుణ్యదినముగఁ బరిగణించు చున్నారు.

ఇన్ని సుగుణములచే నలరారిన యీ భారతవీరరత్నము నానాఁటికి నూతన తేజోవికాసముతో మనమానసములఁ దేజరిల్లి మనల నందఱ ధన్యతములఁ గాఁ జేయును గాక!

సీ. అఱచేత నున్నట్టి ♦ యఖిలరాజ్యమ్మును
　　వదలి సత్కీర్తిచేఁ ♦ బొదలినాఁడు,
అన్యాయ మొనరించు ♦ నాచార్యునైనను
　　శిక్షించి నీతి ర ♦ క్షించినాఁడు
వృద్ధత్వమున వైరి ♦ వీరాగ్రగణ్యుల
　　వేఁటాడి శౌర్యంబుఁ ♦ జాటినాఁడు.
శరతల్పగతుఁడయి ♦ సకలధర్మంబులఁ
　　గఱపుచు శాంతంబుఁ ♦ గురిసినాఁడు
గీ. బ్రహ్మచర్యగరిష్ఠుఁడై ♦ ప్రబలినాఁడు
నిన్ను సతతంబు మదిలోన ♦ నిల్పినాఁడు
భీష్మునంతటి భక్తుండు ♦ పృథ్విఁ గలఁడె?
సకలకల్యాణగుణధన్య ♦ సర్వమాన్య.

---

## 23. స్వయంకృషి - స్వతంత్రజీవనము.

సృష్టిలోని యేజంతువుఁ జూచినను స్వశక్తిచేతనే యాహారాదులను సంపాదించుకొని బ్రదుకుచున్నట్లు స్పష్టముగాఁ గనఁబడుచున్నది. తిండి వెదకికొని తినుటకును, శత్రువులనుండి తప్పించుకొని పాఱిపోయి డాఁగి ప్రాణసంరక్షణము చేసికొను

టకను, వానివాని కనుకూల మగురీతి నవయవనిర్మాణము భగవంతుఁడు కావించినాఁడు. అట్టి యవయవముల నిరర్థకములుగాఁ జేసికొను జంతు వొకటియుఁ గానిపింపదు.

నిద్రాహారాదిసౌఖ్యము లనుభవించుటలో మాత్రము మనుష్యుఁడు జంతుధర్మములనే యగపఱుచుచున్నాఁడు. ఎవని సుఖమునకు వాఁడు స్వయముగాఁ బాటుపడి పనిచేసి కొనుట భగవదుద్దేశము. అట్లు చేయక పరాపేక్షుఁడై యున్న వాఁడు జంతువులకంటెఁ గనీయుఁ డని చెప్పక చెప్పకొను చున్నాఁడు.

ఎవనికి వాఁడు పాటుపడి పనిచేసికొనక పోయినచో, వాని బాధ్యత యితరులమీఁదఁబడి వారికి భారము గలుగఁ జేయును. శక్తి యుండి దానిని స్వప్రయోజనమునకైనను వినియోగించు కొనక చేదికిలఁబడి కూర్చుండి, పరులకు బాధ గలిగించుట పాపము కదా? పరోపకారముకంటెఁ బుణ్యముగాని, పరపీడనముకంటెఁ బాపముగాని లోకములో లేదు. కనుక స్వతంత్ర జీవనముకై పాటుపడుటలోఁ ద్రాలుమాలిక పరమ నికృష్టము. పాపముమాట యటుండఁ బరాధీనపుబ్రతుకువలన మనకిక్కడ నేచాల ననర్థములు సంభవించును. ఇనుము వాడక యొక మూల నుంచినచో శీఘ్రకాలములోఁ ద్రుప్పు పట్టి పాడయి పోవును. అట్లే మన యవయవములకును మనస్సునకును వ్యాయామము లేకున్నఁ, జెడియవి మనల ననారోగ్యవంతులఁ జేయును. సోమరితనమువలన శరీరమునకును మనస్సునకును నానావిధరోగములు సంభవించును. పని లేక కూరుచుండు వారికే పాపచింత లెక్కువ. "నిర్వ్యాపారునిచిత్తము సైతాను

కర్మాగార" మని యొకసామెత యింగ్లీషుభాషలోఁ గలదు. కనుక నారోగ్యలాభమును బాపపరాఙ్ముఖత్వమును గోరువారు పాటుపడుచునే యుండవలెను. సుఖము చెఱచుటకు సోమరితనమువంటిది మఱియొకటి లేదు. ఆధివ్యాధుల హరించుటకు స్వయంకృషివంటి మందు లేదు.

మనము త్రవ్వి, నాటి, నీళ్లుపోసి, కాపించుకొన్న వంగకాయలుగాని దోసపండ్లుగాని తినునప్పు డెంతో రుచిమంతములుగాఁ దోఁచును. ఈరుచి, కాయలలోను బండ్లలోను లేదు. బజాఱులో నమ్మినవి యంతకంటెఁ బైకి బాగుగా నుండవచ్చును. స్వయముగాఁ బాటుపడి పండించుకొనుటచేతనే యవి జిహ్వకంత యింపుగాఁ గాన్పించుచున్నవి. కనుక స్వయం కృషి యెప్పుడును సౌఖ్యదాయకము.

పరాధీనుల బ్రతుకు పరమనీచము. డబ్బిచ్చువారు చులుకఁ జేయుదురు. వండి వడ్డించువారు తిన్నగాఁ జూడక సణుగు లాడుదురు. మూఁడు పూఁటలు మూఁడు తవ్వలు చెల్లించి మూలఁ గూర్చుండుటయే యీయన యుద్యోగ మని సమతమము ననో చాటుననో నెటికలువిఱుతురు. అట్టివానికి గౌరవ మన్నమాటయే లేదు. తిన్నతిండి యఱుగదు. దుఃఖము వచ్చును. కనుకనే "స్వార్జితవిత్త ముత్తమము, పితృార్జితము మధ్యమము, భ్రాతృవిత్త మధమము, స్త్రీవిత్తమధమాధమము" అని చెప్పునొక సంస్కృతశ్లోకము గలదు.

అన్యాయార్జితవిత్తముచే జీవించుట యాత్మగౌరవమునకు హానికరముగాని, కష్టపడి పనిచేసికొనుట యట్టిదికాదు. అభిరుచిని బట్టియు శక్తిననుసరించియు నేపనియైనను జేయవచ్చును.

యోగ్యతాయోగ్యతలును గౌరవలాఘవములును ప్రవర్తనమును బట్టియుండును గాని వృత్తినిబట్టి యుండవు. అయోగ్యుఁడగు పెద్ద యుద్యోగికంటె యోగ్యతతోఁ గష్టపడి గంజిత్రాగి బ్రతుకునుప్పరి యెక్కువ గౌరవపాత్రుఁడు.

బాల్యములో శరీరశుచికిని శరీరపుష్టికిని గావలసినకృత్యములలో నంతగాఁ దల్లులను సేవకులను నాధారము చేసికొని యుండుట దురభ్యాసముగాని శ్రేయస్కరము గాదు. ముందు ముందుకూడ నట్లే యొరులచేఁ బని చేయించుకొనవలసి వచ్చును. అట్లు చేయించుకొనుటకుఁ దగినధన ముండవచ్చును, లేక పోవచ్చును. గొప్పయుద్యోగి కొడుకుగూడ గొప్ప యుద్యోగియే యగు నని యెట్లు నిశ్చయించుకొనఁగలము ? పండి పండి యున్న భూమి కొన్నాళ్లవఱకుఁ బాడయి మరల బీడగునట్లు, పండితపుత్రుఁడు పామరుఁడును, ధనవంతునితనయుఁడు దరిద్రుఁడును నయియుండుట వెక్కుచోట్లఁ జూచుచున్నాము. కనుక స్వశక్తినే నమ్ముకొని యుండుట మంచిది.

ధనవంతుల బిడ్డల మని చెప్పి,పుస్తకములు బరువులేకపోయినను, పరిచారకులచేతఁ దెప్పించుకొనుట, యన్న మొకరిచేతఁ దినిపించుకొనుట, కాళ్లొకరిచేతఁ గడిగించుకొనుట, బట్ట లొకరి చేతఁ గట్టించుకొనుట మొదలగునవి, ముందెప్పుడైనఁ గష్టదశ వచ్చినప్పుడు మిక్కిలి విషమించును.

పాఠశాలలోని గురువులు చాలక యింటియొద్ద భాగ్యవంతుల బిడ్డలు కొందఱు ఉపగురువులను దబ్బిచ్చి పెట్టుకొనుచున్నారు. ప్రధానదేశికుఁ డసమర్థుఁడైనఁగాక యిదియు ననర్థకమే. అట్లు చేయుట స్వయంకృషి కడ్డంకియై సోమరి

తనమును హెచ్చుచేయును. అట్టి బాలుఁడు నిఘంటులను జూడఁడు; కష్టపడి యాలోచింపఁడు; తాఁ జేయవలయు పనులను గురువుచేతఁ జేయించును. అడిగిన వెంటనే యర్థములు వచ్చుచున్నవి, మనకుఁ క్లేశము లేదని సంబరపడును; గాని, అయ్యో! స్వతంత్రతాశక్తి జోఁటి పరాపేక్ష ప్రబలుచున్నదని పరితపింపఁడు. కష్టార్జితమైన జ్ఞానమువలె నశ్రమముచే లభించినవిద్య మనసునంటదు. అంటినను జిరకాలము నిలువదు. బాలురీమాట మఱవఁగూడదు.

తనకుఁదా సాహాయ్యము చేసికొనువానికి దైవముసాయము చేయునను నొక సామెత గలదు. అది యథార్థము.

మన మెంత డబ్బిచ్చిన, నొరులచేఁ జేయించుకొనిన పని మనము చేసికొన్నట్లుండదు. ఈక్రిందికథ దానికిఁ దార్కాణము.

ఇంగ్లండు దేశమున 'సత్రే' మండలములోని యొక గృహస్థునకు సంవత్సరమునకు రెండువందల పౌండ్లాదాయము వచ్చు భూమియుండెను. అది కౌలిచ్చి యమరకము చేయక, యతఁడు శాంతకమతము పెట్టి పాలికాఁపులచేఁ బని చేయించుకొనుచుండెను. కాని పాప మది లాభకారి కాకపోవుటయేకాక నష్టమును గలిగించి యతని నప్పులలో ముంచెను. ఋణవిముక్తికై సగముభూమియొక కాఁపువాని కిరువదియొక్కండ్లకమరకము చేసెను.

కౌలుకాలము భుక్తము కాకుండఁగనే యాకాఁపు కొకనాఁడు సిస్తు పట్టుకొని వచ్చి "యయ్యా! తమరు భూమి విక్రయించెదరా?" యని ఖామందు నడిగెను. "నీవు కొనె

దవా ?" యని యతఁడు రైతు నడిగెను. "ఏలినవారు దయ చేసి యమ్మునెడల నేను గొనుటకు సిద్ధముగా నున్నా" నని రైతు ప్రత్యుత్తరమిచ్చెను.

"నే నొకరికి సిస్తీయ నక్కఱ లేదయ్యెను. నీకంటె భూమి రెట్టిగానుండెను. అట్లున్నప్పటికి, నేనును నాకుటుంబమును జీవించుటకుఁ జాలినంత రాబడియైనను రాకుండెను. కొంచెపు భూమిమాత్రము సాగు చేయుచుంటివి. స్వకుటుంబపోషణము చేసికొనుచు, సిస్తు నియమితకాలమునకు ముందే చెల్లించుచు, ఈభూమినిఁ గొనుటకుఁ జాలిన ధనము నెట్లు నిలువచేసికొనఁ గలిగితివో నాకుఁ దెలియకున్న" దని భూస్వామి యాశ్చర్య చిహ్నము లగపఱచుచుఁ బలికెను.

"అయ్యా! మీకును నాకును రెండు మాటలలోనే భేదము గలదు. మీరు వెళ్లు మందురు. నేను రమ్మందును. ఇంతకంటె నెక్కువ వ్యత్యాసము గనఁబడదు"—అని కాఁపు వాఁడు చిఱునవ్వుతోఁ బ్రత్యుత్తరమిచ్చెను.

"నీయభిప్రాయ మేమో నాకు బోధపడకున్నది, స్పష్ట ముగా విప్పి చెప్పు" మని యతఁ డడిగెను.

"అలసులై మీరు ప్రక్కమీఁదఁ బరుండియో, యితర భోగము లనుభవించుచుండియో, పనిచేయుఁ డని పాలేరు వాండ్రను బొలమున కంపుదురు. నేను వెందలకడ లేచి రం డని పనివాండ్రను వెంటఁ దీసికొని స్వయముగాఁ బనిచేయింతును. ఇది నామాటల కర్థ" మని కాఁపు చెప్పెను.



# 24. శ్రీభద్రాచలయాత్ర.

## మొదటిభాగము.

ఆ. క్రొత్తచింతపండు క్రొత్త నౌ చెఱకులు
వేఁపపూవు మావి పిందియలును
గుడము ననఁటిపండ్లు కూడిన పచ్చడి
తోడఁ దింటి మేఁటి తొలుత మేము. 1

మ. తిని తాంబూలములారగించుతఱి మైత్రిన్నాప్తుఁడొక్కఁడి
ట్లనెఁ "బూతంబగు భద్రశైలనగరంబందున్మహావైభవం
బున శ్రీరాముని యుత్సవంబు జెరగున్, న్బోఁజూచుచున్నారు స
జ్జను, లచ్చోటికి వారితోడ మనమున్సద్భక్తితోఁ బోదమా?"

క. యాత్రాపరతయు వారిజ
నేత్రునిపై భక్తిలేవు నెమ్మది; నైనన్
మిత్రుఁడు యాత్రకునైపడు
నాత్రముఁ గని మంచి దంటి నతని నలర్పన్. 3

చ. అది గనిపట్టి నాసఖుఁ "డహో ప్రియమిత్రమ! దైవభక్తికిం
జేదువుల కింతదవ్వనుచు స్వప్నమునందును నెంచనైతిఁ, బు
ణ్యాదములు యాత్రలన్న నుడినట్టులు పెట్టి, తదన్యలాభము
ల్వేదకినఁ గొన్నియైనఁ గనిపింపక మానవు వానిలోపలన్.

క. అని పల్కిన నే నిట్టం
టిని "వేళకుఁ దిండిలేమి నిద్రాభావం
బును జనసమ్మర్దంబును
బనుపడు నపమృత్యుమహిత ఫలసహితములై". 5

వ. దాని కతఁ డిట్లనియె. 6

శా. అన్నా యెంతటిమాటలాడితి వదకయ్యా! నీకుఁగన్పట్టెనే నా
పన్నుల్ భక్తులు చూపుయాత్రికమహాబాధాసహిష్ణుత్వముం,
బున్నొంబంచుఁబరోపకారులిడుసంపూర్ణాన్న పానాదులున్
గన్నారం గని వచ్చితేని యిటువక్కల్లేవు వక్రోక్తులన్. 7

ఉ. ఇంతకుమున్నె యాత్రలకు నేగినవానివలె న్వచింతు ; నీ
శాంతుఁడుయోగ్యుఁడెన్నఁడునసత్యములాడెడివాఁడుగాఁడు;
మాంతరమొక్కటేనిఁగనకన్నట్టి "వివేకిని" నేను; వీనితోఁ బ్రగా
బంతము లాడు టేల యనిభద్రగిరిం గన నిశ్చయించితిన్.

క. దూరముగాఁ బోవలసిన
వారికిఁ గావలయునట్టి వస్త్రంబులు, సం
భారంబులు, రొక్కముఁ గొని
చేరితి ముభయులము పడవ చెంతకు వెంటన్. 9

సీ. అడ్డబొట్టుల నిడు పైననామంబులఁ
గనుపట్టు బహువర్ణ జనులతోడ
శిథిలాంగముల జాఱు చెక్కిళ్ల వడఁకు నొ
దలలతో నుండు వృద్ధతతితోడ
నెడ పిల్లలనుగూడ నిడుకొని పతివెంటఁ
జనుసతీసదృశలా సతులతోడ
ఫలములఁ బూలఁ గిందెల నిండుతరువుల
వంటి యాత్రిక కుటుంబములతోడ

గీ. సాంద్ర మానట్టి రాజమహేంద్రవరపుఁ
గోటిలింగాల రేవునఁ గూడి, యధిక
హర్షకర మగు సంవత్సరాదినాఁట
నొక్కపడవనె యిరువుర మెక్కినాము. 10

ఉ. చెమ్మట లొత్తుకొంచు నిరు¦జేతుల వీవన వైచుకొంచు దే
హమ్ముల దేహముల్ గదియ¦నందఱునుస్సురులూర్చుచుండ, నా
యుష్మ్రశమమ్ముఁ జూచి "నను¦నుత్సవమారయ రమ్మటంటి; మో
క్షమ్మన నిట్టిదా?" యనిస¦గంధునితోఁ బరిహాసమాడితిన్.

క. పలువిధముల కంఠస్వర
ములతోఁ "జక్కనిమిఠాయి; ¦ పొగచుట్టలు; త
మ్మలపాకులు; మేల్కమలా
ఫలము" లనుచుఁ గొంద ఱమ్మ¦వచ్చిరి యటకున్. 12

చ. పడవకలాసు లంత హరి¦పాదసరోజములం దలంచి, దం
దడిగ జనంబు లున్నతమ¦నావల లంగరు లెత్తి, తెడ్డులం
గడల నమర్చి, లోపలికిఁ¦గష్టముతో నవి గెంటుచుండఁగాఁ
బుడమియునింగిమార్మ్రోసెఁ¦బూతరఘూద్వహకీర్తనంబులన్.

సీ. రక్షింపుమా: తండ్రి! ¦ రామచంద్రా! యని
ముడుఁగుఁ గైదమ్మల ¦ మ్రొక్కువారి
దారిలో గండముల్ ¦ దప్పింపుమా! యని
గోదావరీకృపఁ ¦ గోరువారి
జోత పెట్టు మటంచు ¦ జోత్తుపాపలచేతు
లెత్తించి యెఱఁగించి ¦ యెఱఁగువారి
నీపాపఘటమున ¦ కేమి చేసెదో రామ!
నీవె దిక్కను కంటి¦నీటివారి

ఆ. నరసి యరసి మిగుల ¦ నాశ్చర్యపడి, మిత్రు
వైపుచూచి వీరి ¦ వరుసఁ గనిన
బావ! పెద్దపిచ్చి ¦ పట్టిన ట్లున్నది
యనఁగ, నవ్వి యాతఁ ¦ డనియె నిట్లు 14

శా. బావా! యీపడవన్గలట్టి మనుజ ƒ వ్రాతంబు నీక్షించి,యీ
నావంబోలిన తక్కునావలప్రజ ƒ న్దర్శించి, భద్రాద్రియా
త్రావాంఛన్జను దెంచునట్టి బహుమా ƒ ర్గస్థప్రజన్జూచి, యీ
యావేశధ్వని మూలకారణముఁ బ ƒ ర్యాలోచనం బెట్టుమా.

గీ. వేలకొలఁదిగ జనములు ƒ వేయుభక్తి
వివశకరతాళముల ధ్వను, ƒ ల్విష్ణునామ
నినదములు, పిచ్చిచేఁతలో! ƒ నీ వెఱుఁగవు
వెఱ్ఱు లందఱు నంటయో ƒ పిచ్చి! యెఱుఁగ. 16

గీ. ఇటు ప్రసంగము సేయుచు ƒ నేగుచుండఁ,
గలము నడపుటకు గడల ƒ బలము చాల,
కనిలచలనంబు గనిపట్టి ƒ యంతటఁ దెర
చాఁప లెత్తిరి వానికి ƒ సాయముగను. 17

గీ. ఎంతచేసిన నేటికి ƒ నెదురు ప్రోవు
పడవ లెట్టులు వడివడి ƒ నడవఁ గలవు ?
గాలినుబికినచాఁపలఁ ƒ గదలుచుండె
నలసగతిఁ బోవు నిందుచూ ƒ లాంఛ్రడపగిది. 18

గీ. ఉన్నతోత్కృష్టపద మొప్పు ƒ డురుతరశ్ర
మాకరంబు, నధోగతి ƒ యతిసులభమ
టంచు నోడలు మనకు బో ƒ ధించునంచుఁ
జెల్లచెల్లగ నాతోడ ƒ సఖుఁడు వల్కె. 19

సీ. ఈరీతిగా నేగి ƒ యెదురుగా వచ్చెడు
దారుప్లవంబులు ƒ దాఁటిదాఁటి,
తాళ్లపూడిని దాఁటి ƒ దాని కవ్వల నున్న
పట్టిసంబును జూచి ƒ భక్తి మ్రొక్కి,

సతుల నవ్వాలి మహాఽనందీశ్వరాలయం
బును జూచు చీవలి ఽ పోలవరము
దగ్గఱగా నేగి ఽ దైవభక్తి నచట
వాలుకాతలముల ఽ పైని వేయఁ

ఆ. బడినపందిరులను ఽ బరికించుచుండఁగా,
గుంపుగుంపులుగను ఽ గొప్పయరఁటి
పండ్లు పట్టుకొనుచుఁ ఽ బడవలచెంతకుఁ
బరుగులిడుచు జనులు ఽ వచ్చినారు. 20

ఉ. వచ్చి "దిగుండి బాబు! దిగి
పట్టెఁడు వంటకముం దినుండు, మీా
కెచ్చుగఁ బెట్టఁబో" మనుచు
నెంతయు వేఁడిరి మమ్ము; "యాత్రికు
ల్వచ్చెడుదాఁక నాయన! క
లంబులఁ దీయకుఁ, డీఫలంబులం
బుచ్చుకొనుం" డటంచుఁ గర
ముం బతిమాలిరి కర్ణధారులన్. 21

సీ. ఆతిథ్యసత్కృతు ఽ లంది క్రమ్మఱ నావ
లందుఁ గూర్చుండి గోఽవింద! కృష్ణ!
రఘురామ! దశరథఽరామ! శ్రీజానకీ
రామ! మానయనాభిఽరామ! యనుచు
లయయుక్తముగ నౌకఽలను నావికు ల్ద్రొక్క
నడపుచు నుండ, నాఽనందవివశు
లౌచు నందుండినఽయాత్రికు లానామ
ములనె యామ్రేడితం ఽ బులుగఁ జేయ,

గీ. రామదాసుని యురుచరి । త్రంబులోని
భక్తికీర్తన లెందఱో । పాడుచుండ,
నతిభయంకర మైన పో । చమ్మగండి
కడను నేతెంచి దానినిఁ । గాంచినాము. 22

క. పడవల నడపుట కయ్యది
గడుఁ గష్టం బైనతావు । గావున నట దం
డడిగా జనములు భక్తిం
బడవైచిరి పసుపుఁ గుంకు । మంబును బండ్లున్. 23

గీ. బావ నారసి యెన్ని దే । వతల కిట్లు
లంచ మిచ్చుట? యని నేవ । చించువెంట
నుప్పరమునుండి పడునట్టి । యుదక మెల్ల
నబ్ధినే చేరు నని నవ్వి । యతఁడు నుడివె. 24

క. పగటనె యోడలపయనం
బగుటను నది కివలియూళ్ళు । నవ్వలియూళ్లున్
నగములు, సికతాతలములుఁ
దెగఁ బెరిఁగిన కాననములు । దృష్టములయ్యెన్. 25

ఉ. మాపులజ్యోత్స్న లందుముని । మాపులనర్ధతమంబులందు,ని
ర్రేపులఁ, జేల్వలై లలిత । పాండురవర్ణము లైనయట్టివె
న్నాఁపులభాతిఁ బర్వెడువ । సంతవనానిలమంజులంబు లౌ
నాపులినంబులిచ్చుముగ । మన్యములీయఁగఁ జాలవిమ్మహిన్. 26

గీ. రాత్రులం దవి సౌఖ్యక । రంబులైన
దినములం దేఁచునెండ యా । త్రికగణంబు;
వెనుకఁ జల్లగ వీచిన । యనిల మిపుడు
వెచ్చనై యన్నములమీఁద । వేయు నిసుక. 27

గీ. ఇసుకతిన్నెలపై నారగించినారు
సర్వవర్ణాల జనములు పాదములను
రామనామామృతస్వాదురసముతోడ
సాటి గనరాని నది తేట నీటితోడ. 28

ఆ. సప్తవర్ణములును సప్తాశ్వధవళాంశు
వందుఁ గలిసి యేక మైనరీతి,
సర్వవర్ణములును సైకతంబున రామ
భక్తి నడరి యొక్కవర్ణ మయ్యె. 29

క. కొనవలె నని యాపరిసర
జనపదముల కేగి యడుగ సంభారములన్,
గొనుఁ డూరక, భక్తులు మీ,
రని యిడుదురు యాత్రికులకు నచటిగృహస్థుల్. 30

ఆ. ఒక్కమడుఁగు "కచ్చు లూరిమందము" నాఁగఁ
బరఁగుతావు కంటెఁ బడియె మాకు;
నద్ది వానకారు నందు సుడులువాఱి
ముంచునఁటయనేక పోతములను. 31

ఉ. అట్టిస్థలంబులం గడచి యద్రుల నెన్నియొ దాఁటిదాఁటి పె
ల్చెట్టుల పచ్చతోఁగులవి చిత్రము భీకర మూచు నేటికిం
బెట్టని పెద్దకుడ్యముల వీఁక నెసంగుచుఁ గన్నుదిర్గ పె
న్గుట్టలఁ బాపికొండలవినూత్నమనస్స్థితిఁ గాంచి కాంచితిన్.

సీ. పెద్దమ్రాఁకులతోడ, వింతపూవులతోడఁ,
బెనఁగొన్నవల్లరీవితతితోడ,
నడవియందలిచెట్ల నట్టిట్టు లంఘించు
రమ్యగోలాంగూలరాజితోడ,

రంగు రంగుల పక్షి శృంగారములతోడ,
నందమౌ నెమిలి నా ట్యములతోడఁ,
మేళవించినవీణ మృదునిస్వనములట్టి
నానావిహంగగా నములతోడఁ,
గీ. గన్నులకు వీనులకుఁగూడ నెన్నరాని
మోద మొనగూర్చు నానగం బులనుజోచి
యంద నగునట్టి యానంద మన్యమార్గ
ములను లభియింపఁ జాలదు పూర్ణముగను, 33

వ. అచ్చట నొకకాంత నారికేళంబులం గొట్టి, డబ్బులతో హరిద్రాకుంకుమ చూర్ణంబులతో అవికగుడ్డను ఫలంబుల నుపహారంబులుగాఁ బడవైచి, పాపిదేవతం దలంచి, చేతులు జోడించి యిట్లనియె. 34

క. మాపండ్లను బెఱకాన్కల
నేపగిదిన్ మ్రింగివైచి తిచ్చినక్షణమం,
దాపగిది మాయఘంబులఁ
బాపీ! హరియించి మమ్ముఁ బాలింపఁగదే! 35

మ. తరణి న్మెల్లగఁ గొంచుఁబోవుదరికి
న్దవ్వైన యావైపుదా
దరిపై, నొక్కనగంబుమీఁద, వనమ
ధ్యం బందు, నేడన్గ్రహాం
తర మొండేనియు లేని యొక్క గుడిసె
న్దర్శించితి ; న్దానఁ గాఁ
పుర మున్నట్టి యతండు యోగబలదీ
ప్తుండో ! మృగప్రాయుఁడో ! 36

ప. ఒండొంటికి సంబంధము
లుండుట, తొల్దొల్తఁ జూడ నురుకష్టముగా
నుండెడు ముమ్మడుఁగు లట
న్నొండగు పరిమితిని వెలయు నిమ్నజలములై. 37

క. క్రూరమకరంబు లీప్రాద
వారి న్వసియించుఁ నంచుఁ బల్కుదు ; రైనన్
దారసిలి యొక్కనక్రము
దారి న్నాకొసఁగ లేదు దర్శనమచేటన్. 38

---

## 25. శ్రీభద్రాచలయాత్ర.

### రెండవ భాగము.

ఆ. అచటనుండి సాగి యరసితి మొకచోట
విఱుగఁ గాచి యేటి కొఱగి, నాదు
నతిథికృతులఁగూడ నందుఁడీ ! యని మాకు
మ్రొక్కునట్టు లుండు నొక్కమావి. 1

గీ. దానిపై జీడిపప్పయ స్థలమొకండు
గల, దచటఁ జెక్కుకొంపలు గాన ; మైన
నందులో యాత్రికులకు సాహాయ్య మొసఁగు
ధర్మతత్పరుఁ డౌ నొక ధనికుఁ డుండె. 2

ఉ. ఆమహితున్స్మరించి చని యవ్వలదవ్వల నున్న యూరి శ్రీ
రామగిరి, న్సదాలయవి రాజితుఁ, బూజితు, యోగరాముఁ ద
న్నామములుచ్చరించుచు వినమ్రతఁగాంచియపార మైనయా
ప్రేమకుఁ బిచ్చికిం గతము వీఁడెకదా ! యని యబ్బ మందితిన్.

ఆ. పోలవరమువారి ఽ పోల్కని శ్రీరామ
గిరిజనాళి యతిథి ఽ కృత్యములను
యాత్రికులకుఁ జలిపి, ఽ యన్నంబులను బెట్టి,
తృప్తి నొందువారిఁ ఽ దృప్తిపఱచి. 4

వ. అక్కడనుండి కదలి చని. 5

చ. సొబగులఁ జిమ్ము తావులను ఽ జూచివనాంతరపుష్పవాసనల్
గుబులుకొనంగ హాయిఁ గని, ఽ గోవు గనంబడలేఁగ యేగిచ
న్గుబికెడురీతిఁ దల్లినదిఁ ఽ గూడిన "కూనవరంబు" క్రిందిచా
శబరిని జూచివందనము ఽ సల్పితిఁ దక్కినవారితోడుతన్. 6

గీ. వఱద గోదావరికి వచ్చు ఽ తఱిని గ్రహణి,
జ్వరము, నీనీటివలననే ఽ వచ్చునంచుఁ
దప్పు నీతలఁ గట్టుఁ ద ఽ త్తటజనాళి;
శబరి! యెందుల కీదుర్య ఽ శస్సు నీకు? 7

ఉ. కోసులు పోయి పోయి కడకున్ననుఁ గొంటిమి సీతస్నానముం
జేసినయుష్ణకుండ, మటఁ ఽ జేఁదెడువారికి డబ్బులిచ్చి, యా
తీసిననీట శీతల న ఽ దీజల మించుక పోసి, స్నానముల్
జేసితి మేము జానకిని ఽ జిత్తములందు నసంస్మరించుచున్.

గీ. అది గడచి దూరమేగితి; ఽ మంత నదిగొ!
భద్రునకు రామభద్రుండు ఽ భద్రము లిడి
ప్రోచినటువంటి పూత భ ఽ ద్రాచల! మని
పొంగి యొకఁ డన నందఱు ఽ పొంగినారు. 9

గీ. విపులముగ భద్రగిరిప్రక్క ఽ వేసినట్టి
కాయమానని కాయంబుఁ ఽ గాంచినాఁడ;

నాలయావరణంబుల నరసినాఁడఁ
బ్రాజ్యతద్గోపురోర్ధ్వచక్రంబుతోడ. 10

క. పడవలు దూరముగా దిగి
నడచి చేరిరి ముందు రామనామావళుల
న్నుడువుచుఁ గొందఱు భక్తులు;
వడి వడిఁ బోయితిమి వెంట బావయు నేనున్. 11

ఆ. వార మయ్యె మేము బయలుదేఱి; నవమి
కరిగినాము భద్రగిరికి; నాఁడు
రెండుయామములకు శ్రీరామకల్యాణ
మగును బగటఁ; దెలిసె నద్ది మున్నె. 12

గీ. భద్రగిరిమీఁద నాలయ పార్శ్వభూమి
నుండు నున్నత కల్యాణ మండపంబు
చెంతకే మందఱము చని చేసినాము
తండ్రి కల్యాణరాముని దర్శనంబు. 13

గీ. రామురూపును గని భోగరాముఁ డనుచుఁ
గొంద ఱతిభక్తిఁ బెట్టిరి వందనములు,
వ్రాలి రిలపైని సుందరరాముఁ డంచుఁ
బ్రజను గల యట్టికొందఱు భక్తవరులు. 14

సీ. గొడుగులు కాన్కగాఁ గొని వచ్చి రచేటికిఁ
చిత్తశుద్ధతను దక్షిణపువారు,
వెలలేనినగలఁ దృప్తిగ స్వామి కీయఁగా
నురుభక్తి వచ్చి రుత్తరపువారు,

కట్టినముడుపుల ఽ నెట్టయెదుట విప్పి
యర్పింపవచ్చిరి ఽ తూర్పువారు,
పరిమళద్రవ్యము ఽ ల్వారి కీయఁగా వచ్చి
రమలాత్ములైన పశ్చిమపువారు.

గీ. బట్టలను బొట్టులందును ఽ భాషలందు
వర్ణములయందు మేనుల ఽ వర్ణములను
వేఱు వేఱుగ నున్నట్టి ఽ వారు గలరు
వేనవేలుగ యాత్రిక ఽ బృందమందు. 15

గీ. రామకోటులు, పలుకుచు, ఽ వ్రాసి వ్రాసి
తాళపత్రంబులనో కాగి ఽ తములపై నో,
కట్ట కట్టలుగాఁ దెచ్చి ఽ పెట్టివాని
స్వామిసన్నిధి నిడుదురు ఽ వందనములు. 16

గీ. ఇసుకఁ జల్లిన రాలని ఽ యీమహాజ
నంబు మధ్యంబునం జిదా ఽ నందయోగు
లాత్మఁ బరమాత్మఁ గట్టిన ఽ యములు లుండి
రల్పసంఖ్యాకులైనవా ఽ రచట నచట. 17

ఉ. తంబుఱ మ్రోఁతల, న్వివిధ ఽ తాళనినాదముల, న్మృదంగశ
బ్దంబుల, గొల్లసుద్దులను, ఽ బాడెడుకీర్తనలందు, భక్తవ
ర్గంబుల భాషణంబులను, ఽ రామపదాంచితనాద ముండి క
ర్ణంబులఁ జొచ్చె భద్రగిరి ఽ రాముని యుత్సవ మెన్న శక్యమే ?

ఉ. వచ్చిన యాత్రికావళికి ఽ భక్తులు భక్తియుతంబుగా జనుల్
మెచ్చెడు భోజనంబు లిడి ఽ మేలగుపానక మిచ్చి రామనా
మోచ్చరణంబుతోడ వ్యజ ఽ నోత్కర చందనపుష్పపుంజముల్
దెచ్చి యొసంగి మ్రొక్కి పరి ఽ తృప్తులఁ జేయుదురమ్మహాస్థలిన్.

గీ. అందు వేంకట రమణాఖ్యుఁ డను నొకండు
బ్రహ్మచారి యశీతివర్షములవాఁడు
దైవభక్తుఁడు నతిథిసత్కారపరుఁడుఁ
జేసె సంతర్పణం బతిచిత్రముగను. 20

మ. ధనురాకారము వీఁపుఁ, రోమములు జ్యో
త్స్నాసన్నిభంబుల్, పురా
తనము ల్కృత్యము, లేక భుక్తి; యయిన
న్దారుణ్యసత్త్వాఢ్యు లా
జనముల్ నల్వురుగూడి పట్టుటకుఁ గ
ష్టంబైన పాత్రంబుఁ జు
ల్కనతం డొక్కఁడు నెత్తె రామ! యనివీఁ
క న్మారుతి నివ్వెఱఁజెందున్. 21

గీ మంచినగ లుంచి కల్యాణమండపమున
సీతతోడుత రాము వసింపఁ జేయ,
వారి నచ్చట నేత్రపర్వముగఁగంటి
రామచంద్రుఁడు మోహనరాముఁ డంటి. 22

గీ. ఇట్టిమోహనరూపుఁడ వీవు గనుక
నే కదా! గోపనామాత్యుఁ డిల్లు గుల్ల
చేసికొని స్వామిపై కముఁ బోసి నీకుఁ,
జెఱను బడియును, రామ! నిన్నొఱఁగఁడయ్యె. 23

ఉ. "అచ్చపుటుత్సవంబునఁ గ
టా! యెటు వచ్చెనో పచ్చకాంద్రపె
న్ముచ్చెదసంబు?" లన్న, "సుఖ
మూర్తియొనర్చిన సృష్టిలో నెటు

ల్వచ్చెనో బాధకంబు లగు
పాములుఁ దేళ్లుఁ దెవుళ్లు నీవు వా
క్రుచ్చిన, ను త్తరం బిడుదుఁ
గోరినయ"ట్లనె బావ నవ్వుచున్. 24

గీ. వెనుక లక్ష, పందొమ్మిది వేలకుఁ బయి
నిప్పు, డేఁటేఁటఁ గోవెల కిచ్చుచుండు
హైదరాబాదు ప్రభువరు న్యాయమునకు
సంతసింతురు వచ్చిన సర్వ జనులు. 25

ఆ. ఆనిజాముధర్మ మట్లుండ, స్వామికి
భక్తజనులవలన వచ్చునట్టి
ముడుపుసొమ్ము, నగలు మొదలగుకాన్కల
విలువ యమిత మౌచు వెలయుచుండు. 26

గీ. దాశరథిపెండ్లి యౌరసి దశమినాఁడు
పర్ణశాలకుఁ బోయితి బావతోడ;
నచట సీతావియోగదుఃఖాత్ముఁ డైన
శోకరాముని దర్శించి శోకపడితి. 27

సీ. సీత పూర్వము నార చీరంబులారఁ, ని
చ్చోటనె, వేసిన దన్న చోఁపఱాలఁ;
బసుపు గుంకుములుగా వాడెఁ దల్లి యివన్న
పీతారుణంబులౌ పిల్లఱాలఁ,
గపటకురంగంబు కాల్లి వేయని చూపు
డొక్క నొక్కలుగల్గు నొక్కశిలను,
మాయసన్యాసి య మ్మను గొన్న చోటన్న
రాకాసియడుగుల రాతినొకటి,

గీ. నరసి రామాయణపు విషయములు గొన్ని
స్మృతికి వచ్చుట నాత్మవిస్మృతిని జెంది
ప్రబలభక్తిశోకములకు వశుఁడ నౌచుఁ
బుడమిఁ గన్నీళ్లు వలవల వడిచినాఁడ 28

వ. తిరుగ భద్రాచలంబునకుం జేని, రథోత్సవం బగుదాఁక
శ్రీరామమూర్తి సేవించి, స్వగ్రామాభిముఖులమై, యొన్నా
ళ్లకుఁ దనివి తీరమింజేసి, యెక్కలేక, యెక్కలేక, మరలఁ
దరి నెక్కుతఱి, బావ నన్నుఁజూచి యి ట్లనియె. 29

ఆ. నిద్ర లేదు, జనుల నిర్బంధ మెక్కువ,
తిండి వేళ కమర; దుండ నీఁకను,
దిరుగ గ్రామమునకు నరుగఁగావలె బావ!
వడిగఁ బడవ నెక్క వలయు ననియె. 30

క. అని నన్ను దెప్పనుడులకుఁ
గినియక చిఱునవ్వు నవ్వి కేవలశుద్ధా
త్మను భద్రగిరీశునకున్
వినతులు గావించి బావ విన ని ట్లంటిన్. 31

ఉ. రాసులఁ గర్కటంబు, నుడు
రాజిఁ బునర్వసుఁ, జైత్రశుక్లముల్
మాసములందుఁ బక్షముల,
మానితమౌ నవమి న్తిథిచ్ఛటన్,
వాసరపాళి సౌమ్యమును,
వర్ణములన్ 'ర' 'మ', లంబికాతతిన్
గోసలరాజపుత్రికను,
గొప్పగఁ జేసినప్రోడ వేఁడెదన్. 32



## 26. హారతికర్పూరము.

పెప్పర్మింటు, మెంథాల్, టర్పెంటైన్ అని చెప్పఁబడు కర్పూరతైలము, లావెండరు, హారతికర్పూరము—ఇవన్నియు సుగంధిద్రవ్యములు. అన్నియుఁ బెద్దచెట్లనుండియో, చిన్న మొక్కలనుండియో వచ్చినవి. ఇట్టిపదార్థములను సాధారణముగాఁ గ్రిమిహారములుగాను, నౌషధములుగాను, నాహార పదార్థములకు సువాసననిచ్చు నుపపదార్థములుగాను, వాడుదురు.

'పెప్పరు' అనఁగా నింగ్లీషులో మిరియము. మింటనఁగా సువాసనతైలము నిచ్చు మొక్క. సుగంధి గుల్మమునుండి తీయఁ

బడి మిరియమువలె గాటుగా నుండును గనుకఁ బెప్పర్మింటను కట్టిపేరు వచ్చినది. దీని నజీర్ణాదివ్యాధుల కుపయోగపఱతురు. భక్ష్యములలోఁగూడ సువాసనకై వేయుదురు.

పెప్పర్మింటు చేమురును మిక్కిలి చల్లపఱిచినప్పుడు తెల్లని మైనమువంటి పదార్థమొకటి యడుగునకు దిగును. దానినే మెంథాలందురు. తలచుగాఁ దలనొప్పి వచ్చునప్పుడు దీనిని రాచుకొందుము.

టర్పెంటైనను నది యొకజాతి చెట్లనుండి తీయుదురు. స్వాభావికముగాఁ దానంతట నది చెట్లనుండియైన వచ్చును, లేదా, చెట్లకు గంట్లుపెట్టుటవలన నైన వానినుండి స్రవించును. అది మద్యసారములోఁగరఁగును, బట్టిని బెట్టినప్పుడు కర్పూర తైలము నిచ్చును. దీనిని నొప్పులకురాచి మర్దనము చేయుదురు. ఇదిలోపలికిఁ బుచ్చుకొనినఁ, బేగులలోని పురుగులఁ జంపును, చులుకు పుట్టించును, మూత్రస్రావ మెక్కువ చేయును.

లావెండ రొకజాతిమొక్కల పూవులనుండి తీయుదురు. పూవులను బట్టిపెట్టిన యెడలఁ ద్వరగా హరించిపోవు నొక తైలము వచ్చును. దానిని లావెండరు తైలమందురు. దీనిలో మఱికొన్ని తైలములు గొంచెముగా వేసి సారాయిలోఁ గలిపి లావెండరునీరు చేయుదురు. ఈనీరే పరిమళద్రవ్యముగా వాడుకొనుచున్నారు.

లావెండరు పూవులును రెమ్మలును బట్టలలోఁ బెట్టిన, నవి గుమగుమ లాడుచుండును. రోమవస్త్రములలోఁ బెట్టిన వానిని

బురుగులు గొట్టవు. లావెండరు తైలమును, లావెండరునీరు చేయుటకేకాక, మందుగాఁ గూడ నుపయోగపడుతురు.

చివరది హారతికర్పూరము. దీని ననేకరూపముల మీరు చూచుచున్నారు. కర్పూరహారములను బెండిండ్లలో 'నధూవరులకును, నామహాత్ములైన గొప్పవారికిని, వేయుదురు. దేవతార్చనలందును వ్రతములందును స్వామికిఁ గర్పూరపు బిళ్లలు వెలిఁగించి నీరాజన మిత్తురు. మంచిగంధములోఁ గలిపి పూసికొందురు. ఔషధములలోను, దాంబూలమునందును, మిఠాయిలోను నుపయోగపడుచు పచ్చకర్పూరము పరిశుద్ధముచేసిన కర్పూరమేకాని రెండు గాదు. భోగపదార్థమైనపచ్చకర్పూరమును సంస్కృతమున ఘనసార మందురు.

పిల్లలకుఁ గర్పూరము వేసితి మని చెప్పునది కర్పూరము గాదు. కర్పూరమువలెఁ దెల్లగానుండు రస సంబంధమైన యొక యౌషధము.

పైఁజెప్పిన నాల్గు ద్రవ్యములవలెనే కర్పూరము గూడ నొక చెట్టునుండి వచ్చును. కర్పూరవృక్షములు చీనా, జపాను దేశములందును, చీనాప్రాంతమున నుండు ఫార్మోజాద్వీపమునందును, హిందూమహాసముద్రములో నుండు జావా, సుమిత్రా, బోర్నియో దీవులందును విశేషముగాఁ గాన నగును.

ఈ పాఠముఖమున నున్న బొమ్మను జూడుఁడు. కర్పూరపుఁ జెట్టు పెద్దవృక్షముగాని చిన్న మొక్క గాదు. అది 50 అడుగుల యెత్తు పెరుఁగును. దానికి బహుశాఖ లుండును. చెట్టు మీఁది పట్ట నున్నగాఁ గొంచె మాకుపచ్చగా నుండును. ఆకులు పచ్చగా, నిగనిగలాడుచు నీఁటె యాకారముగాఁ

బొడుగైన తొడిమలతో వృక్షము నంటియుండును. అవి నలిపి మూచూచిన గాటుగప్పురపువాసన గొట్టును. పుష్పములు చిన్నవి, తెల్లగా నాలుదళములు గలిగియుండును. ఫలాకృతి బొమ్మలోఁ జూపినవిధముగా నుండును.

వేఱుగాఁ జేయ నక్కఱలేకుండఁ గర్పూరము, వృక్షగర్భమందును, ముఖ్యముగాఁ గనుపులయొద్దను, జెట్టుతొఱ్ఱలందును బెల్లపెల్లలుగా దొరకును, సుమిత్రా బోర్నియో ద్వీపములందుఁ జెట్లు గొట్టి కప్పురమును దీయుదురు. ఒక్కొక్కచెట్టు 20 పౌండుల సరకు నిచ్చును.

చెట్టుకొట్టి, మంచి గట్టికఱ్ఱను గలపగా నిండ్లు కట్టుకొనుట కట్టె పెట్టి, కొమ్మలను రెమ్మలను జిన్నచిన్న ముక్కలుగాఁ గొట్టి కర్పూరము దీయుట కుపయోగపఱుతురు.

కర్పూరము తీయువిధములు భిన్నములుగానున్నవి. ఫార్మోజావారొకరీతిగాను చీనావారొక రీతిగాను దానిని తయారు చేయుదురు.

జపానువారు కర్పూరమందఱికంటెను సున్నితముగా సిద్ధము చేయుదురు.

ఎంత జాగ్రత్తతోఁ జేసినను ఈదేశములనుండి యెగుమతియైన కర్పూరపుసరకును పాశ్చాత్యులు మరలసున్నముతోను ఆకుటాతితో రాచిన యినుపపొడితోను శుద్ధిపఱిచి, తరువాత నౌషధముల కుపయోగపఱుచుకొందురు.

కర్పూరము, చూపునకుఁ దెల్లగాను స్వచ్ఛముగాను, జేతికి గట్టిగాను, జేమురు చేమురుగాను నుండును. కాని దానిని గత్తితోఁ గోయ వచ్చును, జేతితో విఱిచి ముక్కలుచేయ

వచ్చును. ఆఘ్రాణించుట కది మిక్కిలి మనోహరముగా నుండును. కాని నోటికిఁ జేదుగను గారముగను నుండును.

అది యతి సులభముగా నంటుకొని వెలుఁగును. గాలి యేమియుఁ జొరనిబరణిలో జాగ్రత్తగా దాఁచినఁగాని, కర్పూరము వేగముగా గాలిలో హరించిపోవును.

అది విస్తారముగా నీటిలోఁ గరఁగదు. కాని సారాయిలోఁ బూర్తిగాఁ గరఁగి కలిసిపోవును. సారాయిలోఁ గలిపిన కర్పూరమునకుఁ గర్పూరద్రావక మనిపేరు. ఈద్రావకము నీళ్లలోఁబోసినయెడలఁ గర్పూరము వేఱుపడి తెల్లని పెచ్చులుగా దిగును.

చిన్న కప్పురపుఁ బలుకును దీసికొని మెత్తగాఁ బొడుము చేయుము. ఆపొడిలోని రెండు మూఁడు చిన్న రేణువులు దీసి పెద్దపళ్ళెములోఁ బోసిన మంచినీళ్లమీఁద విడివిడిగాఁ బడవేయుము. వేయఁగానే యవి సివాలాడువారి తలలవలె గిఱ్ఱునఁ దిరుగ మొదలుపెట్టును. కాని యొకనూనెచుక్క నీళ్లమీఁద వేయఁగానే క్రుక్కినపేలవలె నవి గదలక మెదలక పడియుండును. ఇది చూచుట కతిచిత్రముగా నుండును. బాలురెల్లరింటియొద్ద నిది చేసికొని యానందింప వచ్చును.

కర్పూరోపయోగము లనేకములు. దీనివాసన తాఁకిన, గుడ్డలుగొట్టు పురుగులు దరికి రావు. కనుకఁ జిత్రవస్తుప్రదర్శనశాలలలోని సరకులలోఁ గర్పూరపుఁబలుకు లుంతురు. కర్పూరపుఁ గఱ్ఱ లఘువుగాను లేఁతరంగుగాను నుండును, గాని గట్టిది. దానితోఁజేసినపెట్టెలు మొదలగు సరకులు మనోజ్ఞముగా నుండి చిరకాలము మనును. సుగంధిదారు వగుటచేఁ జెదలుగాని

యితరములైన పురుగులుగాని దానిఁ బాడుచేయవు. కనుకఁ జీనాదేశ తక్షకులు దానిఁ దఱచుగా వాడుదురు.

వైద్యులు లేపనముగాఁ జేసి కర్పూరమును నొప్పులకు వాడుదురు. దీనిని "కాంఫర్ లినిమెం" టందురు.

సజ్జనసాంగత్యము చందనకర్పూరసమ్మేళనమువంటి దనియు దుర్జనసంగతి గంజాయియుమ్మెత్తలకూడికవంటి దనియు వైరాగులు పాడుదురు.

---

## 27. సత్కార్యము లూరకపోవు.

### మొదటి భాగము.

తొల్లి ద్వారకలో రత్నాకరుఁ డను నొకవర్తకుఁ డుండెను. అతఁ డాయాదేశములవారి కభిమతము లైనవస్తువులను సుందరముగ నిర్మించి యోడలపైఁ బంపి, చవుకగా నమ్మించి. కోట్లకొలఁది ధనము నార్జించి, వణిక్ప్రభు వను బిరుదమును సంపాదించెను. కాని తాను గడించిన విత్తమును సత్పాత్రదానమునకుఁగాని యథోచిత భోగములకుఁ గాని యుపయోగిఁపక, పరమలుబ్ధుఁడై కాలము పుచ్చుచుండెను. అతనికి సౌదామిని యను సతీతిలకము గలదు. ఆమె దయార్ద్ర హృదయయు, విదుషీమణియు, దైవభక్తురాలు నైనందున, దీనుల దుఃఖాపనోదనమునకై యత్నించుచుండెను. కాని భర్త కడు లోభి యగుటచే నామె పలుమాఱు భగ్నమనోరథ యగుట తటస్థించుచుండెను.

కొంతకాలమున కీసతీపతులకు దయాకరుఁ డను నొక పుత్ర రత్నము జనించెను. గుణవతి యగు నామాతయొక్క సుగుణము లీబాలునకుఁ బట్టువడెను. తన నామమును సార్థకపఱచుకొను నను సూచన లెన్నియో చిన్నతనమునందే యతనిలోఁ గనఁబడఁ జొచ్చెను. అతఁడు గురువులయందు వినయ విధేయతలు గలిగి, సామాన్యముగ నన్నివిద్దెలను, ముఖ్యముగఁ దన కులవిద్యను, నభ్యసించి నిండు జవ్వనమున నలరారుచుండెను. ఇట్టి పుత్రరత్నమునకుఁ దగిన కన్యకామణిని దెచ్చి వివాహము చేయవలయు నని తల్లి దలపోయుచుండెను. కాని స్వయముగ నార్జింపఁ గలిగినఁగాని కుమారునకుఁ బెండ్లి సేయఁ దగ దని తండ్రి యూహించి యొకయోడనిండ సరకులను నించి యతని వశము చేసి తగిన పరిజనమును గూడ నిచ్చి వర్తకము చేయుటకై యాతని విదేశముల కంపెను.

అతఁ డొక రేవుఁ జేరి గొప్ప గుడారమును వేయించుకొని బేరమునకు వచ్చిన వర్తకులతో వ్యవహారవిషయములఁ గూర్చి ముచ్చటించు చుండెను. ఒకనాఁటి మధ్యాహ్నమున నేఁబండ్రు రక్షకభటులు విచ్చుకత్తులను జేతఁ బూని, కాళ్లకును జేతులకును సంకెలలు వేసిన నాలుగునందల ఖైదీలను దీసి ాని పోవుచుండిరి. మండువేసవి యగుటచే నెండ వేఁడిమి ోర్వఁజాలక, కంటఁ దడిపెట్టుకొని దీనాననులై పోవుచుండు నాఖైదీలను దయాకరుఁడు చూచి, వారు చేసిన తప్పిద మేమో కనుఁగొనిరమ్మని యొక సేవకునిఁ బంపెను. అతఁడు పోయి తెలిసికొని వచ్చి, వారాదేశపు కాఁపు లనియును, దమ పన్నులను జెల్లింపనందున రాజాజ్ఞచేఁ జెఱసాలకుఁ గొంపోవఁబడు

చున్నా రనియును, మనవి చేసెను. జాలిగుండె గల దయా కరుఁడు వారు చెల్లింపవలసిన ధనమును దెలిసికొని తన సరకుల నమ్ముటచే వచ్చిన విత్త మందులకుఁ దగినంతమాత్రమే యుండినను, దానిని జెల్లించి వారిని బంధవిముక్తులుగఁ జేసి, రిక్తహస్తుఁడై ద్వారకకు వచ్చెను.

దయాకరుఁడు చేసిన పనికై రత్నాకరుఁడు మండిపడి పుత్ర వాత్సల్యమును లేశమైనను జూపక యాతని నిలువెడల నడి చెను. సౌదామినీదేవి కన్నీరు మున్నీరుగ నేడ్చుచునిది మొదటి తప్పిద మగుటచేఁ బుత్రుని క్షమింపవలయు నని యెన్నిసారు లో వేఁడికొనఁగాఁ, దుదకు నాలుమాసములకుఁ దండ్రి కుమా రుని రప్పించి, యెంతో బుద్ధి చెప్పి, మిక్కిలి విలువగల వస్తు వులతో నిండిన మఱియొకయోడ నిచ్చి, యీతూరి తప్పక లాభమును గొని రావలయు నని యాజ్ఞాపించి పంపెను.

దయాకరుని యోడ నడికడలిని బోవుచుండ నెట్టయెదుట మఱియొక యోడ గనఁబడెను. అందెంగఱో గొల్లు మని యేడ్చు చుండిరి. ఆయార్తనాదమును వినఁగానే, కరుణార్ద్ర హృదయుఁడగు దయాకరుఁడు దన యోడనుండి యాయోడకుఁ బోయి యాయాక్రందనమునకుఁ గారణ మరయఁగా, వా రందఱు వివిధ దేశనివాసు లనియు, వారిని బానిసలు నమ్ముటకై యొకవర్తకుఁడు చెఱగొని పోవుచున్నాఁడనియుఁ దెలియవచ్చెను.

అప్పుడే కనికరపుగని యగు నా దయాకరుఁ డావర్తకుని సమీపించి వీరి నందఱను విడుదల చేసినయెడల నాయోడలో నుండు విలువ గల సరకుల నన్నియు నీస్వాధీనము చేసెద నని

నైనను నాపుత్రున కనుకూలమైన బుద్ధిని బ్రసాదింపవే" యని దైవమును బ్రార్థించి "వత్సా! అమితధనప్రాప్తిరస్తు" అని దీవించి సెల వొసఁగి పంపివేసెను. దయాకరుఁ డెంత ప్రయత్నము చేసినను నారాచేకన్నియ యూరు దెలియకుండుటచే, వారిరువుర చిత్రపటములను దనయోడలో నున్నయెడలఁజూచి నవా రెవరైనను వారిని గుర్తింపఁ గలుగుదు రను తలఁపుతో వారిచిత్రములను జిత్రకళావిశారదుఁ డగు నొక మిత్రునిచే వ్రాయించి తనయోడలోనుంచుకొని పయనమై పోయెను.

ఈతూరి దయాకరుఁడు చేరిన రేవొక రాష్ట్రమునకు రాజధానియై యుండెను. కావున సముద్రతీరవిహారమునకై మంత్రితో వచ్చిన యాదేశాధిపతి యీయోడలోనికి వచ్చి దయాకరుఁడు చూపు నాభరణములఁ జూచుచు నందు వ్రేలాడఁ గట్టిన చిత్రపటములను గనుఁగొని, విస్మయవిషాదానంద పరవశుఁడై కంటఁ దడి వెట్టుకొని గద్గదస్వరముతో నాకన్నియ తన పుత్రిక యనియు నావృద్ధురా లామె సేవకురా లనియు దయాకరునకుఁ దెలిపి వారి క్షేమసమాచారముల నాతనిచేఁ దెలిసికొని యధికమూల్యమున కాభరణముల నెల్లఁ గొని, యాయోడను ధనముతో నింపి తనపుత్రికను సేవకురాలిని గొనివచ్చుటయే కాక జననీజనకులతోడ నేతెంచి, తన యాతిథ్యమును స్వీకరించి తన్నుఁ గృతార్థుని జేయవలయు నని దయాకరునిఁ బ్రార్థించి, గౌరవించి, తన మంత్రిని దోడుగా నిచ్చి వీడ్కొలిపెను.

దయాకరుఁడు తన యూరు చేరి, తలిదండ్రుల కాహ్లాదమును గొలిపి, వారిని రాజపుత్రిని నామె సేవకురాలిని మం

త్రిని వెంటఁ గొని యోడపైఁ బయనమై రాజదర్శనార్థము వచ్చుచు నుషఃకాలమున నందఱు నింకను బరుండియున్న సమయమునఁ దాను మాత్రము మేల్కొని చెల్లగాలికి నోడకొనయందుఁ గూర్చుండి పరమేశ్వరుని ధ్యానించుచుండఁగా, మంత్రి మేల్కొంచి దయాకరుఁడు బ్రదికియుండిన యెడలఁ దన కుమారున కారాజపుత్రి వివాహమున లభించుట దుర్లభమని యెంచి యా సుగుణమణిఖని యగుదయాకరుని నెవరికిని దెలియకుండఁ దటాలున సముద్రములోఁ బడఁద్రోసెను.

దయాకరుఁడు లేని యాయోడ రేవు చేరి మంత్రిని దప్పఁ దక్కినవారి నెల్ల దుఃఖసాగరమున ముంచివైచెను. ప్రాతఃకాలమునఁ దెప్ప నెక్కి చేఁపలఁ బట్టుచున్న యొక బెస్త సముద్రమున నీఁదుచున్న రాజలక్షణలక్షితుఁ డగు దయాకరునిఁ జూచి యతనిఁ దన తెప్పపై నెక్కించుకొని యతని కెప్పుడైన రాజ్యము లభించినయెడల నందులో సగము దన కిచ్చునట్లు పత్రము వ్రాయించుకొని యాదయాకరుని, నోడచేరిన రాజధానిలో వదలిపెట్టి తన త్రోవను దాను బోయెను.

ఒకనాఁటి యుత్సవమున రాజపుత్రి భిక్షుకులగుంపులో నున్న దయాకరుని గుర్తించి తండ్రికిఁ దెలుపఁగా నారాజు దయాకరుని రప్పించి తన పుత్రికామణి నిచ్చి మిక్కిలి వైభవముతో వివాహము చేసి తనకుఁ బుత్రులు లేనందున నా యుత్సవమునకై యరుదెంచియున్న వివిధదేశాధీశుల సమక్షమున మహోత్సాహముతో సౌజన్యనిధి యగు నా దయాకరునకే తన రాజ్యము నిచ్చి పట్టాభిషేకము గావించెను.

అప్పుడు తన్ను రక్షించినజాలరి వచ్చి పత్రమునుజూపి రాజ్యములో సగము తన కిమ్మని యడుగఁగా, దయాకరుఁడుగొంచెమేనియుఁ గొంకక యర్ధరాజ్య మిచ్చుటయేకాక మఱేమి గోరినను నిచ్చుటకు సిద్ధముగా నున్నా నని పలికెను. అప్పు డా చేపలఁ బట్టువాఁడు దివ్యసుందర విగ్రహమును దాల్చి యీ దయాకరునిపైఁ బుష్పవర్షమును గురియించి గంభీరమధుర స్వరముతోఁ దాను దేవదూత ననియుఁ గేవల మతని సత్యశీలతా సౌజన్యములను బరీక్షింప నారూపమున వచ్చితి ననియుఁ జెప్పి, చిరకాలము రాజ్య మనుభవించి సుఖింపు మని యాశీర్వదించి యదృశ్యుఁడయ్యెను,

---

## 29. గృహస్థుగొప్పవాఁడా? సన్యాసి గొప్పవాఁడా?

భగవదారాధనముకై ప్రపంచమువదలి వెళ్లినవాఁడు, ప్రపంచములోనుండి లోకోపకారార్థము పనిచేయువారు భగవంతుఁ బూజించుచున్నవారు గారని చెప్పఁగూడదు. దారపుత్రాది కుటుంబపోషణముచేసి కొనుచు లౌకిక ప్రవృత్తిలో నుండు సంసారి, ప్రపంచత్యాగము చేసినవారు పనికిమాలిన త్రిమ్మరులనియు నెంచఁగూడదు. దీనికి దృష్టాంతముగా నొక కథచెప్పెదను.

"ప్రపంచము విడిచి సన్యాసియైన వాఁడు గొప్పవాఁడా? అందుండి గార్హస్థ్య ధర్మములు నెఱవేర్చుకొనువాఁడు గొప్ప

వాఁడా? అని యొకరాజు తనదేశమునకు వచ్చిన సన్యాసుల నందఱనడుగు చుండెడివాఁడు. అందనేక వివేకవంతు లీవిషమ సమస్య విడఁగొట్టుటకుఁ బ్రయత్నించినారు. సన్యాసియే గొప్ప వాఁడని కొందఱు చెప్పఁగా, "ఋజువుపఱిచి మీమాట నిలుపుకొనవలెను" అని రాజాజ్ఞాపించెడువాఁడు. వారట్లుచేసి కొనలేక పోఁగా "మీరు పెండ్లియాడి గృహస్థులు కండు" అని రాజువారిని నిర్బంధించుచుండెను. నిజ విహితధర్మములు నెఱపుకొనుగే స్తే గొప్పవాఁడని కొందఱు చెప్పఁగా, రాజు మీ మాటకుఁగల ప్రమాణోపపత్తు లేమి యని యడుగు చుండెను. వారవి చెప్పలేక పోఁగా వారిని గూడ రాజు బలాత్కారముగా గృహస్థులఁ జేయుచుండెను.

ఇట్లుండఁగా నుండఁగా నొక నాఁడొక పడుచు సన్యాసి రాజు నొద్దకువచ్చుట తటస్థించెను. యథాపూర్వముగా రాజ తనికిఁ బ్రశ్న వేసెను. "రాజా! యెవని యాశ్రమములో వాఁడే గొప్పవాఁడు—గృహస్థాశ్రమములో గృహస్థుగొప్ప, సన్యాసాశ్రమములో సన్యాసిగొప్ప — ఉభయులు సమాన గౌరవ పాత్రులే" అని సన్యాసి జవాబుచెప్పెను. సప్రమాణముగా నీ వాదము సిద్ధాంత పఱుచుకొమ్మని రాజు పల్కెను. "అట్లేచేసెదనుగాని, నామాట యథార్థమని ఋజువుపఱుచు కొనుటకు, నీవు నాతోవచ్చి కొన్నాళ్లునావలెఁ బ్రవర్తింప వలెను అని పడుచు సన్యాసి ప్రత్యుత్తర మిచ్చెను. మంచిది అట్లే కావించెదనని చెప్పి రాజు తన రాష్ట్రమునువదలి సన్యాసివెంబడి ననేక దేశములు తిరిగితిరిగి తుదకొక పెద్దదేశములోఁ బ్రవేశించెను. ఆ దేశపు రాజధానిలో నొక పెద్ద యుత్సవము

జరుగుచుండెను. సంగీత వాద్య ఘోషములును ఘోషకప్రకటన వచనములును ఇరుపుర చెవులనుబడెను; ప్రజలు మంచి మంచి దుస్తులు ధరించి వీథులలో గుంపులు గుంపులుగాఁ గూడు చుండిరి. ఏదో యొక పెద్ద చాటింపు గావింపఁబడుచుండెను. రాజును సన్యాసియు నేమి జరుగునో చూతమని యటనిలఁ బడియుండిరి. తద్దేశ రాజపుత్రికవచ్చి తన యెదుటఁ గూడిన పురుష బృందములోఁ దన యిష్టమువచ్చిన పతిని స్వయంవర ణము గావించుకొన నున్నదియని పెద్ద యెలుఁగుతో నొకఁడు చాటించుచుండెను.

ఈ రీతిగా రాజ కన్యలు వరుల నెన్ను కొనుట హిందూ దేశములోని ప్రాచీనాచారము. వాంఛనీయ భర్తృలక్షణము లఁగూర్చి రాచకన్నెలకుండు నభిప్రాయములు భిన్నభిన్నము లుగా నుండును. కొందఱకు సుందరతముఁడు కావలయును, గొందఱ కధికవిద్యావంతుఁడు కావలెను, గొందఱకమిత ధనవంతుఁడు కావలయును — ఇట్లే నృప పుత్రికల యభిరు చులు నానా విధములుగా నుండును. కావున చుట్టు పట్ల నుండు రాజులందఱు చిత్రచిత్రవస్త్రాలంకార భూషితులై వచ్చి యామె యెదుటనుందురు. అప్పుడప్పుడు కన్యాకాము లైన రాజపురుషులుకూడఁ దమతమ సుగుణగణములను, దమ్ము రాజకన్య వరించునను ఆశపెట్టుకొని తాముండుటకుఁ గల కారణములను,దమ ఘోషకులచేతఁ జాటింపించుకొను సంప్రదా యమునుగలదు. సర్వాభరణ భూషితురాలై మహావైభవ ముతో రాచకన్నె అందలములోఁ గూరుచుండి స్వయంవర మునకు వచ్చిన రాజమండలము చుట్టునుదిరిగి ప్రతివాని నవ

లోకించి వానిఁ గూర్చి వినుచుండును. వీనులకు వీక్షణములకు నచ్చని యశస్సౌందర్య విహీనులకడకు బోయీలు పల్లకీ గొని పోయినపుడు, "చాలు, సాగిపొండు" అని వాండ్రతోఁ జెప్పి యా నిరాకృత వరనికరమును మఱి చూడక యామె యావలికిఁ బోవుచుండును. వచ్చిన రాజబృందములో నెవరేని యామెకు నచ్చినయెడల, నామె యతని మెడను బుష్పమాల యొకటి వేయును, అంతట నతఁడామెకు భర్తయగును.

మన రాజును సన్న్యాసియు వెళ్లిన దేశపు రాజపుత్రిక కట్టి వినోదకరమైన మహోత్సవమే జరుగుచుండెను. ఆమె భువనైక సుందరి; ఆమెకు భర్తయగు వాఁడు ఆమె తండ్రిగారి రాజ్యములో నర్ధభాగమున కధిపతి యగును. సర్వాంగ సుందరుఁడు తనకు భర్త గావలయునని యామె యభిలాష; కాని యామెకంటె కింపైన వాఁడెవఁడు నామెకులభింపలేదు. స్వయంవరోత్సవము లనేకములు జరిగెను గాని యందెందును ఆమెకు నచ్చిన వరుఁడు దొరకలేదు. పూర్వస్వయంవరములకంటె నిది యెక్కువ వైభవవంతమైయుండెను; వెనుకటివానికంటె దీని కెక్కువమంది వచ్చియుండిరి. పల్లకీలో నొక దివ్య పీఠముపైఁ గూరుచున్న యాపరమసుందరిని బోయీలామహాసభలో నొకచోటనుండి యొకచోటికిఁ గొనిపోవుచుండిరి. ఎవనియందును ఆమె మనసులగ్నమైనట్లగపడలేదు ; వెనుకటి సభలవలెనే యీసభకూడ నిష్ఫలము కాఁబోవుచున్నదని యెల్లరును నిరాశులైయుండిరి. అంతట, ఆదిత్యుఁడవనికి దిగివచ్చెనా యనుకొనునంత యందముగలయొక పడుచుసన్న్యాసి యాసభకు వచ్చి యొకమూలనిలుచుండి జరుగుచున్నదంతయును జూచు

చుండెను. రాచకన్నెయందల మతనికడకు వచ్చినది. దృష్టి యతనిపైఁ బడుటతోడనే పల్లకీయాఁపి యామెయతనిమెడలోఁ బుష్పహారము వైచెను. వెంటనే యా యుపసన్యాసి యా పూదండ యూడఁదీసి "చీ! చీ! యిదేమిపిచ్చి! సన్యాసినైన నాకు వివాహమేమి?" యని పల్కుచు అది యావలఁ బాఱ వేసెను. దరిద్రుఁడగుటచేఁ దనపుత్రికను వివాహమాడుట కతఁడు జంకుచున్నాఁడేమోయనుకొని రాజు "మా అమ్మా యితో అర్ధరాజ్యము వచ్చును; నామరణానంతరము యావ ద్రాజ్యము నీయధీనమగును" అని చెప్పి మరలనతని మెడపై పుష్పహారముంచెను. అతఁడు తిరుగనదితీసి పాఱవేసి "చీ! చీ! నాకుఁ బెండ్లియక్కఱలేదు." అని చెప్పుచు సభనుండి లేచి వడి వడిగా నావలికి నడచిపోవు చుండెను.

నృపకుమారి యాతరుణవయస్కునిపై నతికామాసక్తయై యుండుటచే "అతనిని బెండ్లియాడినఁగాని నా ప్రాణములు నిలువవు" అనిచెప్పి పోవువాని మరలించి తెచ్చుటకై యతని వెన్నంటి పోవుచుండెను. "రాజా! ఆ యుభయులవెంట మనమునుబోవుదము, రమ్ము" అని రాజునటకుఁ గొనివచ్చిన మన సన్యాసి యతనితోఁ జెప్పెను. ఈ యిద్దఱును దూరముగా నుండి యా యిరువురను వెన్నాడిపోవుచుండిరి. రాజకన్యను బెండ్లాడనొల్లనని చెప్పిన సన్యాసి పొలములలోఁబడి పెక్కుమైళ్లు నడచి నడచి యొకయడవిచొచ్చెను; రాచకన్నె వానివెంటనే పోవుచుండెను; మనవారిరువురు వారివెంబడించి చనుచుండిరి. పడుచు సన్యాసి కాయరణ్యములోని చిక్కుత్రోవలన్నియు బాగుగాఁ దెలిసియుండుటచే నతఁడు వెళ్లి వెళ్లి చట్టన నందొక

మార్గముఁబట్టి పాప! మా రాజకన్యదృష్టికగపడకుండఁ బోయెను. ఆమె యతనికోసమెంతోసేపు వెదకి వెదకి వేసారి త్రోవదప్పి, యీవలికి వచ్చుమార్గమెఱుఁగక యొకచెట్టుక్రిందఁ జలికిలఁబడి యేడువ మొదలుపెట్టెను. అంతట మనవారిరువు రామెకడకుఁజని "అమ్మా! యేడువకుము; అడవినుండి యీవలికిఁ గొనిపోవుమార్గము నీకు మేముగపఱిచెదము; చీఁకటిపడుటచే ఇప్పుడది కనఁబడదు; ఇటనొక పెద్దచెట్టున్నది; అటనీరాత్రి మనము విశ్రమింతము; ఱేపు పెందలకడలేచి నీకుఁ ద్రోవఁజూపెదము" అని చెప్పిరి.

ఆ చెట్టుపైని గూఁటిలో ఆలుమగలైన రెండు చిన్నపిట్టలును వానిపిల్లలు మూడును ఉండెను. మగపక్షి వృక్షముక్రింద ముగ్గురుమనుష్యు లుండుటఁగాంచి "ప్రియురాలా! ఇటకుఁ గొందఱతిథులు వచ్చియున్నారు. ఇది చలికాలముగదా! నిప్పు మనకడలేదు; ఏమిచేయుదము?" అని తనభార్యనడిగెను. అడిగి, వెంటనే యెచటికో యెగిరిపోయి చిన్నకొఱవి యొకటి ముక్కునఁ గఱచుకొనివచ్చి యది యతిథులముందఱఁ బడవేసెను; అచటి చిదుగులు కొన్నిచేర్చి దానితో వారు పెద్ద చలిమంట గావించుకొనిరి. అంతటితోఁ దృప్తినొందక, పక్షి భర్త, భార్యతోమరల నిట్లనియెను "ప్రేయసీ! మనమేమి చేయుదము? వీరాఁకొనియున్నారు. తినుటకేదేని పెట్టుదమన్న మనయొద్ద నేమియు లేదయ్యెను. మనము గృహస్థులము, ఇంటికెవరేనివచ్చిన, వారికి భోజనముపెట్టుట గృహస్థధర్మముగదా! నేఁజేయఁ గలిగినదంతయుఁ జేయకతప్పదు; వారికి నాశరీర మర్పించెదను." అని గుబాలున ఆమంటలోఁబడి యది మృ

ణించెను. అదిపడుట యతిథులుచూచి దాని బ్రతికించుటకుఁ బ్రయత్నించిరి కాని, ప్రయత్నములు నిష్ఫలములయ్యెను— వారు మంటనుండి దానిని దీయకముందే దాని ప్రాణములు పోయెను.

పక్షిభార్య, తనభర్త చేసినదంతయుఁజూచి "ఇటముగ్గురున్నారు, తినుటకొక చిన్నపిట్టమాత్రమే యున్నది. అది చాలదు; మగనిమనోభీష్టము నెఱవేర్చుట సతీధర్మము; నా శరీరముకూడ వారికొసఁగెదను" అని యనుకొని తానును అగ్నిలోఁబడి మృతినొందెను.

జరిగినదంతయుఁగాంచి, ముగ్గురకుఁజాలిన యాహారము లేదనియెంచి, "మన తల్లిదండ్రులు తాము చేయఁగలిగిన దంతయుఁజేసిరి. అయినను ఆహారము చాలకపోయెను. జననీజనకుల యభీష్టము నెఱవేర్చుట బిడ్డలకువిధి. మన శరీరములఁగూడ నర్పించివేయుదము." అని యనుకొని, పిదప నా పక్షి శాబకములు మూఁడునుగూఁడఁ జిచ్చులోఁబడి చచ్చెను.

అదంతయుఁజూచి యతిథులు ముప్పురును అత్యద్భుతమంది వానిని దిననొల్లక యారాత్రియంతయు నిరాహారులైయుండియే కడపిరి. తెల్లవాఱినతరువాత రాజును సన్యాసియుఁ ద్రోవఁజూపఁగా, రాజకన్యక తన తండ్రికడకుఁ దిరిగిపోయెను.

అంతట మన సన్యాసిరాజుతో నిట్లుపలికెను:— "రాజా యెవనిమట్టునకు వాఁడు తన యాశ్రమములో గొప్పవాఁడే యని ప్రత్యక్షముగా నీవిప్పుడు చూచితివిగదా! నీవు గృహస్థుఁడవై లోకమందుండఁ దలఁచుకొను నెడల, నితరులకై నీ ప్రాణములర్పించుట కెప్పుడును సంసిద్ధుఁడవైయుండి, యా

పిట్టలవలె జీవింపుము. ప్రపంచముఁ ద్యజించి బ్రతుకఁదలఁచుకొను నెడల, రమణీమణిని రాజ్యమునుగూడ గడ్డిపరకగానైన గణన సేయకపోయిన యూసన్యాసివలెఁ బ్రవర్తింపుము. గృహస్థుఁడవు కాఁగోరుచోఁ బరులసుఖపెట్టుటకై బలిగా నిచ్చుటకే నీప్రాణ మున్నదని యెంచుము, సన్యాసివికాఁగోరుచో, అందముపైకిఁ గాని అర్థముపైకిఁగాని అధికారముపైకిఁగాని యణుమాత్రము నీదృష్టిఁ బోనీకుము. ప్రతివాఁడును తనస్థితిలోఁ దాను గొప్ప వాఁడే; కానియొకనికి ధర్మమైనది యింకొకనికి ధర్మముగాదు.

---

## 30. సమీక్షణము, సమయస్ఫూర్తి, సమయోపాయము.

చుట్టుపట్ల నేమి జరుగుచున్నదో జాగరూకులై కనిపట్టు వారు ప్రపంచములో బాగుపడుదురు. మనకుఁ గావలసిన పరిశయుఁ బరగ్రంథములు గాని పాఠశాలలుగాని నేర్పఁ జాలవు. బాగుపడఁ దలఁచుకొనువాఁడు ప్రపంచపు రీతులుఁ బ్రజలస్వభావములు నితరవిషయములు ననుదినమును బరి శీలించి లోకానుభవ మభివృద్ధిపఱుచుకొనుచుండవలెను. ఇది యెవరికి వారు స్వశక్తిచేఁ జేసికొనవలసిన పనిగాని యన్యు లుపదేశించునది కాదు.

ఏమాట యాడిన నేమనుష్యుని కెట్లుండునో, యేపని చేసిన నెవరిచిత్తవృత్తి యెట్లు మాఱునో, ముందు కనిపట్టి సమయోచి తముగా సర్వకార్యములను జక్కఁబెట్టుకొను పరిశీలనశాలులే గడుసువారు, లౌకికవ్యవహారకుశలులు.

భావికష్టముల నిప్పుడే పరిశీలించి కనుఁగొనువారు, వానికిఁ బ్రతిక్రియ లాలోచించుకొని సంసిద్ధులై యుండి యవి వచ్చి నప్పుడు సులభముగా దాఁటుదురు. ప్రత్యుత్పన్నమతు లగు కొందఱకుఁ జిక్కులు వచ్చినప్పు డవ్యవధిగాఁ దత్కాలముననే తరణోపాయములు స్ఫురించును. అట్టి సమయోపాయస్ఫురణము సహజముగా నుండవలసినదికాని తెచ్చి పెట్టుకొనునది కాదు. అయినప్పటికి నేర్పులఁదిగా నున్నను దానిని యుక్తప్రయత్నములచే నభివృద్ధిపఱచుకొనవచ్చును.

ఎంత యవివేకియుఁ దన కపాయములు రావలయునని కోరుకొనఁడు. కాని యవి పిలువని పేరంటముగా నెల్లవారికి నెప్పుడో యొకప్పుడు వచ్చును. అది ప్రపంచధర్మము. మన బట్టలుగాని యిల్లుగాని యంటుకొనవచ్చును. మనము కాలువలోనో యేటిలోనో కాలుజాఱి పడవచ్చును. గుఱ్ఱపుబండి మీఁదఁ బోవుచుండగా గుఱ్ఱము బెదరి మనల నీడ్చుకొని పోవచ్చును. ఇట్టియుపద్రవములు సంభవించినప్పుడు సాధారణముగా జనులు కలవరపడి చెడిపోదురు. మనస్సంభ్రమముచే నుపాయము లేమియుఁదోఁపక, వచ్చినకష్ట మెక్కువయై ప్రాణనష్టమును దీసికొని వచ్చును.

అట్టి కష్టకాలములలో మనసుఁ జెదరనీయఁగూడదు. నిదానించి దానిని నిలువఁబెట్టుకొని యుచితోపాయాన్వేషణముఁ జేసికొనవలెను. అట్లు చేసిన నేదో యొక సాధనము స్ఫురింపక మానదు. సమయస్ఫూర్తి చిత్తస్థైర్యముచే లభించునుగాని చిత్తసంభ్రమముచే లభింపదు. చిత్తస్థైర్యము సహజముగాఁ

గలుగునేకాని ప్రయత్నపూర్వకముగాఁ గలుగదని యూరకుండఁగూడదు. విద్యావివేకానుభవములచేఁ గొలఁదిగనో గొప్పగనో మనశ్చాంచల్య ముడుపుకొనవచ్చును.

గుడ్డ లంటుకొన్నప్పుడు గుండెచెదరి సాహాయ్యమునకై యిక్కడకు నక్కడకుఁ బరుగెత్తఁగూడదు. అగ్నికి వాయువు సహాయముగదా. దేహచలనముచే వాయుచలన మెక్కువయై మంటలఁ బెంచి గుడ్డలను శరీరమును మఱింత వేగముగాఁగాల్చి వేయును. కనుక నట్లు చేయక క్రిందఁబడి దొరలవలెను. చేరువ నేదైన కంబళిగాని తివాసిగాని దట్టపు దుప్పటిగాని యున్నచో నది గట్టిగాఁ గప్పుకొని కూరుచుండవలెను. అంతట వాయు నిర్బంధముచే తత్క్షణమే మంట లాఱిపోయి, యగ్గిగండము తప్పును.

కాలుచున్న యింటివారిని రక్షించుటకు దానిలోని కేగునప్పుడు మనము నడచిపోఁగూడదు. పైనున్నపొగయు దుర్వాయువులును మనల నుక్కిరిబిక్కిరిచేసి చంపును. క్రింద నిర్మలమైనగాలి యుండును, కనుక మోఁకాళ్లమీఁదఁ బ్రాఁకుచుఁ బోయినయెడల నట్టి కీడు మూఁడదు.

ఈఁతరాక లోఁతునీళ్లలోఁ బడి మనము మునుఁగనున్నప్పుడు పైకిఁ దేలవలెనను నాత్రముతో గిజేగిజే గొట్టుకొనఁగూడదు. అట్లు చేసినచోఁ దేలి బ్రదుకుటకు మాఱు త్వరగా మునిఁగిచేత్తుము. సమాహితచిత్తులమై నోరుమాత్రము నీటిపైకి రానిచ్చి గాలి పీల్చి శ్వాసకోశముల నుబికించుటకుఁ బ్రయత్నము చేయవలెను. స్వభావముచే మానవదేహము నీటికంటెఁ గొంచెము తేలిక. మనము కంగారుపడి దానిని

బరువు చేయకున్నయెడలఁ దానంతట నదియే క్రమముగాఁ దేలి పైకివచ్చును. విషయము దెలియకపోవుటచేతను, మనోధైర్యము వహింపలేక పోవుటను, ఔక్కండ్రు జలపిత్తుల వలనఁ బ్రాణములు గోల్పోవుచున్నారు.

గుఱ్ఱము బెదరి బండి లాగుకొనిపోవునప్పుడు తొందరపడి తటాలున దుముకఁగూడదు. సాధ్యమైనయెడలఁ జలింపని మనసుతో నందులోనే కూరుచుండి యేమిచేసిన బాగుగా నుండునని నిదానించి సమయము చూచుచుండవలయును. పరుగెత్తి పరుగెత్తి యలసి యంతలో సాధారణముగా గుఱ్ఱమే నిలుచును. చుట్టుపట్ల గుట్టలు గాని గోతులుగాని యుండి నిలువక నూరకున్న బండి బోరగిలఁబడి ప్రాణహాని తటస్థించు ననుభీతి వొడమిన, మెల్లగా వెనుకకుఁ బోయి దిగవలెను. అట్టి సమయము లందు బండినుండి దూఁకునప్పు డొక్క సంగతిమాత్రము మఱవఁగూడదు. గుఱ్ఱపుబండికిఁగల వేగమది. ఆవేగము బండిలోనున్న మనుష్యునికిఁగూడ నుండును, అది పైకిఁగనఁబడదు. తెలియక గుఱ్ఱము పోవువైపునకే యతఁడు దూఁకినచో, భూమిమీఁదఁబడి గట్టిదెబ్బ తినును. కనుక గుఱ్ఱ మతివేగముగాఁ బోవుదిశకుఁ బ్రతిదిశగా మొగము పెట్టి దుముకవలయును. అట్లు చేసిన నపాయము రాదు.

సభాభయమున్నపండితుని పాండిత్యము రాణింపదు. ఒక సంగీతకళావిశారదుఁడు 'నామాట నమ్మవేమిరా!' యను చక్కని పాట పాడవలయునని ప్రభుసమ్ముఖమునకుఁ బోయెను. రాజసింహాసనము జూడఁగానే యాతనికి గుండె చెదరెను. తంబురతంత్రులకంటె నెక్కువగా నోడలు వడఁకసాగెను.

ఎట్టకేలకు ధైర్యము తెచ్చుకొని పాడఁబోఁగా నాల్కతడఁబడి, "నామాట నమ్మ వేమిరా" యనుదానికి బదులుగా "నననన వట వమవేమిరా !" యను మాటలు మోముఁజెమ్మటలతోఁ బైకివచ్చెను. అందఱును బక్కున నవ్విరి.

ఒక పరమచ్ఛాందసుఁడు నారికేళఫలము చేతఁ బుచ్చుకొని రాజదర్శనము చేసి పనస చెప్పి యతని నాశీర్వదించి బహుమతినందవలయు నను నాశతోఁ బోవుచుండఁగా, నతని సమీపించిన కొలఁదిని మనసులో నున్న పనస మాయమై పోవుచుండెను. చివరకు రాజపురోభాగమునకు రాఁగానే నాస్య ప్రాశీర్వాదమైనను స్ఫురింపమిచేఁ దెగించి "టెంకాయ పుచ్చుకొం" డని తెలుఁగుతో దీవించెద నని నిశ్చయము చేసికొనెను. తుద కది వైఖరీవాక్కుగా వెడలినప్పుడు "టెంకాయపిచ్చికొండ" యని యందఱకు వినఁబడెను. పాండిత్య సత్కారమునకు మాఱు, భయసత్కారముగాఁ గొంతసొమ్ము రాజోవిప్రున కిచ్చి సాగనంపెను. కనుక మనోధైర్యము లేని మహాపండితులుగూడ హాస్యాస్పదులగుదురు.

చేదు వక్కఱ లేకుండ సమయోపాయస్ఫురణ ముండ వచ్చునని యీక్రిందికథ చెప్పుచున్నది.

పూర్వకాలమున సర్ జేమ్సు థార్నహిల్ అను నొక ప్రసిద్ధ చిత్రకారుఁ డుండెను. ఒకనాఁ డతఁడు, సెంట్ పాల్స్ కెథీడ్రల్ అను పవిత్రాలయముయొక్క కలశశిఖరమున, నంచులఁ గంచెకట్టలు లేని యెత్తైనపరంజేమీఁద నిలఁబడి, యేకాగ్రచిత్తతతో నలంకారములు చిత్రించుచుండెను.

దూరముగా నుండి చూచినఁ, దన చిత్రక్రియ యెట్లుం డునో స్వయముగాఁ బరికింపవలయు నను కుతూహలముతో వెనుకంజెలు వేయుచు బరంజేయంచునకు వచ్చెను. ఇఁక నొకయంగుళము వెనుకకుఁ బోయినయెడల, నతఁడు క్రిందఁ బడి తలబ్రద్దలయి, మరణింపవలసినఁవాడే.

అతనికి రంగు లందించు నొకసేవకుఁడు, యజమానుని యపాయస్థితిఁ గనిపట్టి, శంపావేగముతోఁ దటుకునఁ జిత్తరువు నొద్దకుఁ బరుగెత్తి కుంచెఁడు రంగును దానిమీఁదఁ గుమ్మ రించెను.

చిత్రలేఖకుఁ డంతఁ బట్టరానికోపముతో సేవకునిఁ జావఁ దన్నుటకు ముందటికిఁ దటాలునఁ బరుగెత్తుకొనివచ్చెను.

కొట్టఁబోవుటకుఁ జేతు లెత్తఁగా సేవకుఁడు యావద్వృ త్తాంతమును విన్నవించెను. అంతటఁ జిత్రకారుఁడు కృతజ్ఞతా బాష్పములతో నతనిఁ గౌఁగిలించుకొని యతని సత్సేవకత్వ మును, దెలివితేటలను, సమయస్ఫూర్తిని, నెంతో కొనియా డెను.

"అయ్యో! పడఁబోవుచున్నారని కేక వేసిన, యజమానుఁ డులికిపడి వెనుకకుఁ బడును. తల ఛిన్నభిన్నమ గును. ఆలస్యము చేసినను నాయపాయమే సిద్ధించును. అదిరిపాటుగా నతఁడు ముందునకు వచ్చునంత యాగ్రహ మతని యంతరంగ ములోఁ గలిగింపవలెను. అట్లు కావించుటకుఁ బ్రాణతుల్య ముగఁ జూచుకొనుచున్న ప్రతిమను బాడుచేయుటకంటె సాధనాంతరము లేదు. కనుక నీరంగు దానిమీఁదఁ బోసెద" నను నీపూర్వపక్షసిద్ధాంతములును దదనుగుణమైన క్రియ

యును గూడఁ గ్రుటిలోఁ గావించి యతఁడు తనయజమానునకుఁ బ్రాణదాతయయ్యెను.

---

## 31. పన్నులు.

ప్రజలవలన పన్నులు ప్రతిసంవత్సరమును రాఁబట్టు చుండుట మనము చూచుచున్నాము. పన్నులు గాని ప్రజలను బాధ పెట్టుటేల యని కొందఱనుకొనవచ్చును. అది యెంతవఱకు న్యాయ్యమో చూతము.

బియ్యము పాలు పండ్లు మొదలగు నాహారపదార్థములు, నిండ్లు మంచములు పఱపులు కురిచీలు మున్నగు వసనశయన సుఖప్రదపదార్థములు, నూరక రావు కదా. వానిలో నన్నియో కొన్నియో యక్కఱ లేనివారు ప్రపంచమున నెవ్వరును లేరుకదా. కావలసియున్నప్పుడు కొలఁదిగనో గొప్పగనో ధనము వెచ్చింపక తప్పదుకదా. కనుక మన మనుభవించు ప్రతిసుఖమునకు మాఱుగా నెవరికో యొకరికిఁ గొంతధన మీయవలసిన బాధ్యత మనయందున్నది.

ప్రజలు పండించుకొన్న పంటలు, గృహములందు దాఁచుకొన్న సొత్తు, ప్రయాణమై పోవునప్పుడు మానధనప్రాణములు, రక్షించి మనల సుఖపెట్టుచున్న వారెవరు ? మన స్నేహితునికో బంధువునకో యొకకాగితిచీటి నేఁడు వ్రాసిపడవైచిన, దానిని వందలమైళ్ల దూరమున నున్న యతనికి ఱేపె యందఁ జేయుచున్న వారెవరు ? వేలకొలఁది ధనమును జేతి కందిచ్చిన ట్లొకరి నుండి యొకరికి దూరప్రదేశములకు నిశ్శంక

ముగాఁ బంపుచున్నవా రెవరు? చెవి నూఁదినట్లు మనకష్టసుఖ వార్తలను దేశముకాని దేశముల నున్న మనవారికిఁ దంత్రీ ముఖమునఁ దెలియఁ బఱచుచున్నవా రెవరు? శత్రుభయము లేకుండఁ బ్రబలము లైన సేనలు నౌకాసేన లుంచి, దేశమును రక్షించుచున్న వా రెవరు? పని చేసిచేసి, ముసలివారై యుద్యోగమునుండి తొలఁగి యశక్తులై యింట నుండునప్పుడు పెన్షను (పనిపుచ్చుకొనకుండ వేతనము) లిచ్చి సుఖముగా వారి ముప్పు గడపుచున్నవా రెవరు? పెక్కు పాఠశాలలును జికిత్సా శాలలు నుంచి ప్రజలకు విద్య నేర్పి, వారి యారోగ్య రక్షణము చేయుచున్నవా రెవరు? ప్రభుత్వమువారే యని యేకకంఠముగా నందఱును జెప్ప వచ్చును.

ఇవన్నియు సరిగాఁ జేయుట కెంద ఱుద్యోగులు గావలయును? ఎంత ధనము జీతముల క్రింద వినియోగపడవలయును? ఆధనము ప్రజలనుండియే పుచ్చుకొని వారికొఱ కుపయోగపఱుపవలయును గదా! అట్లు రాఁబట్టు మొత్తములే పన్ను లనఁబడును.

పన్నులు గొనకున్నఁ బ్రజాసౌఖ్య ముండదు. కనుక సుఖము గోరు నెల్లరును సంతోషపూర్వముగాఁ బన్నులు ప్రభువులకుఁ జెల్లింపవలెను. నే నొకరికిఁ బన్నిచ్చు టేల? ఒకరు నన్ను సుఖపెట్టు టేల? నా కదియు నక్కఱలే దిదియు నక్కఱలే దని పల్కువాఁడు పరమనిస్పృహుఁడైనఁ గావలయును, బశుప్రాయుఁడైనఁ గావలయును, తదుభయులకు వాసయోగ్య మైన స్థానము మహారణ్యముగాని మనుష్యు లుండుపట్టనములును బల్లెలును గావు. కావునఁ బ్రజలలోఁ గలసి మెలసి

కాఁపురము చేసి సంసారసుఖము లనుభవింపఁ గోరువాఁ డెవ్వఁడు నట్లుసఁగూడదు, పోనీ! వాఁడక్కడ అలే దనుచున్నాఁ డని ప్రభుత్వమువా రూరకున్న, నాయూరిలో సౌఖ్యార్థులై యున్న పెక్కండ్రిక్కట్లు పడుదురు. కనుక నెవఁడో యొక వెంగలి వి త్తట్లున్నాఁ డని చెప్పి ప్రభుత్వమువారు పన్నులు గొనుట మానరాదు.

ఎవని సుఖము వాఁడు చూచుకొనలేఁడా ? అది యొకరి మీఁదఁ బెట్టు టెందులకు? కని యెవరేని యడుగవచ్చును. అది సుసాధము గాదు. న్యాయాన్యాయములు పరిశీలింపక, బల వంతులు బలహీనుల బాధింపవచ్చును. ధనికులు నిర్ధనులఁ బీడింపవచ్చును. నీచేను గాచుకొనఁ దలఁచుకొని నీవు పది మందిని గాపుపెట్టినను, బంటును బట్టుకొని పోనెంచుకొన్న వాఁడు బలవంతుఁడైనచో, నిరువది మందితో వచ్చి చేను ధ్వంస ముచేయును. నీవు పదిరూపాయలిచ్చిన, వాఁడిరువది రూపా యలిచ్చి, మనుష్యులను దెచ్చును, తగవు దీర్చువా రెవ్వ రున్నారు? రాజుకంటె బలవంతుఁడును ధనవంతుఁడు నెవ్వరు నుండరు. రాజాజ్ఞ మీఱి యన్యాయము చేయుట కెవ్వఁడు సాహసింపఁడు.

మఱియొకమాట. ఏపనియైన సంఘీభవించి చేసిన, స్వల్ప వ్యయముతో సాగును. వేఱువేఱుగాఁ జేసికొనిన నధిక వ్యయముతోఁగాని కానేరదు.

ప్రజ లందఱినుండియు రాజు పన్నులు గొని, వానితో వారిక్షేమమునకొఱకుఁ జక్కని యేర్పాటులు గావించి, చేట్ట ములు చేసి, యనాయాసముగా వివిధపరిపాలనాశాఖల మూల

మున మనలను దండ్రివలె సుఖపెట్టును. ఇది మనకు లాభక రమో, యరాజకమై, నిర్నిబంధమై, పరస్పరసంబంధములేని పృథగ్జీవనము లాభకరమో యోజించుకొనుఁడు. "నాపప్పుగింజెలు నేనే పండించుకొందును నాజోళ్లు నేనే కుట్టుకొందును, నాబట్టలు నేనే నేసికొని యుదుకుకొందును, నాయౌషధములు నేనే తయారు చేసికొందును," అను బుద్ధిమంతునకును, పరిపాలకకృత్యము లన్నియు నేనే స్వయముగా నొనరించుకొందు నను ప్రజ్ఞాశాలికినిఁ దారతమ్యము లేదు. తక్కిన సంగతు లట్లుంచి యేది చౌకయో యాలోచించు కొనుఁడు.

కొన్నివిధము లైన పన్ను లెక్కడ వసూలు చేసినవి యక్కడనే యుపయోగపడుచున్నవి. అంగడిపన్ను, ఇంటిపన్ను, పట్టన ద్వారములఁ బోవు బండ్లపైఁ గట్టి పుచ్చుకొను పన్ను, మంచి నీటిపన్ను మొదలగు మ్యునిసిపల్పన్ను లిట్టివి.

ఇవి గాక జనసామాన్య సుఖముకొఱకుఁ ప్రభుత్వమువారు రాఁబట్టు పన్నులు పెక్కులు గలవు. భూమిమీఁదఁ, బొలముల కుపయోగించు నీటిమీఁద,ఁ బథములమీఁద, రాబడిమీఁద, నడవుల మీఁద, నితరములైన వానిమీఁద, పన్నులు రాఁ బట్టు చున్నారు. ఎగుమతి దిగుమతి సరకులపై సుంకములు పుచ్చుకొనుచున్నారు. ఇంక నెన్నిటిమీఁదనో పన్నులు గలవు. ఈ సుంకములు, పన్నులన్నియుఁ గూడ దేశరక్షణమునకై ప్రజా సౌఖ్యముకై వారి జ్ఞానాభివృద్ధికై యుపయోగపడు చున్నవి.

ఎన్ని పాఠశాలలకు గవరన్మెంటువారు ధనసాహాయ్యముచేసి విద్యావ్యాపనమునకుఁ దోడ్పడుచున్నారో, యెన్ని ధర్మవైద్య

శాలలు స్థాపించి ప్రజలయారోగ్యమును గాపాడుచున్నారో చూడుఁడు. క్రయవిక్రయాదిపత్రములకు డబ్బు పుచ్చుకొని యనేక న్యాయస్థానముల నేర్పఱిచి ప్రజలవివాదములను నిష్పక్షపాతముగాఁ బరిష్కరించుచున్నారు. క్రొత్తక్రొత్తమార్గములు, ఇనుపదారులు, వంతెనలు, నిర్మించి సదుపాయములు హెచ్చుచేయుచున్నారు. ఇవన్నియు వ్యయముతోఁ గూడినవికాని యూరక లభించునవి కావుగదా! కనుక గవరన్మెంటువారు పన్నురాఁబట్టకయిట్టి ఘనకార్యములు చేయఁజాలరుకదా.

ప్రత్యక్షముగాఁ గాక తెలియకుండఁ బ్రజ లిచ్చు కొన్ని పన్నులు గలవు. అన్యదేశమునుండి దిగుమతి యగు సరకుమీఁద వేసిన సుంక మిట్టిది. సరకు లంపిన యన్యదేశస్థుఁ డాసుంకము నిచ్చినాఁడు, మన కేమి? యని కొంద ఱనుకొనవచ్చును. అది నిజముగా మనము చెల్లించునదిగాని యతఁ డిచ్చునది కాదు. మన దేశపు వర్తకు నొద్దనుండి, తొలుత నెంత కీయఁ దలఁచుకొనెనో దానికిఁ దా నిచ్చు సుంకమును గలిపియే, పరదేశవర్తకుఁడు పుచ్చుకొనును. అనఁగాఁ బరదేశవిక్రేత, తన కెంత సరిగా వ్యయ మయినదోయదియు, మన దేశమునకుఁ బంపినందులకైనమార్గవ్యయములు, సరకుమీఁదఁ దాఁ బుచ్చుకొన నెంచుకొనిన లాభము, దానిమీఁద నధికారులకుఁ జెల్లింపవలసిన సుంకమును గలుపఁగా వచ్చినమొత్తము మన దేశపు వర్తకునిచేతి నుండి లాగును. ఈవర్తకుఁడు తనకుఁ గావలసిన లాభమును జేర్చి దానిని మనకుఁ జిల్లరగా నమ్మును. కనుక నిట్టి దిగుమతి సుంకము నిచ్చువారు చివరకు వస్తువులు కొనుజనులేకాని మఱియొకరు గారు.

కనుకఁ బ్రభువు లతిజాగరూకతతో సొమ్ము వ్యయపఱచి కావలయు సొమ్మునే ప్రజల నుండి కరరూపమునఁ గొనవలెను. అనావశ్యకము లగు వ్యయములవలనఁ బన్ను లెచ్చు చేయవలసి వచ్చును. హెచ్చు చేయుటవలనఁ బ్రజా పీడ హెచ్చును. రాజునెడలనుండు ప్రజావిశ్వాసము ననురక్తియు క్షీణించును.

మనప్రభువులట్టి యనర్థములు గలుగకుండఁదగిన యేర్పాటులు చేసినారు, చేయుచున్నారు. యూనియనులలోను, మ్యునిసిపాలిటీలలోను బ్రజలచే నెన్నుకొనఁబడిన సభ్యుల యాలోచన తీసికొనియే, యాయవ్యయనిర్ధారణము చేయుచున్నారు, స్వపరిపాలనాపద్ధతి కింకను మనమలవాటు పడలేదని ప్రభుత్వమువారు, చేయిపట్టుకొని తండ్రి శిశువును నడపించునట్టు, మనకుస్థానిక స్వపరిపాలనారహస్యములను నేర్పుచున్నారు. అది సరిగా జరుగుటకుఁ బ్రజలు, న్యాయదృష్టితో, దేశాభిమానముతో, స్నేహబంధుత్వ శత్రుత్వాది రాగద్వేషములఁ జంపి, బుద్ధిశాలులును, సత్యశీలురును, ధైర్యస్థైర్యసంపన్నులును, పాలనవిధిజ్ఞులును, నగు సభ్యులనే యెన్నుకొనవలయును. ఆసభ్యులు దైవముఖము చూచి ప్రజాసౌఖ్యమే పరమార్థముగా నెంచి పనిచేయవలెను. అప్పుడు ప్రభువులు ప్రజల కిచ్చు స్వాతంత్ర్యము సార్థకమగును.

ఈ పన్ను లుండవచ్చు, నీపన్ను లుండఁగూడదు, ఈపన్నింత వేయవచ్చు, నింత వేయఁగూడ, దని నిర్ణయించు నధికారము ప్రస్తుతము హిందూదేశప్రజల కాంగ్లేయ ప్రజల కున్నంత లేదనుమాట నిజమే, కాని వారి కున్న తెలివితేటలు, దేశభక్తి

స్వార్థ పరిత్యాగము, మనకు లే వన్నమాటయు నసత్యము గాదు.

ఇంగ్లండు దేశములోఁ బ్రజ లెన్నుకొని పార్లమెంటునకుఁ బంపిన సభ్యులందఱుఁ గలిసి యాలోచించి, యాయ వ్యయముల విధింతురు. వారు నిషేధించినపని పాలకులు చేయరాదు. విధించినపని చేయక తప్పదు. హిందూదేశపు శాసననిర్మాణ సభలలోఁ గొందఱు హైందవసభ్యు లున్నారు. కాని వారు కొందఱే. కాలక్రమమునఁ బ్రజలలో విద్యాభివృద్ధినైన కొలఁది నట్టివారి సంఖ్య యెక్కువయై ప్రజాస్వాతంత్ర్య మధికమగును. పెరిఁగి పెద్దవాఁడైన కొడుకుమీఁద సంసారభారము వైచి, తా మొత్తగిల్లు జనకులవలెఁ బ్రభుత్వమువారు విద్యాసామర్థ్య యోగ్యతలుగల ప్రజలమీఁదఁ గ్రమక్రమముగా దేశపాలన భారమును బడవైచి, తాము పైనుండి పెత్తనము నెఱపుదురు. కనుక మన కధికార స్వాతంత్ర్యములు గావలె నన్నఁ, బోలుతయోగ్యతాసామర్థ్యము లభివృద్ధి చేసికొని, పూర్ణరాజభక్తితో, సవినయముగ సయుక్తికముగ, వాని నిండని ప్రభువుల నడుగవలెను. ఇటీవల యూరప్పులో జరిగిన ఘోరసంగ్రామమునందు హైందవులు ధనరూపముగను, జనరూపముగను, జూపిన రాజభక్తిని జూచియు, నక్కడ కేగిన హైందవ యోధులు యుద్ధము నందగపఱిచిన యద్భుతశౌర్య పరాక్రమములఁ గాంచియుఁ, బ్రభుత్వమువారు యుద్ధావసానమున మనకుఁ గొన్ని స్వాతంత్ర్యముల నిచ్చియున్నారు. భగవదనుగ్రహమున నవి యింకను బూర్ణములై ప్రజామనోభీష్టముల సిద్ధింపఁజేయును గాక !

---

# 32 ప్రేమ—మాతృప్రేమ.

భగవంతుఁ డున్నాఁడని నమ్ము ప్రతిమతము వారును "ఆయన శాశ్వతుఁడు, జ్ఞానస్వరూపుఁడు, ఆనందమూర్తి" యని చెప్పుదురు.

సృష్టికర్త లక్షణములు కొంత భేదముతోఁ గొలఁదిగా, ఆయనసృష్టిలోఁ గూడఁ గన్పట్టుచున్నవి.

ప్రపంచములో దేనినిఁ బూర్తిగా నాశమొనరింపలేము— అనిప్రకృతి శాస్త్రములు చెప్పుచున్నవి. క్రొవ్వువత్తి కాల్చి వేసినయెడల, నందలిపదార్థములు కంటికిఁగనఁ బడకపోయినను, ఇతరపదార్థ సమ్మేళనమునంది యవి వాయువులో నుండును గాని యంతరించిపోవు. ఇది మీ ప్రకృతి శాస్త్రోపాధ్యాయులు మీకు ముందుముందు ప్రత్యక్షముగాఁ జూపఁగలరు. కనుక, వస్తువులు నామరూపవికారముల నందుచు నుండునుగాని, సంపూర్ణనాశమొందుట యెన్నఁడును సంభవింపదు. లేని ద్రవ్యమును సృజింపలేము, ఉన్నదానిని నాశమొందింపలేము. తూఁచి పరీక్షించుట సాధ్యమగునెడల సృష్ట్యాది నెంతద్రవ్య భారముండెనో యిప్పుడు నంతేయున్నదనియు, ముందెప్పటికి నంతే యుండుననియుఁ జెప్పవచ్చును. అనఁగాఁ బ్రపంచమూల పదార్థము శాశ్వతము, అనశ్వరము—అన్నమాట.

చిత్రవిచిత్ర గృహనిర్మాణ నిపుణములగు గిజిగాఁడును దేనెటీఁగయును, కాళిదాసుఁడు షేక్స్పియరు మున్నగు మహాకవులు, శంకరాచార్యాది మహాతత్త్వ బోధకులు, పంచభూతములను దానిసలఁగాఁ జేసికొని వానినుండి యద్భుతముగాఁ

బనిపుచ్చుకొను భౌతికశాస్త్రపారంగతులు, మహాయంత్ర నిర్మాతలు—ఇట్టి మేధావులు చూపు ప్రతిభలన్నియుఁ బరమేశ్వరుని యనంతజ్ఞాన రాశిలోని యణువులేకాని యన్యములుగావు.

ఇఁకనానంద పరిశీలనముచేసి చూచుకొందము. పశుపక్ష్యాదులును, పామరుఁడు మొదలుకొని పండితుని పఱకునుండు యావన్మానవ బృందమును, ఉదయాద్యాసాయము, సుఖప్రాప్తికై యే పాటు పడుచుండుట మనము ప్రత్యక్షముగాఁ జూచుచున్నాము. సుఖాభిలాషిగాక దుఃఖమును గోరుకొను ప్రాణియొకటియుఁ బ్రపంచములోఁ గాన్పింపదు. కానియల్పజ్ఞులగుటచేఁ బెక్కురు,సత్యానందమేదియో కల్లయానందమేదియో కనుఁగొనలేక తికమకలుపడుచుందురు. ఏమైనను, జీవానందములన్నియును బ్రహ్మానందములోని పరమాణువులే.

ప్రేమకును ఆనందమునకును గాఢమైన పరస్పరసంబంధమున్నది. ఆనందప్రదములగు నర్థములపైఁ బ్రేమజనించును. ప్రేమప్రేరితములైన పనులానంద దాయకములగును. కావునఁ బ్రేమానందము లీప్రపంచములో బీజభూజములవలె నన్యోన్య కారణములగుచున్నవి.

పరుసవేది క్షుద్రలోహములను బంగారము చేయునట్లు, ప్రేమకొన్నిపట్లఁ గష్టములను సుఖములఁగా మార్చివేయును. ఈప్రేమ మర్మమెఱుకపడినచో, మహనీయులకుఁ గష్టములెట్లు సుసహములగునో మనకుఁ దెలియఁగలదు.

సామాన్యముగా సుఖాపేక్షచేతనే జనులకాయా యర్థములపైఁ బ్రేమయుదయించును. కామినీకాంచనాదులపైఁ

గలుగుప్రేమ మిట్టిప్రేమ మే. అప్రయత్నముగా జనించియింద్రి యార్థములకై మనలఁబరుగిడఁ జేయునిట్టిప్రేమ, పామరానురాగముగాని ప్రశంసనీయమైన యనురాగము గాదు.

పరహిత పరతాప్రేరితమై స్వసుఖపరిత్యాగ సంయుతమైన ప్రేమయే స్తవనీయమైనప్రేమ. అట్టిప్రేమనలవడఁ జేసికొనుఁడని ప్రజలకు స్వాచరణ పూర్వముగా బోధించుటకే పరమేశ్వరుఁడవతారము లప్పుడప్పు డెత్తుచుండునని తత్వవేత్తలు చెప్పుదురు. తానభవుఁడును ఆనందస్వరూపుఁడును ఆకార శూన్యుఁడును అయినప్పటికిని జగదీశ్వరుఁడు, తనబిడ్డలను కుమార్గములనుండి సన్మార్గములకు మరల్చి సౌఖ్యపెట్టుటకై, బుద్ధిపూర్వకముగా జననమరణాది బంధములు తెచ్చిపెట్టుకొని, సశరీరుఁడై, యవసరమును బట్టి, యవతరించుచుండునని మన పావనగ్రంథములు చెప్పుచున్నవి. శ్రీరామకృష్ణాదులును, బుద్ధాచార్యుఁడును, జీజస్ క్రైస్టుగారును—అట్టి భగవదవతారపురుషులే. ప్రశాంత చిత్తములతో, లోకోపకారార్థము, వారనేక కష్టములు భరించినారు. క్రీస్తుప్రజలకై తనప్రాణములనే యర్పించినాఁడు. అవసానసమయమునఁ, దన్నుఁజంపువారిపైఁ గినియక, కించిద్ద్వేషభావమైనను మనసులోఁ జొరనీక, "తండ్రీ వీరిని క్షమించి రక్షింపుము, తామేమి చేయుచున్నారో వీరెఱుఁగకున్నారు పాపము!" అని భగవంతునిఁ బ్రార్థించిన శుద్ధ సత్వమూర్తియు, లోకోత్తర చరిత్రుఁడును నితఁడే !

ప్రజాసంఘము నందలి దోషములను, పరిపాలనము నందలి బాధలను, మతదురాచారములను, మాన్పుటకై యెన్నియో కష్ట

ములుపడి, తమయావచ్ఛక్తియు ధారపోయు వీరపురుషులును వీరవనితలును, వీరితరువాతివారు.

ఐహిక ప్రేమముల లోపల దాదాపుగా సంపూర్ణమైన స్వార్థ పరిత్యాగమునకుఁ దార్కాణగా నుండునది, తల్లి తన బిడ్డలపైఁ జూపు ప్రేమ—మాతృప్రేమ. ఈ సంతానవాత్సల్యమే లోక పోషణమునకు ముఖ్యాధారమై యున్నది. క్షుద్రజంతువులలోఁ గూడ నీప్రేమకొంతకాలము వఱకుఁ బ్రస్ఫుటముగాఁ గాని పించును. పుట్టినపిల్లలనపాయమునుండి కాపాడుపట్టునఁ, దల్లి పిట్టకును దల్లిమృగమునకును, ఎచ్చటనుండి వచ్చునో తెలియదు! ఇతరసమయము లందెన్నఁడును గానరాని జవసత్వశౌర్యములు వచ్చును. ఆప్రేమమానవ మాతలలో యావజ్జీవము నుండును.

మనము తనకడుపునఁ బడుటకై యెందఱు దేవతలకో మ్రొక్కికొని, యెన్నిటనోమునోఁగి, యుపవసించి, యుపాసించి, యెన్నో దానధర్మములుచేసి, యనేకకష్టములుపడికృశించిన కీర్త నీయురాలెవరు? మనతల్లి!

తొమ్మిదినెలలు మనలఁదనమృదు గర్భగోళమున నిడుకొని మోసి, పడరానిపాట్లు పడిప్రసవించి, మనలఁగాంచుట తోడనే వెనుకటివెతల విస్మృతములఁ జేసికొని కొండంత సంతోషము తోనుండు నుద్దండ ప్రేమోదధియెవరు ? మనతల్లి!

నిరాధార శిశువులమైమనము పడియున్నప్పుడు, కంటిని ఱెప్పవలె మనలఁగాచుచుఁ, గుడిచేయియనక యెడమచేయి యనక, రేయియనక పగలనక, కడుఁగష్టములు పడి సకలోప చారములుచేసి, మనపెదవులపైఁ జిందులాడు నొక్కచిఱు

నవ్వుతో ఆకష్టములన్నియు మఱచిమనల గ్రక్కునఁ జేర్చుకొని యుప్పొంగు నుదారశీలురా లెవరు? మనతల్లి !

మనలఁదన యమృతోపమానమగు స్తన్యమునిచ్చి పెంచు నవస్థలో, మనముజబ్బు పడినప్పుడు, మనకోసముతాఁ దననోరు కట్టుకొని కఠినపథ్యములు చేయుచుఁ గష్టపడిన కాంతామతల్లి యెవరు? మనతల్లి !

ఎంతలేమిలో నెంతక్షుద్బాధ తోనున్నను ముందుమనకుఁ బెట్టికాని తాఁదినక, తినుటకులేకున్నఁ బస్తుండి, మనముతృప్తి నొందినఁదాఁ దృప్తినొందుచు, మనముకష్టపడినఁ దాదుఃఖించుచుఁ దనమనుగడ సాగించుకొనిన దయామయు రాలెవరు? మనతల్లి !

మనముపెరిఁగి పెద్దవాండ్రమైనపిమ్మటఁ గూడఁ, దా వయసుగడచినదైనను, మనము దురామయగ్రస్తులమైనప్పుడు "తండ్రీ! నాతండ్రిని రక్షింపుము! నీకృపచే వ్యాధితిరిగి మరలవాఁ డారోగ్యవంతుఁడైనయెడల, నేమరణించువఱకొక్క పూఁటనేభుజింతును, ప్రొద్దుకనఁబడనిరోజునఁ దిననేతినను" అని యమలానురాగప్లుతమైన యంతఃకరణముతో నేమేమో ప్రార్థనలుగావించి, యెన్నెన్నో కఠిన నియమములఁబూని గాసి పడు నరరూపనారాయణి యెవరు? మనతల్లి !

మనకై యామెపడిన శ్రమమెల్లను మఱచి, మనము కృతఘ్నులమై, యామె సుఖముచూడ కుపేక్షించుటయే కాక, యనరాని మాటలాడి, యామె నెంతో వేఁచుచున్నను "పోనీ! తెలివితక్కువవాఁడు ! వాఁడాయుర్భాగ్యవంతుఁడై బాగుగా నున్న నాకంతేచాలును" అని మనస్సమాధానము చేసికొని

లోపలదీవించుచు నేయుండు క్షమాస్వరూపిణి యెవరు? మన తల్లి!

అందుచేతనే, జగజ్జననిని బ్రార్థించుకొనుచు నొకభక్త శిఖామణి "కుపుత్రో జాయేత క్వచిదపికుమాతా న భవతి— చెడ్డకొడుకు పుట్టవచ్చునుగాని చెడ్డతల్లిమాత్ర మెచ్చట నుండదు" అని పలికినాఁడు.

తండ్రి తనయునిలోపము లగపడిచి కఠినముగా శిక్షించి యతనిని సవరింపఁజూచును. ఇఁక నవనీతహృదయ యగు తల్లి యన్ననో, బిడ్డలోపములుపై కగపడకుండఁగప్పి పుచ్చి యతనిని దిద్దుకొనఁజూచును. కావుననే "శ్రుతిర్మాతాలయః పితా—శ్రుతి తల్లివంటిది, లయ తండ్రివంటిది." అని సంగీత శాస్త్రజ్ఞులు చెప్పుదురు.

గగన మింతయెత్తని చెప్పవచ్చును, కంధి యింతలోఁతని చెప్పవచ్చును; గాని కనిపెంచిన తల్లిప్రేమ గభీరతయింత యని యెవరును జెప్పఁజాలరు.

కొన్నాళ్లక్రిందట నొకయాంగ్ల వార్తాపత్రికలో నెక్కడిదో యొకకల్పితమైన నీతికథ చేదివినాము. అది చిన్నకథయేకాని మిక్కిలి చక్కనికథ. దాని నీక్రిందఁ జెప్పుచున్నాము. పైని వ్రాసినట్లు మానవమాతప్రేమ మరణపర్యంత మేకాక మరణానంతరమునఁగూడ నుండునని యది మనసుకరఁగు మాటలతోఁ దెల్పుచున్నది.

ఒకపురమున నొక ముసలితల్లియును భోగయ్యయను ముప్పదియేండ్ల కొడుకును నివసించియుండిరి.కుటుంబము గొప్పయాస్తిగల కుటుంబము. తల్లికతఁడొకఁడే కుమారుఁడు; కావున

నామెకతనిపై నెంత ప్రేమయుండెనో చెప్పకుండ నూహించు కొనవచ్చును. ఏదేని తగిన సంబంధముచూచి పెండ్లిచేసి బిడ్డ నొకయింటివానిని జేయఁ దల్లి ప్రయత్నించుచుండెను.

కాని భోగయ్య భోగపరాయణుఁడై చెడ్డతిరుగుళ్లు తిరుగుచు నొకచేక్కని వారకాంతవలలోఁ జిక్కుకొనెను. తల్లి కాసమాచారము తెలిసినందునఁ గొడుకు నామె యొకనాఁడు చేరఁ బిలిచి "బిడ్డా! నీయిష్టమువచ్చినయొక గుణవతినిఁ బెండ్లిచేసి కొని, యందఱవలె నీవునొక సంసారివై, పేరుప్రతిష్ఠలు సంపాదించుకొని, చచ్చి స్వర్గలోకముననున్న మీతండ్రిగారిని బదుగనై బ్రతికియున్ననన్నును సంతోషపెట్టుము. అపకీర్తికరమైన నీ యీనడవడి మానుకొనుము" అని గట్టిగా మందలించెను.

మూఢుఁడైన భోగయ్య పుట్టిమునిఁగినట్లు లామాటలన్నియును బట్టుకొనివెళ్లి తనప్రియురాలగు వేశ్యతోఁజెప్పెను. ఆ వారాంగన తన వలపుటురులలో నతని మఱింతగట్టిగా బిగించి ముసలిపిసాసిని ముక్తినొందించినఁగాని తనయాటలు సాగవని యెంచి, మంచి యదనుగనిపట్టి, తీయనిమాటలతోను జేఁతల తోను భోగయ్యకు మత్తెక్కించి, యతనిచే "నీవే నాసమస్తమును, నీవేనాభూలోక స్వర్గమవు, నీవేమి చెప్పిన నది చేతులు గట్టుకొని చేసెదను." అని యనిపించుకొనెను. అనిపించుకొని "మీ తల్లిగారి గుండెకాయ నాకుఁగావలెను." అనిపల్కెను.

భోగయ్య యీవెగటుమాటలకు వెఱఁగందలేదు, అదిరిపడలేదు, కంటఁదడిపెట్టుకోలేదు, కోపముచే మొగ మెఱ్ఱచేసికొనలేదు. "అయ్యయ్యో! నరమాంసము! అందులో నా తల్లి మాంసము! నీ వేమి చేసికొనెదవు? ప్రయోజ

నముమాలిన ఘోరమాతృహత్యాపాతకము నాకంటఁ గట్టకుము" అని దాని కాళ్లమీఁదఁబడి బతిమాలుకొనుట యైనను జేయలేదు. "మంచి" దనిచెప్పి వెళ్లి మాతృవధ మాచరించి, గుండెకాయదీసి పట్టుకొని తన మిండకత్తెయింటికిఁ బరుగుపరుగున వచ్చుచుండెను. ఆహా! కామాంధతచే భోగయ్య వ్రీడాదయాభయములు వీడి కన్నతల్లినిఁ దన కరముల తోనేచంపుకసాయి వాఁడెట్లయ్యెనో చూడుఁడు!

వచ్చుచుండఁగాఁ దొందరచేఁ ద్రోవలోఁ గాలుజాఱి భోగయ్యక్రిందఁబడెను; చేతిపట్టుదప్పి గుండెకాయగూడ నేలపై దూరముగాఁ జెదరిపడెను. అంతట నా మాంసపుముద్ద మనుష్య వాక్కులతో "నాయనా! జాఱిపడినావా! ఎక్కడను దెబ్బ తగులలేదు గద తండ్రీ! కాలునొప్పి పెట్టలేదుగద బాబూ!" అని కొడుకు నడిగినదఁట!

---

## 33. భారతపద్యములు—ఉద్యోగ పర్వమునుండి.

యుద్ధ మొనర్చుట కిష్టపడక ధర్మరాజే కౌరవులతో సంధికై కృష్ణుని ధృతరాష్ట్రునియొద్దకు రాయబారిగాఁ బంపు చుఁజెప్పిన సందర్భమునందలి పద్యములు.

క. ఆపద గడవం బెట్టఁగ
నోపి శుభంబైన దాని కొనొడఁగూర్పఁగ; మా
కీపుట్టువునకుఁ బాండు
క్ష్మాపాలుఁడు నిన్నుఁ జూపి చేనియె మహాత్మా!

గీ. సమయ మిది మిత్రకార్యంబు చేకూఁ జేయ,
నీకతంబున నే మవి నీతుఁడైన
యాసుయోధనుతోడి పోరాట దక్కి,
యనుభవింతుము మాయంశ మగుధరిత్రి. 2

ఆ. కలహ మగుట లక్ష్మిఁ గారించుఁ, బ్రాణహా
నియును జేయు, నింత నిక్కువంబు,
పలువు రొకని గూడి పాఱుట, బల్లిదు
లనదచేతఁ జెడుట యును, ఘటించు. 3

క. జయ మగు, నోడుదు, మనుని
శ్చయ మొక్కఁడు లేదు, వినుము సమరమునఁ బరా
జయము మరణంబుకంటె హృ
దయపుటభేదనము చేయుఁ దథ్యం బనఘా. 4

క. కాన నవశ్యముఁ బెనఁకువ
గానియుపాయమునఁ బగఱఁ గడతేర్చుధృతిం
బూని నడచు నెవ్వఁడు, డెం
దానం జెయి వెట్టుకొని య తఁడు నిద్రించున్. 5

ఆ. పగయ కలిగె నేనిఁ బా మున్నయింటిలో
నున్నయట్లు కాక, యూఱడిల్లి
యుండు నెట్లు చిత్త మొకమాటుఁ ? గావున
వలవ దధికదీర్ఘ వైరవృత్తి. 6

చ. మనమునఁ బక్షపాతగతి
మాదెస మానుము, ధర్మనీతివ
ర్తనముల రెండుదిక్కుల హి
తంబును బెంపును గల్గునట్టి చో

ప్పున, విదురాదిసజ్జనుల
బుద్ధికి రా, ను చితంబుతోడి మె
ప్పునఁ, బరుసందనంబునను,
భూపతు లెల్ల నెఱుంగ, నాడుమీ ! 7

మ. సుతువాఁడై వినయంబు సేకొనక యే
చొప్పం దగం జెప్ప కా
ధృతరాష్ట్రుం డవినీతిఁ జేసినను, సం
ధింపంగ రా దంచు వే
గ తెగంబాఱకు, తెంపు సేయునెడ లో
కం బెల్ల మెచ్చం బ్రకా
శితధర్మస్థితి నొంది మామతము ని
శ్చింతంబు గాఁ జేయుమీ ! 8

ఆ. ఇన్ని సంకటముల ౹ నిబ్బంగి నెంతయు
నొగులుచి త్తవృత్తి ౹ నొవ్వ దీర్ప,
వెజ్జ వీవ కావె ? ౹ వేయేల ? యేగతి
నడపఁ దలఁచి, తదియ ౹ నాకుఁ బ్రియము. 9

వ. అని చెప్పి తలంచికొని వెండియు ని ట్లనియె. 10

క. నీవు సుయోధనుపాలికిఁ
బోవఁగ వల దనియు నొక్క ౹ బుద్ధి వొడమెడుఁ,
గోవింద ! యతఁడు మంత్రులుఁ
గావరులై చెక్క వినరు ౹ కార్యవచనముల్. 11

\+ \+ \+ \+ \+

ఆ. మేలు గాక, నీకుఁ ౹ బోలినట్లయిన, నం
దరిగి, యేము వారు ౹ నర్థిఁ బొంది

యుండునట్లు గాఁగ ళ నోడఁబాటుఁ గావింపు
మెల్లభంగి మనకు ళ నిదియ లెస్స. 12

క. మ మ్మెఱుఁగు, దెదిరి నెఱుఁగుదు,
నెమ్మి నెఱుఁగు, దర్గసిద్ధి ళ నెఱి యెఱుఁగుదు, వా
క్యమ్ముల పద్ధతి నెఱుఁగుదు,
పొ మ్మెవ్వఁడ నేను నీకు ళ బుద్ధులు సెప్పన్? 13

—: కృష్ణుఁడు ధర్మరాజుతోఁ గౌరవులదుర్నయంబు చెప్పుట. :—

మ. గురుభీష్మాదులు సూచుచుండ సభ మీ
కుం గీడు నాఁ డట్లు ము
ష్కరులై చేసిరి, యంత చేసియును బ
శ్చాత్తాపముం బొంద రో
పరు వా రెన్నఁడు, నట్టిచోటఁ గృపయున్
బంధుత్వముం దక్కు; మె
వ్వరుఁ గోపింపరె యాదురాత్మకులగ
ర్వక్రౌర్యముల్ సూచినన్? 14

క. మీతండ్రికి, భీష్మునకుం,
జేతోముద మొదవ భక్తి ళ సేయన తగు నీ,
కాతలకు నేనుఁ జేని, వి
ఖ్యాతంబుగ నీదువినయ ళ మభివర్ణింతున్. 15

క. చెలులుం జుట్టలు, దేశం
బులరాజులు వినఁగ, నీదు ళ పుణ్యచరిత్రం
బులు, నీవు ధర్మమార్గముఁ
దలఁచుటయు, న్దెలియఁ బలికెద ళ దం గురుసభలోన్. 16

తే. అనుయోధనుముక్కన ¶ నావి గలుగఁ
బుడమి నీ కీడు, గావునఁ ¶ బోర కలుగు;
నేను గయ్యాపుశకునంబు ¶ లెన్ని యేని
గంటి; నీ వనుత్సాహివి ¶ గాఁగ వలదు. 17

భీముఁడా వాక్యములను విని కృష్ణునితోఁ బలుకుట.

క. సమరంబు గలుగు ననుచును
మము వెఱపింపంగవలదు, ¶ మాధవ! నీ వా
కుమతి యగు ధార్తరాష్ట్రుఁడు
శమించుకార్యంబు నడపు ¶ సౌజన్యమునన్. 18

శా. పాపాత్ముండు,మదాంధుఁడాతులువనీకపం పెట్టునుం జేయఁగా
నోపం, డడ్డము సెప్ప రెవ్వరును, మాకనోద్రేకముం గర్వముం
గోపంబుంగనుఁ ద్రిప్ప,నా ప్రజనులంగగుదించుటం, బోయిన
ట్లే పోనిత్తురుగాన నిన్నతఁడు జోకలింబెట్టెడుం జోడుమీ!

ఉ. పాండవకౌరవుల్ గలసి ¶ పాలును నీరును బోలె నెమ్మనమై
నుండఁగ దుష్టచేష్టలనుకయోధనుఁ డింతలుసేసె, నాతఁడో
క్కండ కులక్షయంబునకుఁ ¶ గారణమం, బ్రదదిదప్ప, దైన,నీ
వెండన నేల? యాబిరుదుకనోపినయంతయుఁదీర్పు నేర్పునన్.

(అర్జునుఁడు శ్రీకృష్ణునితో సంధిఁగూర్చి తనయభిప్రాయము చెప్పుట)

తే. చెప్పఁగలయంతవట్టును ¶ జెప్పె నీ క
జాతశత్రుండు, వింటి వీ ¶ వాతెఱంగు,
మాకు నెల్లను బలుకంగ ¶ మాట లొండు
గలవె? యైనను జెప్పెదఁ ¶ గన్నయంత.

ఉ. నీ వెనరింపఁ బూనినప ¶ నిం గమలోదర! కీడు పుట్టునే?
కావనినట్లయుండి యవుఁగార్యము, లట్లగుటం బ్రయత్నసం

భావనచేత పౌరుషము ♦ పద్ధతి, తత్ఫలసిద్ధి పొందుచో
దైవము దోడ్పడన్వలయుఁ, ♦ దద్వ్యయము రెండును నీవినోదముల్.

తే. అలవి యెఱుఁగక ధార్తరా ♦ ష్ట్రులు గడంగి
మమ్ముఁ బఱచినపాటులు ♦ మానసమునఁ
జేవుటఁ బెట్టినవిత్తుల ♦ చేంద మొంది
యంకురింపక చెడిపోయె ♦ నంబుజాక్ష. 23

వ. అమ్మెఱకుల నెమ్మయినయినను

క. ఒడఁబఱిచి, మాకు వారికిఁ
బుడమి సగము గాఁగఁ జేసి ♦ పొందిపొసఁగి యుం
డెడునట్టి తెఱఁగు సేయుట
కడుమే, లది గౌరవము సు ♦ ఖంబును జేయున్. 25

క. నీకిట్టిది చిత్తమునకు
రాకుండిన యేని వలదు, ♦ రండి మెమ్మయి మీ
రీకార్యము సేయుం డని
మా కానతియిమ్ము, కంస ♦ మర్దన! తెలియన్. 26

మ. హితమిబ్భంగిది, మాకుధర్మము తెఱం♦గిట్లుండు, నం చేనునీ
మతిబోధింపవలంతినే? హితముధ♦ర్మంబున్ విచారించి చూ
చి, తగంబొమ్మని యేదిపంచి, తదని♦శ్చింతంబునం జేసి, యు
న్నతిఁబొందంగల వారమైయునికిఁ గృ♦ష్ణా నేఁడుగావచ్చెనే?

—(ద్రౌపది కృష్ణునితోఁ దన మున్ను పడిన భంగపాట్లు సెప్పుట.)—

చ. వరమునఁ బుట్టితిన్, భరత
వంశముఁ జొచ్చితి, నందుఁ బాండుభూ
వరునకుఁ గోడలైతి, జన
వంద్యులఁ బొందితి, నీతివిక్రమ

స్థిరు లగు పుత్రులం బడసి
తిన్, సహజన్ములప్రాపు గాంచితీ
సరసిజనాభ ! యిన్నిటఁ బ్ర
శస్తికి నెక్కినదాన నెంతయున్. 28

ఉ. నీవు సుభద్రకంటెఁ గడు నెయ్యముగౌరవముం దలిర్ప సం
భావనసేయు, దిట్టినను బంకజనాభ ! యొకండు రాజసూ
యావభృథంబునందు, శుచియై వెనుపొందినవేణి వట్టి, యీ
యేవురుఁ జూడఁగా సభకు నీడ్చెఁ, గులాంగన నిట్లొనర్తురే?

ఉ. ఆసభ నేకవస్త్ర యగు నట్టిననుం గొనివచ్చి. నొంచు దు
శ్శాసనుఁ జూచుచుం, బతులు సంభ్రములై, తగుచేష్ట లేక, నా
యాసలుమాని, చిత్రములయాకృతినున్న యెడన్ ముకుందవి
శ్వాసముతోడ నిర్గొలువ వచ్చె మనం, బదియుం దలంపవే?

క. ఇవి దుస్ససేను వ్రేళ్లం
దవిలి సగము ద్రెవ్విపోయి దక్కినయవి ; కౌ
రవులకడఁ దీటుమాటల
యవసరమునఁ, దలఁపవలయు నచ్యుత ! వీనిన్. 31

—(శ్రీ కృష్ణుని రాయబారము)—

క. జలదస్వనగంభీరత
నెలుఁ గొప్పఁగ, దంతదీప్తి తెసఁగ, ముకుందుం,
డలరుచెవుల నఖిలజనం
బులు విన, ధృతరాష్ట్రభూవి భున కిట్లనియెన్. 32

క. జననాథ ! నీయెఱుంగని
పనులు గలవె ? యైనఁ దగవు బరమహితంబుం

దనవారికిఁ జెప్పన తగు
నని వచ్చితి భారతాన్వ యము ప్రియ మొందన్. 33

క. క్షీరోదకగతిఁ బాండవ
కౌరవు లొడఁగూడి మనికి కార్యం; బది నీ
వారసి నడపుము; వారన
వీ రనఁ గురుముఖ్య! నీకు వేఱుం గలదే? 34

చ. భరతకులంబు, ధర్మమును
బాడియు సత్యముఁ బొత్తుఁ బెంపునుం
గరుణయుఁ గల్గియుండు ననఁ
గా నుతి గన్నది; యందు సద్గుణో
త్తరులరు నీవు నీయనుఁగుఁ
దమ్ముఁడు, నీతనయుల్ యశోధురం
ధరశుభశీలు, రీసుచరి
తక్రమ మిప్పుడు దప్ప నేటికిన్? 35

శా. ఈవంశంబున కెల్ల నీవ కుదు; రిం కెవ్వారిచెందంబు లె
ట్లై వర్తిల్లినఁ, గీడు మేలుఁ దుది నీకయం దొందెడుం; గాన స
ద్భావంబారసి లోనిపొత్తు వెలిన్వ్యక్తంబుగా జనస్తుత్యముల్
గావింపం దగు నీక యెవ్విధమునం గౌరవ్యవంశాగ్రణీ! 36

ఉ. కౌరవపాండవుల్ తెఱఁగు గ్రక్కొని శాంతతఁ బొందియున్కియే,
లారయ నాకు నీకుఁ గుల మంతకు నీనృపకోటి కుర్వికిం;
బోరిత మైన, నింతకును బుట్టు మహాపద; గావునన్ ధరి
త్రీరమణాగ్రగణ్య! గణుతించి యవశ్యముఁ బొందొనర్పవే.

ఉ. అందు వృకోదరార్జునుల నాహవరంగమునందు మీఱువా
రెందఱొ యెన్నుమా! యిచట నీగురుభీష్ములఁ గ్రేణిసేయువా

రెండఱో! వారు వీరు నని నీల్గుటకంటె, భవద్బలంబులై
యందఱుఁ గూడు టొప్పదె? జ నాధిప! శాంతియొనర్పు
మెమ్మెయిన్, 38

ఆ. పాండవులకుఁ దగిన పాలు మేదినిఁ బంచి
యిచ్చుకంటెఁ గార్య మెద్ది గలదు?
ధర్మ మెద్ది? సముచి తం బగువిధ మెద్ది?
శక్య మెద్ది? చెపుఁడ! వాక్యవిదులు. 39

---

రెం డ వ భా గ ము.

# వ్యాకరణ విషయములు.

పూర్వవాచక పుస్తకములలోని విషయములు విపులముగా బోధించుటయేకాక, యీతరగతిలో నీక్రింది వ్యాకరణాంశములఁ జెప్పుట మంచిది. ఉదాహరణములఁ బుస్తకమునుండియే, సాధ్యమైనంతవఱ కేర్చి చూపవలెను. ఉపమాలంకారమును గూర్చి పూర్వ పుస్తకములో నించుక వ్రాసినాము. దీనిలో రూపకాలంకారమును గుఱించి కొంచెము చెప్పెదము.

1 పురుషులనుగాని స్త్రీలనుగాని మానవేతర జంతువులనుగాని జడములనుగాని తెలుపు నామములు మరలమరలవాడ నక్కఱలేకుండ, వానికి బదులుగా నుపయోగపడు పదములు “సర్వనామము లనఁబడును. ఉ॥ నీవు, నేను, మనము, తాను వాఁడు, వీఁడు, ఎవఁడు, అది, ఇది, ఎది (ఏది) అతఁడు, ఆమె, అన్ని, ఇన్ని, కొన్ని, ఎన్ని, పెక్కు మొదలగునవి.

ముఖ్యమైన సర్వనామముల విభక్తివచనరూపము లిచేట వ్రాసెదము. వ్రాసిన మచ్చురూపములం బట్టి వ్రాయని యితరరూపముల సులభముగా గ్రహించుకొనవచ్చును.

(a) ప్ర॥ నీవు (ఈవు)—మీరు, మీరలు, (ఈరు, ఈరలు)

ద్వి॥ నిన్నున్, నినున్—మిమ్మున్, మిమున్.

ఇత॥ వి॥ నీచేతన్, నీకున్ మొ;—మీచేతన్, మీకున్ మొ.

(b) ప్ర॥ నేను (ఏను)—మేము (నేము, ఏము).

ద్వి॥ నన్నున్, ననున్,—మమ్మున్, మమున్.

ఇ॥ వి॥ నాచేతన్, నాకున్ మొ,—మాచేతన్,మాకున్, మొ.

(c) ప్ర॥ మనము (ఏకవచనము లేదు)

ద్వి॥ మనలన్ (మనను-అనఁగూడదు)

ఇ॥ వి॥ మనచేతన్, మనకున్ మొ

(d) ప్ర॥ తాను—తాము, తారు, తమరు.

ద్వి॥ తన్నున్, తనున్, తమ్మున్, తమున్ (తనను, తమను-అనఁగూడదు)

ఇ॥ వి॥ తనచేతన్ మొ,—తమచేతన్ మొ. తాము, తమకున్, తమ్మున్, తమచేతన్, మొదలగునవి పూజ్యార్థమందు, నీవు, నీకున్, నిన్నున్, నీచేతన్ మొదలగువానికి బదులుగా వాడుచున్నారు.

(e) ప్ర॥ వాఁడు—వారు, వారలు, వాండ్రు.

ద్వి॥ వానిన్—వారిన్, వారలన్, వాండ్రన్.

ఇ॥ వి॥ వానిచేతన్ మొ-వారిచేతన్, వారలచేతన్, వాండ్రచేతన్ మొ.

(f) ప్ర॥ వీఁడు—వీరు, వీరలు, వీం(డ్రు, తక్కినవిపైని జెప్పిన 'వాఁడు' శబ్దమునకువలెనే వచ్చును.

(g) ప్ర॥ ఏవాఁడు—ఏవారు, ఏవారలు, ఏవాం(డ్రు.
ఎవ్వాఁడు—ఎవ్వారు, ఎవ్వారలు, ఎవ్వాం(డ్రు.
ఎవ్వఁడు—ఎవ్వరు, ఎవ్వం(డ్రు.
ఎవఁడు—ఎవరు, ఎవం(డ్రు.
ఏఁడు—ఏరు.

ద్వి॥ ఏవానిన్—ఏవారిన్, ఏవారలన్, ఏవాం(డ్రన్.
ఎవ్వానిన్—ఎవ్వారిన్, ఎవ్వారలన్, ఎవ్వాం(డ్రన్.
ఎవ్వనిన్—ఎవ్వరిన్, ఎవ్వం(డ్రన్.
ఎవనిన్—ఎవరిన్, ఎవం(డ్రన్.
ఏనిన్—ఏరిన్.

ఇతర విభక్తివచనరూపము, లాయాప్రత్యయములు ద్వితీయకుఁ జేర్చినయెడల నేర్పడును.

(h) ప్ర॥ అది, అద్ది—అవి, అవ్వి,
ఆయది, అయ్యది—ఆయవి, అయ్యవి.
ద్వి॥ దానిన్, ఆదానిన్, అద్దానిన్—వానిన్, (వాటిన్-అనఁగూడదు)

స॥ దానన్, దానియందున్ మొ-వానియందున్ - మిగిలినవిభక్తులు పై శబ్దమునకువలెనే చేసికొనవలెను.

(i) ప్ర॥ ఇది, ఇద్ది, ఈయది ఇయ్యది—ఇవి. ఈయవి, ఇయ్యవి.
ద్వి॥ దీనిన్, ఈదానిన్, ఇద్దానిన్—వీనిన్. (వీటిన్ అనఁగూడదు)

తక్కినవి పై దానికివలెనే యేర్పడును.

(j) ప్ర॥ ఏది, ఎద్ది, ఎది—ఏవి, ఎవ్వి, ఎవి.
ఏయది, ఎయ్యది—ఏయవి, ఎయ్యవి,
ద్వి॥ దేనిన్, ఏదానిన్, ఎద్దానిన్—వేనిన్, ఏవానిన్, ఎవ్వానిన్.
స॥ ఏదానన్, ఏదానియందున్, దేనన్, మొ.
ఏవానియందున్. వేనియందున్, మొ.
(వేటియందున్ - అనఁగూడదు)
కడమవి, పై రూపములఁబట్టి, యేర్పఱుచుకొనవచ్చును.

"ఏది" యొక్క మహదర్థకములు (పురుషులఁ దెల్పునవి)—"ఎవఁడు" మొదలగునవి—మహాత్యర్థకములు (ఆఁడువారిని దెల్పునవి)—'ఎవతె', 'ఎవ్వతె', 'ఎవ్వరితె', 'ఎవరితె', 'ఎవ్వర్తె'. ఇఁకను గొన్ని రూపము లున్నవి. అవి సాధారణముగా వాడుకలో లేవు. వీనిబహువచనరూపములు 'ఎవఁడు' మొదలగు వానియొక్క బహువచనరూపములే యగును.

(k) ప్ర॥ ఆతఁడు, అతఁడు—వారు, వారలు, వాండ్రు.
ఇ॥ వి॥ అతనిన్, ఆతనిన్, అతనిచేతన్ మొ.
వారిన్, వారలన్, వాండ్రన్, వారిచేతన్, మొ
ఇట్లు-ఇతఁడు. ఎతఁడు.

(l) ప్ర॥ ఆమె—వారు, వారలు, వాండ్రు.
(ఆపె. ఆకె) ఇట్లు—ఈమె, ఏమె.
కడమవి యూహించుకొనవచ్చును.

(m) అన్ని, ఇన్ని, ఎన్ని, కొన్ని—వీని కేకవచనములు లేవు. ఇవియుమహదర్థక బహువచనములు. ఔపవిభక్తికములు గాన 'అన్నిటిన్, అన్నింటిచేతన్', మొదలగురూపములు

వచ్చును. వీనిమహన్మహత్త్వార్థకరూపములు—అందఱు ; ఇందఱు, ఎందఱు, కొందఱు; ఇవిమాత్ర మౌపవిభక్తికములు గావు, కనుక "అందఱన్, అందఱకు, అందఱందు, అందఱయందు", మొదలగురూపములువచ్చును. (అందఱికి, అందఱిచేతమున్నగు రూపము లసాధువులు).

(n) ప్ర॥ పెక్కు (ఔపవిభక్తికము - బహ్వర్థకము, రూపములో నేకవచనము) - పెక్కులు.

ద్వి॥ పెక్కిటిన్,—పెక్కులన్.

తృ॥ వి॥ పెక్కిటన్, పెక్కిటిచేతన్, పెక్కిటియందున్ మొ. పెక్కులచేతన్, పెక్కులందున్. పెక్కులయందున్ మొ.

దీని మహన్మహత్త్వార్థకములు — పెక్కండ్రు, పెక్కురు, పెక్కండ్రన్, పెక్కురన్, పెక్కండ్రచేతన్, పెక్కురకై మొ. (పెక్కండ్రిచేత, పెక్కురికొఱకు— ఇవి తప్పు రూపములు.)

(0) పలుశబ్దము—బహ్వర్థకము.

మహన్మహత్త్వార్థక రూపములు—పలుగుండ్రు, పలుగురు, పలువురు—పలుగుండ్రన్, పలుగురన్, పలువురన్, పలుగురచేతన్ పలువురయందున్, మొదలగునవి. (అనౌపవిభక్తికముగాన-పలువురిచేతన్ మొదలగునవి తప్పురూపములు.)

(II) అర్ధానుస్వారము యొక్కయు, శకట రేఫము యొక్కయు నుపయోగములు.

(a) ఈ రెండును తెనుఁగులోనేకాని సంస్కృతములో లేవు. కనుక నివి యున్నమాటలుశుద్ధాంధ్రపదము లని తెలిసికొనవచ్చును:—

ఉ॥ తోఁక, దూఁకుట, వాఁడు, విఱుచు చెఱువు, మఱపు

(b) అఱసున్న యున్న పదమున కొకయర్థమును, లేని యాపదమునకే మఱియొక యర్థమును బెక్కు చోట్ల నుండును, శకటరేఫమునకు నిట్లే,—ఉ॥ (1) వాఁడు ధనవంతుఁడు. పూవు వాడిపోవుచున్నది. ఈమాట వాడుకొనుచున్నాము. (2) వారికిని వీరికిని బొత్తెట్లు కలుగును ? కలుఁగులో నెప్పుడును చేయిపెట్టకుము. (3) గాయములనుండి రక్తము కాఱుచున్నది; పెద్దమనుష్యులయెదుట నట్టి కాఱు లాడకు. కమ్మరి కాఱు పట్టుకొని వచ్చుచున్నాఁడు. వానకారులో వరి యూడ్తురు. ఆతఁడాడినమాట కారుచిచ్చువలె నామనస్సు దహించుచున్నది. అది వట్టికారు పిందె, దానిని దినకుము. (4) పాము, కోఱలతోఁ గఱచి విషముఁగక్కును. వారిలోఁ గోరమీసములవారెందఱో యున్నారు.

(c) హ్రస్వాక్షరము పిదప నఱసున్నయున్న నది నిండుసున్నయగును. అట్టి పదములకు రెండు రూపము లున్నవని గ్రహించుకొనవచ్చును. ఉ॥ కొఱఁత (కొఱంత), వడఁకు (వడంకు), మునుఁగు (మునుంగు), కనుఁగొను (కనుంగొను), ఎలుఁగు (ఎలుంగు), చూడుఁడు (చూడుండు) దానిఁజంపెను (దానిం జంపెను),

III వాడుకలోను వ్రాఁతలలోను, బెక్కు సంస్కృత పదములు కానిపించుచున్నవి. అందులో నక్షరములు తాఱుమాఱై చాల మార్పునొందిన పదములను 'తద్భవము' లనుచున్నాము. కొంచెముగాఁ బ్రత్యయవికారము మాత్రము

చెందినవానిని 'తత్సమము' లనుచున్నాము. ఉ॥ గోడ, సెజ్జ, కొంగ, ఇట్టివి తద్భవములు; ధీరుఁడు, ధర, ధనము, ఇట్టివి తత్సమములు. సంస్కృతపదములు తత్సమము లెట్లగునో యతిసంగ్రహముగా నిటఁ జెప్పెదము.

సంస్కృత శబ్దములలోఁ గొన్నిటి, కచ్చు చివర నుండును, కొన్నిటికి హల్లు కొన నుండును. మొదటివి 'అజంతములు', రెండవవి 'హలంతములు.'

## అజంతములు.

(a) 1. సంస్కృతములో 'అ' చివరనుండి, పురుషవాచక(మహ దర్థక) మగు శబ్దమునకు "ఁడు" వచ్చును. ఉ॥ పురుషుఁడు, శూరుఁడు ; తస్కరుఁడు.

2. స్త్రీవాచక (మహత్యర్థక) మైనప్పుడు, (ఁడు) రాదు— ఉ॥ దార.

3. స్త్రీపురుషవాచకము కానప్పుడు (అమహదర్థకమైనప్పుడు) 'ము' వచ్చును. ఉ॥ వనము, ధనము, కాలము.

4. మహద్వాచకము లగు, మిత్ర, శరణ, ప్రధాన, పాత్రాదులకు 'ఁడు' కాని 'ము' గాని రావచ్చును. ఉ॥ మిత్రుఁడు, మిత్రము, శరణుఁడు, శరణము, మొ.

చరిత్రాదులకు 'ము' లోపింపవచ్చును. ఉ॥ చరిత్రము, చరిత్ర. ఇట్లు చరిత, అలక, అభిలాష, అక్షత, తరంగ, ఘోష, భ్రమ, విజృంభణ, వధ, వేగ, స్ఫురణ, హంస మొ.

5. 'ఆ' చివరఁగల యన్నిటికిని దీర్ఘము మాత్రము పోవును. 'ఁడు' కాని 'ము' కాని రాదు. ఉ॥ రమ, వనిత, కాంత.

అవి మహతీవాచకములు కాకపోవచ్చును. ఉ॥ క్షమ, దయ, శర్కర, కుండిక, విద్య, దేవత, ఘనత.

6. ఏకాక్షరము,లట్లేయుండును.ఉ॥ క్ష్మా(భూమి),మా(లక్ష్మి).

7. కంధరాదులకు రెండేసి రూపములు వచ్చును. ఉ॥ కంధరము, కంధర. ఇట్లు నాసిక, భిక్షు, దంష్ట్ర, గ్రీవ, పాదుక, ఉల్క మొ.

(b) 1. 'ఇ' అంతమందుఁగల యన్ని శబ్దములు తెనుఁగునఁ గూడ 'ఇ' అంత మందుఁగలవియే యగును. ఉ॥ హరి గిరి, కవి, రవి.

2. 'ఈ' చివరనున్నవి తెనుఁగున హ్రస్వాంతములగును. ఉ॥ ధాత్రి, శ్రోణి, వేణి.

3. అట్టి పదము లేకాక్షరములైనయెడల హ్రస్వమురాదు. ఉ॥ స్త్రీ, శ్రీ, హ్రీ (సిగ్గు,) భీ (భయము), ధీ (బుద్ధి.)

(c) 1. 'ఉ'చివరనున్నయెడల మహదర్థకమునందు 'వు' గాని 'ఁడు' గాని వచ్చును, ఉ॥ విష్ణువు, విష్ణుఁడు. శంభువు, శంభుఁడు. గురువు, గురుఁడు.

2. ఇతరములకు 'వు' మాత్రమే వచ్చును. ఉ॥ తరువు, ధేనువు.

3. 'ఊ' చివరనున్న వానికి దీర్ఘముపోవును, 'వు' వచ్చును. ఉ॥ వధువు.

(d) 1. 'ఋ' చివరనున్నవానికి 'ఋ' పోయి 'అ' వచ్చును. ఉ॥ భ్రాత, కర్త, భర్త, హంత, జామాత.

2. విధాతృ, ధాతృ, దాతృ, సవితృ, నేతృ, శబ్దములకురెండేసి రూపములువచ్చును. ఉ॥ విధాత, విధాతృఁడు; ధాత ధాతృఁడు; మొ.

(e) 1. దర్భ, పనసశబ్దములు—దర్భ, పనస—అగును.

2. భూశబ్దము భువి యగును.

3. నౌశబ్దము - నావ యగును.

4. దూత, యోధ, శుంఠ, శబ్దములు - దూత, దూతుఁడు శుంఠ, శుంఠుఁడు; యోధ, యోధుఁడు ; అగును.

5. వృద్ధ, మూర్ఖ, నీచ, గృహస్థ, చార్వాక, శబ్దములు-వృద్ధుఁడు వృద్ధు ; మూర్ఖుఁడు, మూర్ఖు ; నీచుఁడు. నీచు ; గృహస్థుఁడు, గృహస్థు ; చార్వాకుఁడు, చార్వాకు ; అగును.

6. అర్ఘ (వెల), ధర్మ, శబ్దములు—అర్ఘము, అర్ఘువు ; ధర్మము, ధర్మువు ; అగును.

7. విధాశబ్దము విధమగును.

8. రై (ధనము), గ్లౌ (చందమామ) శబ్దములు, రో, రై, గ్లో, గ్లా, అగును

హలంతములు.

(a) 1. క్, ట్, త్, ప్, స్, ఇట్టివి చివర నున్నప్పుడు హల్లునకు ద్విత్వమును 'ఉ' ను వచ్చును.
ఉ॥ రుక్కు [రోగము], రుట్టు [కోపము], మరుత్తు [గాలి] కకుప్పు [దిక్కు], పయస్సు [పాలు] వయస్సు, సరస్సు.

2. దీర్ఘమునకుతరువాతనవి వచ్చిన, ద్విత్వము రాకపోవచ్చును. ఉ॥ వాక్కు, వాకు; స్వరాట్టు, స్వరాటు [బ్రహ్మము].

3. కొన్ని సకారాంతముల కంత్య సకారము లోపించి యజంతములకువలె రూపములుగూడ నేర్పడును. ఉ॥ తేజము, తేజస్సు ; వక్షము, వక్షస్సు ; ఉరము, ఉరస్సు; అర్చి, అర్చిస్సు [మంట] ధనువు, ధనుస్సు ; ఆయువు,

ఆయుస్సు:—(సంస్కృత నిఘంటువులో నిందుఁ జెక్కు-
పదము లజంతములుగాఁగూడ నీయఁబడినవి.)

4. కొన్నిటికి మూఁడురూపము లుండును. ఉ॥ మనము, మనసు, మనస్సు : ఇట్లు శిరము, సదము. [సభ].

(b) 1. 'వత్' 'మత్' మొదలగునవి చివరనుండువాని కీక్రింది రీతిగా రూపము లేర్పడును:—

శ్రీమంతుఁడు[శ్రీమతి, శ్రీమంతురాలు, శ్రీమంతము] గుణవంతుఁడు [గుణవతి, గుణవంతురాలు, గుణ వంతము]. విద్వాంసుడు [విదుషి, విద్వాంసురాలు, విద్వాంసము.]

2. స్రక్:—స్రజము [పుష్పమాల],

3. ముత్:—ముదము.

4. ఋత్విక్:—ఋత్విక్కు, ఋత్విజుఁడు.

5. హనుమత్:—హనుమంతుఁడు, హనుమానుఁడు [భగ వంతుఁడు, భగవానుఁడు].

(c) 'న్' చివరనున్నవాని కీ క్రిందివిధముగా రూపములు వచ్చును.

కర్మము,-(కరుమవు), విశ్వకర్మ, కృష్ణవర్త్మ, యజ్వ, బ్రహ్మ, [చతుర్ముఖ బ్రహ్మ]; బ్రహ్మము [పర బ్రహ్మము]; ఆత్మ. ఆత్మము, ఆత్ముఁడు : విష్ణు శర్మ, విష్ణుశర్ముఁడు ; మహిమ, మహిమము; గరిమ, గరిమము మొ.

(d) 1. రాజన్-రాజె, మృగరాజె, వృక్షరాజము.

2. సంపత్, ఆపత్-సంపద, సంపత్తు, ఆపద, ఆపత్తు.

3. జగత్-జగము, జగత్తు,

4. ఇంద్రజిత్-ఇంద్రజి, ఇంద్రజిత్తు, ఇంద్రజిత్తుఁడు.

5. పథిన్-పథము.

6. అంగిరస్-అంగిరసుఁడు అంగిరుఁడు. ఇట్లు ప్రచేతస్ ఊర్ధ్వరేతస్, ఉగ్రశ్రవస్],

7. వేధస్ [బ్రహ్మ]-వేధ.

8. పురోధస్ [పురోహితుఁడు]-పురోధ, పురోధసుఁడు.

9. దివ్-దివి.

10. హృత్-హృది.

IV. పూర్వవాచకపుస్తకములలో విభక్తులఁగూర్చి కొంచెము చెప్పినాము. ఒక విభక్తికి మాఱుగ నొక విభక్తి యొకానొకప్పుడు రావచ్చును.

(a) తృతీయకు షష్ఠి రావచ్చును. ఉ॥ నే నెవరికిఁ జెప్పను [తో]. అతని కిట్లంటిని [తో].

(b) పంచమికి షష్ఠివచ్చును. ఉ॥ దొంగలకు భయపడుదురు. (వలన), ప్రయాణమునకు డస్సినాఁడు [వలన] వానికి నలుగురు కొడుకులు పుట్టినారు [వలన],

(c) 'ఉండి' యనునది దాదాపుగా 'వలన' యొక్క యర్థము నిచ్చును. ఉ॥ బాధనుండి యెట్లో తప్పించుకొన్నాను. యుద్ధమునుండి యనేకనష్టములు వచ్చును.

ద్వితీయాసప్తముల కీ 'ఉండి' చేర్తురు. ఉ॥ ఊరి నుండి. ఊరనుండి, వనమునుండి. వనమందుండి, [దానివలననుండి యని కూడఁ బ్రయోగము లున్నవి].

(d) జడవాచకముల తృతీయకు సప్తమి వచ్చును. ఆ రెంటికి ద్వితీయవచ్చును.—

ఉ॥ గోటఁ జిమ్మునది గొడ్డటఁ జిమ్మకుము. [గోటి-చేత గొడ్డటిచేత]. ఆకొమ్మఁ గత్తిని నఱకెను[చేత] కృష్ణుఁడు ద్వారక నుండెను. [అందు].

(e) అచేతనవాచకముల ద్వితీయకుఁ బ్రథమవచ్చును.—
ఉ॥ ఆమె నగలు పెట్టుకొనెను. [లను] నేను సరకులు కొన్నాను [లను]. చెట్టు నఱకకుము [ను].

(f) కాలమును దూరమును స్థలమును దెలుపుమాట, లితర విభక్త్యర్థములందుఁ బ్రథమలో నుండును: — ఉ॥ వాఁడు రేపువచ్చును. ఆపని నాలుగురోజులు చేసి నాఁడు. బండిమీఁద నొక యామడ పోయితిని. వాఁడు రామేశ్వరమువెళ్లెను. ఆమె యింగ్లండు దేశమువెళ్లి వచ్చినది. నేను నాలుగూళ్లు తిరిగివచ్చితిని.

(g) సంఖ్యావాచక పదములకును, వానితోనుండు విశేష్య ములకును నితరవిభక్తులకు మాఱుప్రథమ రావచ్చును. ఉ॥ అన్నిగుఱ్ఱములను, గుఱ్ఱములన్నిటిని, రెండు కత్తులకు, కత్తులు రెంటికి, కొన్నిబాధలచేత, బాధలు కొన్నిటిచేత.—

(h) షష్ఠియొక్క విశేషణములకుఁ బ్రథమ రావచ్చును. ఉ॥ సుగుణాభిరాముఁడు రామునకు నమస్కరించెదను.

(i) 1. ఇల్లు వెడలెను [ఇంటినుండి].
2. వాహనము దిగెను [వాహనమునుండి].

3. సుఖముంటిమి [సుఖముతో నుంటిమి].

V. ఇందులోమఱి రెండు సంస్కృతసంధులు వ్రాసెదము.

(a) వృద్ధిసంధి-ఆ, ఐ, ఔ-వీనికి వృద్ధులని పేరు. కాని సంధిలో 'ఐ' 'ఔ' లు మాత్రము వచ్చును.

1. భీష్మ+ఏకాదశి=భీష్మైకాదశి.
2. పరమ+ఐశ్వర్యము=పరమైశ్వర్యము.
3. మానస+ఓకస్సు=మానసౌకము [హంస].
4. చిత్త+ఔన్నత్యము=చిత్తౌన్నత్యము.
5. అబలా+ఏకత్వము=అబలైకత్వము.
6. అబలా+ఐకమత్యము=అబలైకమత్యము.
7. కాంతా+ఓజస్సు=కాంతౌజస్సు.
8. జాయా+ఔచిత్యము=జాయౌచిత్యము.

అ ఆ లకు ఏ ఐ లు పరమైనప్పుడు. 'ఐ' కారమును, ఓ ఔలు పరమగు నపుడు 'ఔ' కారమును, వచ్చును.

(b) యణాదేశసంధి.—య, ర, ల, వ, లకు యణ్ణుల నిపేరు. కాని సంధిలోఁ దఱచుగా య, ర, వ, లు మాత్రమే వచ్చును.

1. హరి+అంసము=హర్యంసము.
2. గౌరీ+అంశము=గౌర్యంశము.
3. హరి+ఆధిక్యము=హర్యాధిక్యము.
4. గౌరీ+ఆననము=గౌర్యాననము.

[ఇక్ష్వా-వాప్యుదకము, ప్రత్యేకము, ప్రత్యుపకారము, మొదలగునవి.]

ఇ, ఈ లకు నితరములైన యచ్చులు పరమగు నప్పుడు 'య' వచ్చును.

1. గురు+అతిశయము=గుర్వతిశయము.
2. గురు+ఆజ్ఞ=గుర్వాజ్ఞ.
3. వధూ+అనురాగము=వధ్వనురాగము.
4. వధూ+ఆనందము=వధ్వానందము.

[ఇట్లే గుర్వింగితము, మధ్వీహ మొదలగునవి.]

ఉ, ఊ, లకుఁ దక్కినయచ్చులు పరమగునపుడు 'వ' వచ్చును.

1. ధాతృ+అంశము=ధాత్రంశము.
2. ధాతృ+ఆనందము=ధాత్రానందము.
3. పితృ+ఇచ్ఛ=పిత్రిచ్ఛ.
4. మాతృ+ఈర్ష్య=మాత్రీర్ష్య.
5. ధాతృ+ఉన్నతి=ధాత్రున్నతి.
6. భ్రాతృ+ఊఢ=భ్రాత్రూఢ.

ఋకారమున కితరాచ్చులు పరమగునప్పుడు 'ర' వచ్చును.

VI. ఇందులో బహువ్రీహిసమాసమును గూర్చి యించుక చెప్పెదము.

అన్యపదార్థ ప్రధానము బహువ్రీహి.

అనఁగా బహువ్రీహి, సమాస మందలి పదములచేఁ దెల్పఁబడువానిని గాక వేఱొకదానిని దెలుపును. ఉ॥ ముక్కంటి [మూఁడుకన్నులు గలవాఁడు—— శివుఁడు.] ఈయర్థము 'మూఁడు' అనుదానిలోను

లేదు. 'కన్ను' అనుదానిలోను లేదు. అవిరెండును గలిసి 'శివుడు' అని యర్థ మిచ్చుచున్నవి. ఇట్లే చేలివెలుఁగు [చంద్రుఁడు.] ఇతరోదాహరణములు- త్రిలోచనుఁడు, శీతకరుఁడు, చక్రపాణి, పీతాంబరుఁడు, మాంసాశనుఁడు, ధీరచిత్తుఁడు మొదలగునవి.

VII. రూపకాలంకారము;— ఉపమాలంకారము నందువలె, నుపమేయ ముపమానమును బోలియున్న దని చెప్పక, యదియే యిదియని యారోపించి చెప్పినచో నదిరూపకాలంకార మగును. [1] ఉ॥ ముఖచంద్రుఁడు = ముఖమనుచంద్రుఁడు. [2] చూపుఁదూపు = చూపనుబాణము, మొదలగునవి. శ్రీరాముఁడు తన బాణాగ్నిచే రాక్షసవనమును గాల్చెను. 'బాణాగ్ని' 'రాక్షసవనము' - ఈ రెండు చోట్ల రూపకాలంకారమున్నది,

# మూఁడవ భాగము.

## అనుబంధములు.

### 6-వ పాఠమున కనుబంధము.

భూకక్ష (కక్ష్యము)—The Orbit of the Earth.
అక్షరేఖ—The Axis of the Earth.
ఉత్తరధ్రువము—The North Pole.
దక్షిణధ్రువము—The South Pole

వృత్తము
వర్తులరేఖ } —A Circle.

భూమధ్యవృత్తము—The Equator

సమాంతరవృత్తములు
ప్రాక్పశ్చిమవృత్తములు } —The Parallels of Latitude.

ఉత్తరవృత్తము—The Arctic Circle.
దక్షిణవృత్తము—The Antarctic Circle.
అయనవృత్తములు—The Tropics.
కర్కాటకవృత్తము—The Tropic of Cancer.
మకరవృత్తము—The Tropic of Capricorn.
(ఇంగ్లీషువారి మేఁక మన మకరము)
ఉష్ణమండలము—The Torrid Zone or The Tropics.
సమశీతోష్ణమండలములు—The Temperate Zones.
శీతలమండలములు—The Frigid Zones.

### 16-వ పాఠమున కనుబంధము.

1. వడగండ్లు
 కరకలు } —Hail Stones.
2. గడ్డమంచు—Ice.

3. దూదిమంచు—**Snow.**

4. సంఘాతతుషారము—**Frost.**

5. హిమావధి—**Snow line.**

6. హిమవాహినులు—**Glaciers.**

7. హిమపర్వతములు—**Icebergs.**

8. నీటిమంచు—**Dew.**

9. తుషారబిందువులు—**Dew-drops.**

10. పొగమంచు—**Fog.**

11. మూడమంచు—**Mist.**